శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

## నలువది నాలుగవ వార్షికమహోత్సవ
## వ్యాససంపుటి



దేశభాష లందుఁ దెలుఁగు లెస్స



సంపుటము ౪౫ సంచిక ౧-౩

# సంపాదకవర్గము

ప్రధాన సంపాదకులు :

శ్రీ కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. యస్.

సహాయ సంపాదకులు :

శ్రీ ఈయున్ని వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.

శ్రీ విద్వాన్ వేదుల రామచంద్రశాస్త్రిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

శ్రీ వ్యాకరణ విద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.

శ్రీ బండారు తమ్మయ్యగారు.

# విజ్ఞప్తి

పరిషద్వార్షికమహోత్సవసభ లీ సంవత్సరము మార్చి 16, 17, 18 తేదీలలో రాజమహేంద్రవరమున — రామకృష్ణసేవామందిరములో జరిగినవి. సభలం దమపురమున సాహాయ్యించి యన్నివిధముల సహకరించి జయప్రదముగావించిన శ్రీ జె. యం. యస్. ఆచార్యగారిని-తదితర ప్రముఖులను-సభ్యులను మే మెంతయు నభినందించుచున్నాము.

సభల యధ్యక్షోపన్యాసములు, నింకను గొందఱ ప్రముఖోపన్యాసకుల వ్యాసములు, నాలస్యముగఁ జేరుటవలన వార్షికమహోత్సవపు సంచిక యనుకొన్నంత తొందఱగా వెలువరింపలేనందులకు మే మెంతయుఁ జింతిల్లుచున్నాము. అప్పటికిఁ గొంతమంది రచయితల వ్యాసములు - శ్రీ టి. హెచ్. ఎమ్. సదాశివయ్యగారి (డిస్ట్రిక్టు జడ్జి) సభా ప్రారంభోపన్యాసము — శ్రీ మత్తిగుముల గుడిమెళ్ల వరదాచార్యులవారి వ్యాకరణ సభాధ్యక్షోపన్యాసము - జేరనందున నిందుఁ బ్రచురింపలేకపోతిమి. పాఠకులీ కొఱఁతను మన్నింపగలరని యాశించుచున్నాము.

సంపాదకులు.

# విషయసూచిక

శ్రీ

ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు

సంపుటము ౪౫ { దుర్ముఖి సంవత్సరము / చైత్ర వైశాఖ-జ్యేష్ఠాషాఢమాసములు } సంచిక ౧-౨

# దుర్ముఖి—ప్రశంస

శ్రీ ఎస్. టి. . రాఘవాచార్యులు.

ఉ. సుస్మితా! దుర్ముఖాకృతిన్
    దుర్మదులౌ నయి తాండవింపుచున్
కర్మతపోవనన్ గనుము
    కల్పకజంబును జేయఁజూడఁగా
మార్గము పెట్టి ధర్మమును
    మంటను గల్పెడివారి నొప్పఁగా
శర్మవిహీనులన్ బొనర
    సల్పుము లోకసుఖార్థివై రహిన్॥

చ కవులమనంబులన్ బ్రబల
    గాఢమనోజ్ఞపుమానసంబులన్
కవనసఁ గావ్యసృష్టికి న
    ఖండముగాఁగను బ్రోత్సహింపుమా
వివరము కల్గి విజ్ఞులు సు
    విద్యల వెల్లడిచేయఁ జూడుమా
కపటము లేక జీవితము
    రమ్యము చేయుము రక్తి కట్టఁగన్॥

ఉ. ఆంధ్రము రాఁగరాఁగ మహి
మాదృతిఁ గాంచి విశాల మయ్యె నీ
రంధ్రము గాఁగ నీదునను
రాకను జూచియ నిష్కళంకతన్
రంధ్రము పాపజాతి కిఁక
రాగిలఁ జూపక యల్లుకొమ్మ్న నీ
రంధ్రత నాంధ్రు లెల్ల వడి
రాగము నొందఁగ జీవకట్టగాన్.

ఉ. మన్మథు నెట్టి మమ్ములను
మాన్యతఁ బ్రోవఁగ వచ్చు సి నిన్నిఁటన్
దన్మయతన్ భజంపఁగను
దాయలు చూపుము ప్రాజ్ఞవృత్తితో
సన్నయమున్ సుశీలమును
సంపద మీఱఁగఁ గాడిపంటలున్
మున్నగఁ గల్గునట్లుగను
భూవనితాముఖకాంతిదాత వై

శా. విశ్వామిత్రుఁడు విశ్వమిత్రుఁ డగుచున్
వెల్గొందె నే రీతిగా .
విశ్వఖ్యాతుఁడు దుష్టయోధనుఁ డెటుల్
వెల్గెన్ సుయోధుండుగా
శశ్వద్భాగ్యపదంబు దైవపర మై
సాగిల్లె నే తీరునన్
విశ్వంబందున వెల్గు దుర్గ్రఖి యటుల్
విజ్ఞానసంపత్తిగా.

# దుర్ముఖినామ సంవత్సర పంచాంగము

శ్రీ భమిడి సత్యనారాయణశర్మ

స్వస్తిశ్రీ చాంద్రమాన దుర్ముఖినామసంవత్సర చైత్ర శు ౧ గురువారము ఉదయము ౪-౧౫ x7-30 వఱకు. అశ్విని ౧౪-౪౫ప 11-42 వఱకు విష్కుము ౧౭-౨౦ బ వ ౪-౧౫ దివి ౪-౫౧ త్యా 3-౫౭ ఉ వ 7-44 ల 9-19 వఱకు రా వి ౫-౧3 త్యా 3-౫3 రా వ 9-9 ల 10-35 వఱకు దినం ౩౦-౫ ౨.

| | | | |
|---|---|---|---|
| ల కు కే | ర బు చ | | |
| గు (వ) | జగల్లగ్న ప్రవేశ కుండలి | | శు |
| | | | శ కే |

ఆంధ్ర దేశపరిస్థితులు:— ఆంధ్ర దేశాధిపతి యైన శని వర్షలగ్న ప్రవేశకాలమునకు సప్తమ కేంద్రగతుఁడై వర్షలగ్నాధిపతి యయిన శుక్రునిచే వీక్షింపఁబడుటచేతను, శని భాగ్యరాజ్యాధిపతి యై కేంద్రగతుఁడగుటచేతను, అష్టమలాభాధిపతి యైన బృహస్పతివీక్షణముకూడఁ గలిగియుండుటచేతను, దేశము సుభిక్షముగ నుండఁగలదు. ఆంధ్రరాష్ట్రాధిపతి ఆంధ్రదేశలగ్నాపేక్షయా రాజ్యగతుఁడై, ప్రస్తుతప్రధాన మంత్రిగారినామనక్షత్రరాశియు నాంధ్రరాష్ట్రాధిపతియు నొక్కటియై దశమకేంద్రగతు లగుటచేతను, శని స్థిరరాశియం దుండి వర్షప్రవేశకాలమునకు-చంద్రుడుగూడ శనికిఁ బంచమకోణమునం దుండుటచేతను, ప్రస్తుతప్రధానమంత్రియే విశాలాంధ్రకుఁగూడ ప్రధానమంత్రి యగు సూచనలు ప్రబలముగ నున్నవి. వర్షప్రవేశలగ్నమునఁ బాపగ్రహ

మగు నీచ కేతు వుండుటచేతను, ఆంధ్రరాష్ట్రాధిపతి యగు శనికి నీచరాహుసంబంధము కలుగుటచేతను, అష్టమలాభాధిపతి యగు బృహస్పతి యుచ్ఛయందు వక్రించి యుండుటచేతను, దేశమునందుఁ గొంతవఱకు పాలకపాలితులమధ్య పరస్పరభిన్నాభిప్రాయము నేర్పడుచుండును. ఆంధ్రరాష్ట్రాధిపతియే వర్షప్రవేశలగ్నరీత్యా రాజ్యాధిపతి భాగ్యాధిపతి కూడ నగుటయు, నీచరాహుసంబంధము కేతువీక్షణయుండుటచే నీచులగు ప్రతిపక్షకర్తలయలజడి తఱచు కలుగుచుండును. అట్లయ్యును శని యున్నస్థానాధిపతి యుచ్ఛయం దుండుటచేతను, పరస్పరక్షేత్రమునం దుండుటచేతను, రాజ్యమునందుఁ బ్రశాంతపరిస్థితు లేర్పడును. ప్రస్తుత ప్రధానమంత్రినామరాశిరీత్యా గ్రహము లన్నియు బలముగలిగి యుండుటచేఁ బ్రభుత్వమునందు విశేషమైనమార్పు లేమియు లేకుండ నీ సంవత్సర మంతయు శాంతిభద్రతలతోఁ నెగడఁగలదు.

భారతవర్ష పరిస్థితులు:—జగల్లగ్నప్రవేశకాలమునకు దుర్ముహూర్తము కలుగుటయేకాక భారతవర్షాధిపతి యగు శనికిని, రవికిని షష్ఠాష్టకము సంభవించుటచే భారతవర్షమునందుఁ గలహములు ప్రబలకమానవు. ఈ సంవత్సర మంతయు బృహస్పతి రాశిత్రయసంచారమునందుండుటచే శాంతిభద్రతలును, ఆర్థికవిధానమునందును క్లిష్టసమస్యలను భారతవర్ష మెదుర్కొన వలసియుండును. భారతవర్షరాశియందు అంగారకుఁ డుచ్చస్థుఁడై యుండి తద్రాశినాథునితోఁ బరస్పరక్షేత్రమునం దుండుటచేతను, భారతవర్షరాశ్యధిపతి నీచస్థితరాహువుతోఁ గలసియుండి కేతువీక్షణము కలిగి జగల్లగ్నప్రవేశరాశికి ద్వితీయపంచమాధిపతి యగు బుధునితోఁ షష్ఠాష్టకము పట్టుటచే భారతవర్షమునందుఁ బలుతావుల వ్యాపారస్తంభనము, కలహములు నీచశక్తుల విజృంభణము కలిగి కాశ్మీర, పాంచాల, కోసల, దేశములందు మ్లేచ్ఛజాతులచేఁ గొంత యలజడి కలుగు సూచనలు కాన్పించు

చున్నవి. భూకారకుఁ డగు అంగారకుఁ డుచ్చయం దుండి దేశ రాశియం దుండుటచే భూసంబంధము లగు తగాయిదాలవలనఁ గొంత యలజడి కలిగినను, కుజునికి మిత్రగ్రహ మగు బృహస్పతివీక్షణ కలుగుటచే సవ్యముగఁ బరిష్కారము కలుగును. జగల్లగ్నమునందు శుక్రుఁ డుండి హిందూదేశాధిపతి యగు శనికి మిత్రుఁడై పరస్పర వీక్షణ కలిగియుండుటచే హిందూదేశమునకు రష్యాదేశమునకు మఱింత స్నేహసుహృద్భావము లేర్పడును. అమెరికాదేశము భారతవర్షమునకుఁ బ్రస్తుతము కొంతవ్యతిరేకభావము చూపినను, అక్టోబరుమాసాంతము మొదలు అమెరికా హిందూదేశములమధ్య సుహృద్భావము లేర్పడి క్రమక్రమముగా డిశంబరు మాసాంతమునకు అమెరికాయందు భారతవర్షమునఁగూర్చి మంచి పలుకుఁబడి కలుగు సూచనలు కలవు. మొత్తముమీఁద నీ సంవత్సర మంతయు భారతవర్షమునందుఁ గ్రొత్త వ్యవస్థలు, క్రొత్త ఆర్థిక, సామాజిక, రాజకీయ దృక్పథములు కలిగి పాలకపాలితులయందు సంచలనము కలిగించుచుండును.

విదేశవ్యవహారములు:— జగల్లగ్నప్రవేశకాలమునందు గురుఁ డుచ్చయందు వక్రించియుండుటచేతను, ఈ సంవత్సరములో మొత్తముమీఁద గురుఁడు రాశిత్రయసంచారమునం దుండుటచేతను, అమెరికాదేశమునకు గురుఁ డధిపతి యగుటచే, ఆదేశముయొక్క పరిపాలనావ్యవస్థితి సరి యగు స్థాయిని జెందక పెక్కువిధము లగు మార్పులు చెందుచుండును. ఉచ్చలో వక్రించుటచే బలము చెడి యనేకవిషమార్గములకు దారితీయుచు, అక్టోబరుమాసాంతమువఱకు ఎట్టి నిలుకడ గాంచనేరకుండుటయేకాక క్రమముగఁ దమ పలుకుఁబడి గోల్పోవు దుస్థితి వచ్చును. కుజగురులకు సమసప్తకము పట్టుటచే "యే గ్రహాః ప్రబలా స్పర్ధే సప్తమే నిష్ఫలా స్థితాః" అను న్యాయముచే, ఉచ్చగ్రహములకు సమసప్తక మగుటచేతను, జర్మనీ ఇంగ్లండు దేశముల కధిపతి యగు అం

గారకుఁడు ఉచ్చయం దుండి గురునితో సమసప్తకస్థితియం దుండుటచే (ఫ్రాన్సు, జర్మనీ, ఇంగ్లండు, అమెరికాలమధ్య అభిప్రాయభేధములు పొడచూపు) సూచనలు కలుగును. రష్యాదేశమున కధిపతి యగు శుక్రుఁడు నీచ కేతువుతోఁ గలసి యుండి జగల్లగ్నమునం దుండుట మ్లేచ్ఛగ్రహ మగు రాహువీక్షణముకూడఁ గలిగి యుండుటయే కాక శనివీక్షణముకూడఁ గలిగియుండుటచే, స్వక్షేత్రవర్తి యగు శుక్రుని బలము రష్యాకుఁ గలిగి ద్వాదశమందు రవియు, తృతీయమందు గురుఁడునుగూడ నుండుటచే రష్యాదేశమునకుఁ బై చేయి హెచ్చుగాఁ గలుగు సూచనలును, మహమ్మదీయరాజ్యములందు రష్యాపలుకుఁబడి నానాఁట హెచ్చు సూచనలును భారతవర్షమునకు రష్యాతో మైత్రి పెంపొందు సూచనలును, గాన్పించుచున్నవి. మొత్తముమీఁద అమెరికావిధానముకన్న రష్యావిధానము లోకమునకుఁ గొంత సహాయపడు సూచనలు కాన్పించుచున్నవి. జగల్లగ్నమునకు, తృతీయమునందు గురుఁ డుండుటచే అమెరికా విధానము లోకోద్వేజకరముగ నుండఁగలదు. కాని అక్టోబరుమాసాంతమునుండి హిందూదేశమునకు అమెరికాకుఁ గొంత సన్నిహితభావ మేర్పడి యుండుటవలనఁ గ్రమక్రమముగా, అమెరికావిధానమునందు మార్పు కలుగఁగలదు. మ్లేచ్ఛగ్రహ మగు రాహువు నీచయం దుండి, అంగారకక్షేత్రమునం దుండుటయు, భరతవర్షాధిపతితోఁ గలసియుండుటచేతను, పాకిస్థానమునందును, భారతవర్షమునందునుగూడ యుద్ధసంచలనమునకు దారి తీయు సూచనలు కలవు అక్టోబరు మాసాంతము మొదలు డిశంబరు మాసాంతములోపున గోవా సమస్య హిందూదేశమున కనుకూలముగాఁ బరిష్కారమునకు వచ్చు సూచనలు కాన్పించుచున్నవి. మొత్తముమీఁద హిందూదేశమునకితర ప్రపంచశక్తులతో, అక్టోబరు మాసాంతము మొదలు క్రమక్రమముగా సుహృద్భావము కుదురు సూచనలు కలవు అంతవఱకు

జాగరూకతతో, పాలక పాలితులు సహనసుహృద్భావములు కలిగి సంఘీభావముతో వర్తిల్లినంగాని కేంద్రమునకు నీచశత్రుపీడనము కలుగుట కవకాశము తక్కువగఁ గాన్పించుచున్నది.

సర్వేషాం సమస్తసన్మంగళాని భవంతు

శ్రీ శ్రీ శ్రీ.

ఓమ్

# ప్రబోధము

శ్రీ రావు వేంకట శేషారావు.

అంతరాత్మయె నాకుఁ బ్రత్యక్షదైవ
మహితహితముల చూపించు నాత్మసఖుఁడు
మంచినే ప్రోత్సహించు సన్మార్గదర్శి
చెడ్డ నల దని బోధించు దొడ్డగురుఁడు
నగుచు నాయిష్టదైవమై యండనుండ
వేఱ దేవతల కేను వెదుక నేల?

నిర్వికారున కొకరూపు నిర్ణయింపఁ
బట్టుదలతోడ సిగపట్లు పట్ట నేల?
రూప మిది యని చూపింప నోప గలమె?
విశ్వమయునకు రూపంబు వేఱ గలదె?
సత్యమే వానిరూపు నిస్సంశయముగ
ధర్మమార్గంబె నాకు నాదర్శపదము.

 

పావనత లేక విశ్వాలభక్తి లేక
తీర్థయాత్రలు సేయుట సార్థకంబె?
తోయములు పాపముల పాఱద్రోలునేనిఁ
జెడ్డపనులను నిర్భీతి చేయవచ్చు
సద్గుణాళిని బోషింపఁ జాలమేని
జీవితము సున్నచుట్టుకుపోవుగాదె?

(శేషము 142 పుట)

# ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసము

శ్రీ అవసరాల రామారావు, బి. ఏ., బి. ఎల్.

---

నిత్యజీవితములో మానవుని నొక సాంఘికవ్యక్తిగాఁ జేయుటకు ననేకవిధము లగు శక్తులు ప్రస్ఫుటము లగుచు వచ్చినవి. అన్నిశక్తులలో నెక్కువ బల మైనది శబ్దము. శబ్ద మనఁగా మాట. అంత శక్తి గలది కాఁబట్టియే యీ శబ్దమును బూజింపసాగిరి. పూజ కర్హత గలిగినది కనుకనే దీనిని "శబ్దబ్రహ్మ"యన్నారు భూగోళశాస్త్రరీత్యా పరీక్ష చేసిన మన హిందూదేశమున కాధిక్యము చేకూర్చిన దీ హిమవత్పర్వతమే. కాని సాంఘికముగాను, నైతికముగాను, ఆధ్యాత్మికముగాను, పరీక్ష చేసిన మన హిందూదేశముయొక్క ఘనతకుఁ గారణము సంస్కృతశబ్ద మని చెప్పకతప్పదు. చరిత్రాత్మకముగాఁ జూసినఁ బ్రప్రథమములో హిందూదేశమునఁ బ్రవేశించిన యార్యులు, మాట్లాడు ప్రాకృతభాషను గాలక్రమేణ మార్చిరి. మానవజాతి కంతకు ముఖ్యముగాఁ గావలసిన కొన్ని యాదర్శములు, కొన్ని భావములు, కొన్ని యుద్దేశ్యములు, భాషలోఁ జెప్పవలసివచ్చెను. అందుచేతఁ బ్రాకృతభాషను సమ్మెటవేయవలసివచ్చినది. ఈ సమ్మెట వేయఁగా వేయఁగా దయారైన భాష యొక యుత్తమశ్రేణికిఁ జెంది సాంప్రదాయసిద్ధమైనదిగాఁ దయారైనది. అదే లాక్షణిక భాష. ఎప్పుడు ప్రాశస్త్యమును బొంది యొక సుందర మైన మూర్తిత్వమును బొందెనో యప్పు డది పూజార్హ మైనది. అప్పుడే దానికి దేవత్వము వచ్చినది. ఈ పూజార్హత, దేవత్వము, ఋగ్వేదకాలమునకుఁ బూర్వమే వచ్చుట జరిగినది. అందుచేత ఋగ్వేదకాలములోని ఋక్కులు, మంత్రములు నొక విధ మైన దేవత్వము కలిగిన మహాపురుషులచేఁ జెప్పఁబడినవి. కనుక వీనిని బూజించి తీరవలయు నను నభిప్రాయము కలిగినది. అంతే కాదు; ఇట్టి పూజనీయ మైన భాష మాట్లాడినవా రందఱుఁగూడఁ బూజనీయులని, ఋషులని, యభిప్రాయము కలిగినది.

ఒకసంఘమునకుఁగాని, వ్యక్తికిఁగాని–సభ్యతగాని,సంస్కృతిగాని

రావలయు నన్న సంస్కృతభాష లేనిదే యది యసంభవ మని యభిప్రాయము నాఁటుకున్నది.

ఋగ్వేదమంత్రములు మొదటి నుండియుఁ బదియవమండలము వఱకు మనము చదివినచో నా కాలములో మాట్లాడు భాషకును, ఈ మంత్రములు చెప్పఁబడిన భాషకును, నెక్కువభేద మున్నటులు కనుపింపదు. అధర్వణవేదకాలమునకు, ఋగ్వేదకాలమునకు, నాలుగైదు వందలసంవత్సరములకంటె నెక్కువ భేద ముండదు. అధర్వణవేదములోని భాషకును, పతంజలి కాలములోనిభాషకును, నెక్కువ తేడా



కనుపింపదు. విష్ణుపురాణములోఁ గాలక్రమేణ యీవేదము లన్నియుఁ గలసిపోయిన కారణముచేత నివి యన్నియుఁ గంగారుగ నున్న వని యప్పుడే వ్యాసులవారు (కృష్ణద్వైపాయనులు) వీని నన్నింటిని నాల్గు భాగములుగఁ జేసి రనియు, నందుచేతనే వారిని వేదవ్యాసు లని పిలిచి రనియు వ్రాయఁబడినది.

కాఁబట్టి యీ యుపనిషద్బ్రాహ్మణములు; గురువు శిష్యునితో మాట్లాడిన-ఋషులు బోధచేసిన-సాధారణభాష సంస్కృత మై పోయి నది. అది మృతభాష కాదు. సజీవ మైన భాష.

ఆర్యులు హిందూదేశములోఁ బ్రవేశించినది మొదలుకొని 1500 B. C. లో జరిగిన మహాభారతయుద్ధమువఱకు, అనఁగా సుమారు నాలుగైదువేల సంవత్సరములకాలములో సంస్కృతము దేదీప్యమాన ముగాఁ బ్రజ్వరిల్లినది. హిందూదేశము నంతను నేకప్రదేశముగఁ జేసిన సంయోజకశక్తి యీభాషయే.

ఆర్యుల సంస్కృతికిఁ బ్రధాన మైన స్థానము 'ఋతం' అను దాని కీయఁబడినది.

ఓంఋతగ్ం సత్యం పరం బ్రహ్మ
పురుషం కృష్ణపింగళం
ఊర్ధ్వరేతం విరూపాక్షం
విష్ణురూపాయ వై నమోనమః

ప్రతికర్మయొక్క, ప్రతిబోధయొక్క, ప్రతివాక్యముయొక్క, ముఖ్య తాత్పర్యము, సారాంశము, యథార్థభావమును బరిశ్రమజేసి కనుఁగొ నుటయే ఋతము. ప్రతిదినమందు మన మనుష్ఠించు పనులవలనఁ గలుగు సుఖదుఃఖఫలానుభవజ్ఞానము ఋతమునకు మిక్కిలి సహకారిగ నుండును. ఋతముయొక్క బాహ్యాకార్యమే సత్యము.

ఏది యేది శాస్త్రముయొక్క ముఖ్యసారాంశ మనియు, పురుషార్థ సిద్ధిసాధన మనియు, అక్షయ సుఖప్రదాయక మనియు, ఋతముచే

నిశ్చయింపఁబడినదో దానిని మనోవాక్కాయములతో ననుష్ఠించుటయే సత్యము యాథార్థ్యమును గనుఁగొనఁ గలిగిన వారే తక్కువ. ఒకవేళ ఋతమును గనుఁగొనినను దగిన రీతిగ ననుష్ఠించువారు చాల యరుదు.

500 లు B. C. లో మహాభారతయుద్ధము. అది మొదలుకొని 700 లు B. C. వఱకు—అనఁగా మగధరాజ్యస్థాపనమువఱకు సంస్కృత భాష యార్యావర్తములో ఋతసత్యములనేగాక సాహిత్యములోను, వేదాంతములలోను, నిత్యనైమిత్తికములలోను బ్రిజ్వరిల్లినది. ఉత్తర హిందూస్థానములోనేగాక తూర్పునకు, దక్షిణమునకుఁగూడ విజృంభించినది. ధర్మసూత్రములు మనుస్మృతి మొదలగు గొప్పగ్రంథము లన్నియు సంస్కృతములోనే యుండుటచే నవియన్నియుఁ బ్రజానీకము చదువుట జరుగుచు వచ్చినది. ఈ 800 ల సంవత్సరములలో నుపనిషత్తులు, భగవద్గీతయు సంస్కృతములోనే చదివి యందఱు నందలి జ్ఞానమును సంపాదించుటకుఁ బ్రయత్నము చేయుచుండిరి. ఆర్యులసంస్కృతి విరివిగా వెదఁజల్లఁబడినది.

## 700 B. C. 150 B. C.

మగధసామ్రాజ్యము :— బుద్ధదేవుఁడు, మహావీరుఁడు తమ ప్రబోధములు ప్రాకృతభాషలోఁ జేసిరి. ఈ కాలములో నుత్తర హిందూస్థానములోఁ గొన్నికొన్ని చోటుల వారివారి ప్రాకృతభాషలు, దక్షిణాదిని గొన్నికొన్నిచోటుల వారివారి ప్రాంతీయభాషలు, మాట్లాడుచువచ్చిరి. కాని యీప్రాంతీయభాషలు జనసామాన్యముగ మాట్లాడినను, సంస్కృతమే మెఱుఁగుభాషగఁ బరిగణింపఁబడుచుఁ బ్రాంతీయ భాషలకు వన్నె తెచ్చుచు వచ్చినది.

## 150 B. C. to 320 A. D.

ఈధోరణిలోఁ బశ్చిమహిందుస్థానములోను, ఉత్తర పశ్చిమమున విదేశీయులు జయించి విదేశపరిభుత్వమును నెలకొల్పిరి. ఈ విదేశ పరిభుత్వమును శాతవాహనులు ధిక్కరించిరి. ఈ క్రమములోనే సంస్కృతము వ్యావహారికభాషగాఁ బరిణమించినది. సంస్కృతములోనే

రాతిపలకలమీఁద శాసనములు వ్రాయుట ప్రారంభించినారు. ఋతము అనునది ప్రతివానికి జీవితధర్మముక్రింద నెంచఁబడినది.

ఈ క్రమములో సంస్కృత మొక పెద్ద శక్తిస్వరూపము దాల్చినది యనుటలో సందేహము లేదు. ఉత్తరహిందుస్తానములోనే గాక దక్షిణహిందూస్థానములోఁగూడ సంస్కృతమే హిందూధర్మము, హిందూధర్మమే సంస్కృతము—అను నభిప్రాయము వెదఁజల్లఁబడినది.

ఈ కాలములోనే కాళిదాసమహాకవి నాటకములు, పదిలక్షల పద్యములు గల మహాభారతము యొక్క చరమ ప్రచురణము వచ్చుటయు రామాయణ మొక యందమైన సంపూర్ణమైన మహాకావ్యమని యందఱు నంగీకరించిరి.

దీని కంతకుఁ గారణము గుప్తరాజు లందఱు సంస్కృతమున కిచ్చిన దోహదసహకారములేకదా ! ఎన్నియోచోటుల సంస్కృత పాఠశాలలు, విద్యాలయములు నీ మహారాజులు స్థాపించినారు. కవులను సన్మానించినారు. సంస్కృతభాషను బోధించుటయేగాక సంస్కృత మొక దేవి యని, సరస్వతి యని, భారతి యని, పూజింపఁబడుచు వచ్చినది. ఎక్కడెక్కడ సంస్కృతభాష పూజింపఁబడినదో యక్కడక్కడ నొక విధమైన నూతనవికాసము ప్రారంభమైనది. ధర్మచక్రము తిరుగఁ బ్రారంభించినది. ఆ చక్రము సంస్కృతములోనే పోఁతపోయఁబడిన దని రూఢిగాఁ జెప్పవచ్చును. దక్షిణములోఁ గన్నడము, తెలుఁగు, మళయాళము భాషలలో సంస్కృతము మిళితము కాసాగినది.

550 A. D. తో గుప్తరాజ్యము సమసిపోయినది. గుప్త రాజ్యములోనే సంస్కృతము తెలిసిన పండితులయొక్క ప్రతిష్ఠ ఎక్కువ యైనది ఈ రాజ్యము పోఁగానే వర్ణాశ్రమ ధర్మముయొక్క విలువలు తగ్గఁజొచ్చినవి. దేశమంతట సంస్కృత మదివఱకు మాట్లాడుచు వచ్చిన, గుజరాత్‌లోను, రాజపుటానాలోను, సౌరాష్ట్రములోను, అపభ్రంశముతోఁ గలిపి మాట్లాడుట ప్రారంభించినారు. మధ్య దేశములో మాత్రము స్వచ్ఛమైనది మాట్లాడువారు.

6వ శతాబ్దము చివర "బాణ"కవి సంస్కృతమునకు గొప్ప సేవ చేసినాఁడు.

Mahammud of Ghazni Khilji ఉత్తరహిందూస్థానములోని సంస్కృత పాఠశాలలు, విశ్వవిద్యాలయములు తీసిపాఱవేయించినారు. సంస్కృత పండితులు, గౌరవకుటుంబములలోవారు, గ్రామములకుఁ బలాయనము ప్రారంభించినారు. అయినప్పటికి సంస్కృతమే జీవితకథ యని, సంస్కృతమే ముక్తిప్రదాయక మను నభిప్రాయములు మాఱలేదు.

## 15. Century (Renaisance)

మహాభారతము, రామాయణము, భగవద్గీత గీతగోవిందము :- మామూలు భాషలలో వ్రాయుట ప్రారంభింపఁబడినవి. అందుచేత ప్రజాసామాన్యమునకు సంస్కృతము వ్రాయుట, చదువుట వెనుకఁబడినది. 19 వ శతాబ్దమునాఁటికి గ్రామపాఠశాలలో సంస్కృతము చదివించుట తప్ప చాలామట్టుకు మాట్లాడువారే తగ్గిపోయినారు ఒకవేళ పండితులు మాట్లాడినను, మిగిలినవారి కర్థమగుట కష్టమైపోయినది. కృష్ణదేవరాయులు - కాలములో అష్టదిగ్గజములు - ఎట్లు తెనుఁగుకవిత్వములో సంస్కృతము పూర్తిగా మిళితముచేసినది యందఱకుఁ దెలియును.

మొగలుసామ్రాజ్యానంతరము ఈస్ట్ యిండియా కంపెనీ మన దేశమువచ్చునరికి-సంస్కృతము రాజభాషగా నశించినను, వివిధమైన ప్రాంతీయభాషలలో సంస్కృతమాటల కలయిక యుండుటచేత ఇంకఁ గొంత సంస్కృత పాండితికి విలువ నశించ లేదు. పురాణములలో-పంచాంగములలో-జాతకములలో-కార్యతంత్రములలో-మాత్రము సంస్కృతము సజీవముగా నుండిపోయినది.

ఈస్ట్యిండియా కంపెనీ వారిలోని తెలివిగల, సంస్కృతి గల యజమానులు కొంతమంది సంస్కృతములో నున్న ఘనతను కనిపెట్టి దానికి గణ్యత యిచ్చెడివారు.

తరువాత బ్రిటిషుప్రభుత్వముక్రింద విశ్వవిద్యాలయములు స్థాపన యయినతరువాత, ప్రాంతీయ భాషతోపాటు సంస్కృతములోఁ బాఠములు చెప్పించి, ఇది యొక ద్వితీయభాషగా పరిగణింపఁ బడుచు వచ్చుటచేత 20 వ శతాబ్దములో నీ మాత్రపు సంస్కృతమైన నిల్చినది.

## 20 th. Century లో

మన హిందూదేశము 'అంతయు నొకటి యని చెప్పుకొనుటకు' బ్రిటిషు వారి యాయుధములు,సంస్కృతిముతప్ప దేశములో మఱొకటి కనిపించదు:- బ్రిటిషు ఆయుధములు వెళ్ళిపోయినవి. ఇంక మన జాతీయ చైతన్యమునకు, జాతీయైక్యతకు-మిగిలినది. 'సంస్కృతముతప్ప మఱొకటి లేదు.

1. ఈసంగతి మన రాజకీయనాయకులలోఁ జాలమందికిఁ దెలియును. తెలిసియుండికూడ, ఆ సంగతి నొక్కి చెప్పుటకు నశక్తులుగా నున్నారు.

2. మన విశ్వవిద్యాలయములలో సంస్కృత మొక మహోన్నత భాష అని, అట్టిది చదివించుట యవసర మను నభిప్రాయము చాలమందికిఁ గలదు- Sanskrit is a vital link in Nation -Evolution -జాతీయపరిణామమున కిదియొక చైతన్యము; గనుక సంస్కృతమును నుపేక్ష చేసినచో జాతీయతను మఱచిపోయినట్లే.

3. పాశ్చాత్యవిద్యలో నాఱితేరిన మరికొందఱు మన జాతీయ చైతన్యమునకు సంస్కృతము ప్రాణదాయక మైన దని యొప్పుకోరు. వారిపిల్లలకు,అనుచరులకు, భారత,భాగవత, రామాయణ, భగవద్గీతలు చదువ నవసరము లే దంటారు. యిండియా యొక్క సంస్కృతి, ఐక్యత, సంస్కృతమువల్ల నే యుద్ధరింపఁబడుచు నున్నవని యొప్పుకోరు. మనరాజ్యముచేయుటకుఁ దయారుచేయఁబడుచున్న I. A. S. వారికి, నూటికి 60 మందికిఁ గుంతిదేవి యెవరో తెలియదు-కర్ణుఁ డెవరో తెలియదు.ఎంత ధీరోధాత్తుఁడో తెలియదు. అది చాల విచారమును గలుగజేయును.

మనకు స్వరాజ్యము లభించినది. స్వేచ్ఛ వచ్చినది.హిందీజాతీయ భాషగా నుండవలె నని యందఱు నొప్పుకున్నారు. హిందీలోఁ జాలా సంస్కృతము మాట లున్నవి.గనుక సంస్కృతమును బోషించు బాధ్యత ప్రతిస్టేటు గవర్నమెంటుమీఁద నున్నది. ఉత్తరప్రదేశ గవర్నమెంటు, ఈ విషయములో చాలా శ్రద్ధతీసుకొనుచున్నది. యితరస్టేటులు సంస్కృతమును చాల అశ్రద్ధతో చూచుచున్నారు. సంస్కృతమును విడిచిపెట్టిన

హిందూదేశముయొక్క యాత్మను గోల్పోయినట్లే. ఆత్మను పోఁగొట్టుకొన్నతరువాత మనకుఁ గలుగు స్వేచ్ఛ కర్థములేదు. మన సంస్కృతభాషలో నున్న యుపనిషత్తులు, మహావాక్యములు మఱచిపోయిన తరువాత, ఇంక మిగిలునది యేమిటి. తత్త్వమసి; సోహం; అహం బ్రహ్మాస్మి; అయమాత్మా బ్రహ్మ. అను మహావాక్యాలు ప్రతి మనుష్యుఁడుకూడఁ దన నిజమైన స్వరూపమును స్మరించుటకుఁ గారణ భూతములు. హిందూదేశప్రపంచమున కేదైన మేలు కలుగ చేయవలె నన్నఁ బ్రపంచశాంతికి దోహదముచేయవలె నన్న బంచశీల సిద్ధాంతము ప్రపంచములోని యితర రాజకీయనాయకుల తలలోనికెక్కించవలె నన్న మన సంస్కృతభాష తప్ప మఱి యేమున్నది:- కాఁబట్టి, (1) మన స్కూలులలోను, విశ్వవిద్యాలయములలోను సంస్కృత పఠన మే స్థితిలో నున్నది. (2) రాష్ట్రి కేంద్రి ప్రభుత్వములు దీనికెట్టిసహాయము చేయుచున్నవి. (3) Shastraic Titles పండితుల కేమి యిచ్చుచున్నారు. (4) సంస్కృతము పాఠశాల లేరీతిగా నున్నవి ? (5) సంస్కృతములోఁ బరిశోధనాలయము లున్నవా? (6 ప్రయివేటుగా సంస్కృతము చదువుటకుఁ గుతూహలము గలవారి కే సౌకర్యము లున్నవి ? (7) సంస్కృతభాషనుగుఱించి ప్రచారముచేయుటకు సభాసమావేశములు జరుగుచున్నవా ? (8) సంస్కృతభాష, రామాయణ, మహాభారత మహాకావ్యములు. సామాన్య ప్రజల కందుబాటు చేయు ప్రచారము జరుగుచున్నదా ?- ఈ యంశములనుగుఱించి మన విద్యాశాఖాధికారుల మీఁద ? Vice chancallars మీఁద; మంత్రులమీఁద కార్యభాగము చాలా యున్నదని నా దృఢవిశ్వాసము:—

ఓం సర్వే వై సుఖిన స్సంతు । సర్వే సంతు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యంతు । న కశ్చి ద్దుఃఖభా గ్భవేత్.
ఓం శాంతిః శాంతిః శాంతిః

# సారస్వత మహాసభ—అధ్యక్షోపన్యాసము

కవిసమ్రాట్, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, ఎం. ఏ.

ఆర్యులారా!

నన్ను మీ సమావేశమున కధ్యక్షుఁడుగా నుండు మని మీరు కోరుట నాకుఁ జాల గౌరవ మయిన విషయము. నే నిట్లనుట వట్టి యాచారమాత్రము గాదు. ఈ పరిషత్తుయొక్క మర్యాద నిజముగా నట్టిది. తొలుత నిది శ్రీపిఠాపురము మహారాజా వారి దయాసారప్రసారముచే శ్రీ జయంతి రామయ్యపంతులుగారి నిశితపర్యవేక్షణక్రింద దివ్యాతిదివ్యముగా నాంధ్రభాషాలోకమున ననంతోపకారము చేసి సంప్రదాయరక్షకులకు సర్వవిధముల పాటుపడిన సంస్థ. ఆనాఁటి యాంధ్రసాహిత్యపరిషత్పత్రికలు ప్రౌఢసాహిత్యవిమర్శకములు. ఈపరిషత్తు మున్న మహాగ్రంథములను బ్రకటించినది. తాళపత్రగ్రంథము లనంతముగ సేకరించినది. హరిభట్టు శ్రీనాథాదులు వైన యెందఱో మహాకవులవో యముద్రితగ్రంథములు ప్రకటించినది. సూర్యరాయాంధ్రనిఘంటు వీ మహాపరిషత్తుయొక్క బీజభావమే యగుచున్నది. విగుర్వాణాదిబహుశబ్దముల యర్థనిర్ణయమునకు నాఁటిపండితుల మహాన్యాసములు నాఁటి పరిషత్పత్రికలతో ననేకములు ప్రకటించి భాషాపోషణము చేసిరి. ఆనాఁ డాంధ్రసాహిత్యపరిషత్పత్రికలలో జరిగిన సాహిత్యసేవ యపారము. ఒకవైపునఁ బిడుగువంటి గిడుగు రామమూర్తిపంతులుగారు వాడుకభాషాధ్వజమెత్తి గ్రాంథికభాషాదుర్గముయొక్క కొమ్ములమరఫిరంగులతో భేదించుచుండగా నాంధ్రసాహిత్యపరిషదనుయాయులైన మహారథులీ కోట శిథిలము కాకుండ సంరక్షించినవారు. ఆ దినములు వేఱు. ఆ దినములలో మేము చిన్నవాండ్రము. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక యెప్పుడు వచ్చు నెప్పుడు వచ్చు నని యెదురుతెన్నులు చూచెడివారము. ఉత్తిబి సేసోకబ్బో అను పతాకతో నాంధ్రభాషాభిషక్కుల భాషాభైషజ్యము

మొదలైన ఫిరంగులమోఁత గిడుగువారి కలమునుండి శ్రవోరంధ్రము చీల్చుచున్న దినములవి. నాఁ డవి రెండు శత్రుపక్షములు.

నేఁ డా శత్రుత్వ మంతరించినది. ఇంచుమించుగా రెండు పక్షములవారును గలిసిపోయి రనియే చెప్పవచ్చును. వారు కొంతదూరము వచ్చిరి. వీరు కొంతదూరము వెళ్లిరి. జరుగుచున్న మహాసంస్కారమునకుఁ దుదిదాఁక వ్యతిరేకు లెప్పుడు నుండనేయుందురు. రాజుయొక్క రాజ్యము పోయి, రాజే శత్రువుతో సంధిచేసికొనినపుడుకూడ నా రాజుయొక్క సేనానులలో నెవ్వఁడో యొక్కఁడు రాజున కభిమతము కాకుండగనే యా రాజును పునఃప్రతిష్ఠితుని జేయురహస్య ప్రయత్నములు చేయుచునే యుండును. సంధి యుభయపక్షములకు మర్యాదాభంగము కాకుండ జరిగినది. ఉభయపక్షములును గెలిచినవి. కాని యచ్చటివారు కొందఱు నిచ్చటివారు కొందఱు తమపక్షమే గెలిచిన దని చెప్పుచుందురు సమదృష్టి లేనివారిపోకడ లట్లే యుండును. ఆ నాఁ డాంధ్రసాహిత్యపరిషత్తునకు మూలస్తంభ మయిన శ్రీపిఠాపురము రాజావారి యాశ్రితులలో నేఁటి ప్రధానుఁడు గ్రామ్యభాషావాదమత్త సింహము యొక్క కుమారుఁడు. ఈ పరిస్థితియే సంధికిఁ బ్రతీక.

ఈ రెండు భాషలయొక్క ప్రయోజనములు ద్విధాస్రోతస్సులు. దాని లక్షణములు వేఱు. దీనిలక్షణములు వేఱు. అది కావ్యభాష. ఇది దైనందినభాష. వ్యవహారభాష. వ్యవహార మనినంతనే మాటాడుకొనుటమాత్రమే కాదు. అర్థసుబోధకముగ విషయములను దెలియఁజేయు సర్వప్రయత్నము వ్యవహారమే. వ్యాఖ్యానము లట్టివి. అట్టి విషయములు కొన్ని పుస్తకరూపమునఁగూడ వెలయవచ్చును. ఒక శాస్త్రము పూర్వము పద్యరచనలోఁ జేయఁబడినది. ఈ నాఁ డది వాడుకభాషలో వ్రాయవచ్చును. ఈ రెండు భాషలయొక్క ప్రయోజనము విడివిడిగాఁ

దెలియుటకుఁ గావ్యస్వరూప మిద మిత్థ మని తొలుత నిర్ణయించుకొన వలయును.

కావ్యములు రెండు రకములు. పద్యకావ్యములు, గద్యకావ్యములు. కాని యిందులోఁ బద్యకావ్యమే కావ్యశబ్దవాచ్య మగుచున్నది. ఈ కావ్యమునకు మొట్టమొదటిది పద్యము. పద్యము - వచనము - రెండును రెండు. అర్థబోధ గలవారికి భాషాజ్ఞానము గలవారికి వచనము సులభముగా నర్థ మగును. ఆ వచనములో నున్న మాటలే పద్యములోఁ జెప్పినచో నర్థబోధ తక్కువ యగును. దీనికిఁ గారణము పద్యరచన. పద్య మనినంతనే మొదట మనము వాడుకభాషలో వినియోగించి సుఖావబోధ కలిగించు ప్రత్యయముల స్వరూపము మారును. ప్రత్యయములకు హ్రస్వత యేర్పడును. రెండవది శబ్దములయొక్క స్థితి వ్యత్యస్త మగును. వచనరచనలోని వాక్యవిన్యాసములు లోకమునందలి సుగమార్థావబోధానుకూలముగ వాడుచున్నవాని భేదించును. మఱియు వచనములో లేని యొక నడక పద్యములో వచ్చును. పద్య మనినంతనే కవి యొక ప్రయత్నము చేసి యొక శైలిని నొక కుదింపును, బలుకఁబడి నొక విధమయిన గడుసుఁదనము పొందుటను జూపించును. పద్యమే కవిచేత నా ప్రయత్నము చేయించును. ఈ కారణములచేతఁ బద్య మెప్పుడును వచనముకంటె నర్థము చేసికొనుట కష్టమయిన విషయము. పరమసులభమైన పద్యమునందుఁగూడ నీ లక్షణము లుండును. పద్య మర్థమగుటకుఁ బూర్వము చాల పద్యములతోడి పరిచయ మున్నఁగాని యవి యర్థము గావు. ఈ పద్యములు సులభముగా నున్నవన్న నర్థ మే మనఁగా నట్టి పద్యములతోడ నతనికిఁ బూర్వ పరిచయ మున్నదని యర్థము.

వట్టిపద్యమునం దీ కష్ట ముండగాఁ గావ్యగతమైన పద్యమునం దెక్కువ కష్ట ముండును. కావ్యగతమైన పద్యము బహువిధము. రసానుకూలఘట్టమునందుఁ బద్యరచన సులభభావబోధకముగా నున్నట్లుండును.

అచ్చట నట్లే యుండును. రసస్ఫూర్తి కలుగుటకు సామాన్యముగా లోకమునందలి యుక్తివైచిత్ర్యమును వాక్యవిన్యాసములు నానుడులు ప్రధానస్ఫోరకములు. ఈ రసస్ఫోరకత్వలక్షణము సామాన్యముగా లోకమునందలి తత్తద్వేళలయందలి వాక్యములు భావములయందే తొలుత నున్నట్లుండును. మహాకవులు రసస్ఫురణకొఱకుఁ దాము ప్రౌఢకల్పనలు చేయుదురు. ప్రౌఢోక్తులను నిర్మింతురు. ఆ ప్రౌఢోక్తులను బట్టి రసస్ఫురణ యతిశయముగా ఘటిల్లును. ఈ రసస్ఫురణ కల్గించు ప్రౌఢోక్తులు భవభూతియందునుఁ దెలుఁగులోఁ దిక్కన్నగారి యందును సమృద్ధిగాఁ గన్పించును.

ఈ రసస్ఫోరక ప్రౌఢోక్తులను బరిత్యజించినచోఁ గథాభాగమునందు బహుఘట్టము లుండును. కథాగమనము వర్ణనాఘట్టములు మొదలైనవి కావ్యశరీరమునకుఁ బరిపోషకములు. మానవశరీరసంధిబంధముల దార్ఢ్యమున శరీరగతప్రాణము తేజోవంతమై యెట్లుండునో కావ్యములోని యీ వివిధభాగములపరిపుష్టి కావ్యరసమున కట్టి దార్ఢ్యము నొసంగును. ఈ దార్ఢ్యసంపాదకమైన భాష కావ్యభాష. వాడుకభాషకీ దార్ఢ్యము లేదు. ఈ దార్ఢ్యము మహాకవులు తమకావ్యములయందు బహువిధముల సంపాదింతురు.

లోకమునందు సామాన్యజీవితమునందే యొక వ్యక్తియొక్క నడకలోననే బహుభేదము లుండును. ఇంటిలో నిష్కంచుకముగాఁ దిరుగును. మిత్రుల కల్పపరిధానమాత్రికముగాఁ గనిపించును. పెద్ద మనుష్యులు వచ్చినపుడు సముచితవస్త్రపిహితాంగుఁడై కనిపించును. ఉద్యోగము చేయఁబోయినపుడు, సభాప్రవేశము చేయఁబోయినపుడు తత్తదుచితవేషధారణము చేయును. ఆధునికులు క్రీడావేళలఁ, బూర్వపురాజులు మృగయావేళలఁ, బ్రత్యేకములైన దుస్తులు ధరింతురు. యుద్ధవీరుఁడు ధరించునుడుపులు వేఱు.

భాష యుడుపులవంటిది. అది బహుసమయములయందు బహువిధములుగా నుండును. కత్తిసాము చేయువాఁడు వసులు దుస్తులను ధరించఁడు. సాయంకాలవాహ్యాళి పోవువాఁడు గాలి కెగురు చుంగులు వాఱు వలిపములు ధరించవచ్చును. కావ్యభాష యీ లక్షణములు కలది. తత్తద్భావానుకూల మైన తత్తత్సమయానుకూల మయిన రచన కావ్యభాషకు స్వతస్సిద్ధము. వాడుకభాష దైనందిన మయిన వ్యవహార భాష. మనము సామాన్యముగా సంచరించునపుడు వేసికొను సామాన్యపు దుస్తులవంటిది. సమీపబంధువుయొక్క పెండ్లికి వెళ్లునపుడు వెలగల దుస్తులు వేసికొందురు. ఒక కర్మచేయుటకో, యొక వ్రతముచేయుటకో, పీటలఁమీఁదఁ గూర్చుండునప్పటి దీక్షావస్త్రములు వేఱు. కావ్యభాషలో నిన్ని విధములు కలవు. తత్తదుచితపర్యాలోచన పరిపాకబుద్ధి యగు మహాకవి వానిని నప్పుడప్పు డుపయోగించును.

ఇది మహాశిల్పభూమి. కావ్యభాష శిల్పభాష. వాడుకభాష వాడుకభాష. ఈ రెండు భాషలు కలియుట యెప్పుడు జరుగదు. జరిగినచో మహాకావ్యస్వరూప నాశనము జరుగును. శిల్పబుద్ధి లేని కవులు సర్వకాలములయం దుందురు. వారిలోఁ బూర్వు లందఱు గతించిపోయిరి. వారి పేరులుగూడ మనకుఁ దెలియవు. వారు ప్రతికాలమునం దుందురు. ఎప్పుడు వారి సంఖ్య యెక్కువ. మనము మనకాలమునందలి వారినే చూచుచున్నాము. కనుక నయ్యో కావ్యభాష యెంత చెడిపోవుచున్న దని యనుకొనుచున్నాము. ఇట్టివా రెప్పుడు నుందురు. 'ఏ మహాత్ముఁడు గల్గి భూమీశసభలలోఁగవులకు మిగుల విఖ్యాతికలిగె'-'నీవునుం గవివి గాదుగదా యలకొండవీటిలో'- మొదలైనవి దీనికి సాక్ష్యములు.

కావ్యము నీకు సుగమముగా నర్థము కావలయు నని వ్రాయఁబడునదికాదు. కవి తనశిల్పచాతుర్యముచేత నీవు దానిని గ్రహింపఁగలిగినచో, నీమనస్సు నుదాత్త మార్గములయందు నలౌకికమైన నిష్ఠయందు

బ్రహ్మభావన బ్రహ్మచారి యైన రసవీథియందు నీ చిత్తమును లయింపఁజేయు ప్రయత్నము. అది సామాన్యునకు సుగమ మైనది కాదు. శిల్పవేత్తను రసవీథియందు రమింపఁజేసెడిది. అది యొక మహాప్రయత్నము. ఆ భాష వేఱు.

కవు లందఱొక్క విధమువారు కారు. ఎవనివిధము వానిది. మనుజు లంద ఱొక్కవిధము కాదు. ఎవనివిధము వానిది. ఒకఁడు కుప్పడమంచు ధోవతి కట్టఁడు. జరీయుత్తరీయమును వేయఁడు. పట్టుచొక్కా తొడుగఁడు. కాని యతఁడు ధరించు నుడుపులయం దొక పెద్దమనిషి తరహా భాసించును. ఆ భాసించుట యతనిమూర్తి విశేషమునందు వాని శీలమునందు వానిమాట పొందికయందు జతకూడి యుండును. ఆ రీతిగాఁ గొందఱు కవులు సులభముగా వ్రాసినట్లు కనిపించుచు సర్వశిల్పమును సంధానపఱతురు. అది యొక నేర్పు. ఈ మానవప్రకృతిలో నున్న భేదములు చూపుట కీకావ్యనాయకులలో ధీరోదాత్తుఁడు ధీరోద్ధతుఁడు ధీరలలితుఁడు ధీరశాంతుఁడు నను నాల్గువిధముల నాయకులు చూపింపఁబడిరి. ఒక్క శృంగారరసములో భిన్ననాయకులు, భిన్ననాయికలు, తొమ్మిది రసములు, నాయకసహచరులు, దూతీభేదము, వందలకొలఁది నాయికాభేదములు-ఇంతమందికిఁ బ్రయోగించు భాషయొక టే విధమా? పిడుగునకు బియ్యమున కొకటే మంత్రమా? వేలవిధము లైన యీ భావభేదములను నిరూపించుటకు మహాకవి తనభాషను నన్ని వేలవిధములుగా నుపయోగించును. ఇది వాడుకభాష కాదు.

కాని వాడుకభాషలో నున్న సర్వశబ్దములు గ్రాంథికభాషలో నుండును. మఱియుఁ గొన్ని నిఘంటుగతశబ్దము లుండును. శబ్దములు భాష కాదు. వాక్యరూపమున వచ్చునప్పటికి భాష యొక్కొక్కప్పు డొక్క శబ్దమే వాక్యార్థబోధకమై వాక్యముగా భాసించును. అప్పు డా శబ్దము భాషయే. కాని దానియందలి వాక్యత్వము పూర్వాపరసన్ని వేశరమణీయతాజనకమై యుండును.

శబ్దములు వాక్యదశకు వచ్చినప్పటికి వాక్యగత బహుశబ్దములు భిన్నభిన్నస్థానములు పొందిభిన్నభిన్నార్థములు భాసింపఁజేయునప్పటికిఁ గావ్యభాష ప్రారంభించుచున్నది. వాఁడు నిన్న పొద్దున నెందుకు వచ్చి నాఁడు - నిన్నప్రొద్దున వాఁ డెందుకు వచ్చినాఁడు-ఎందుకు వచ్చినాఁడు వాఁడు నిన్న పొద్దున - ఈ మూఁడు వాక్యములలో నున్న శబ్దము లొక్కటే భిన్నస్థానములందుండుటచేత భిన్నార్థకము లగుచున్నవి. ఈ యర్థములభేదము సూక్ష్మమైనది. ముద్రారాక్షసమున ప్రస్తావనాంతమున చాణక్యుఁడు పటాక్షేపముతోఁ బ్రవేశించి తనకోపమును బ్రదర్శించి శిష్యుని 'శార్ఙరవ శార్ఙరవ' యని కోపముతోఁ బిలుచును. ఆ శిష్యుఁడు ప్రవేశించి యుపాధ్యాయ యుపాధ్యాయ యనును. మద్రాసు రాక్షసము నాంధ్రీకరించిన వా రందఱు నుపాధ్యాయ ! ఏమిసెలవు అని తెలిఁగించిరి. అచ్చట వీప్సయైన యుపాధ్యాయ శబ్దముయొక్క తాత్పర్యము వేఱు. కోపి యైన యధికారి సేవకునిబిలిచినపుడు వాఁడు అయ్యా! అయ్యా! యని సమీపించునేకాని యేమి పనండీ యని యడుగఁడు. ఆ ద్విరుక్తోపాధ్యాయశబ్దములో చాణక్యునికోపియైన యజమానితనము, శార్ఙరవుని గురువునందలి మహాభయముతోడి వినయము, భాసించుచున్నవి. ఇది లోకము. లోకములోని సూక్ష్మవిషయము. దానిని గవి యట్లుపయోగించినాఁడు. శిల్ప మనఁగా మఱేమియు లేదు. ఆలోచనతోఁ గూడిన మహార్థస్ఫురణ. తత్స్ఫురణానుకూల మైన శబ్దప్రయోగము.

"శాంత మిద మాశ్రమపదం. స్ఫురతిచ బాహుః; కుతః; ఫలమిహాస్య,
అథ వా భవితవ్యానాం ద్వారాణి భవంతి సర్వత్ర"

ఇది చిన్నిశ్లోకము. ఆర్య. ఇందులో రెండు సగములు. మొదటిసగములో మూఁడువాక్యములు, రెండవ సగ మంతయు నొకటియేవాక్యము. పూర్వార్థ మంతయు నసంభవమైనది సంభవ మెట్లగు నన్న భావ

విచారణామూలక మై మూఁడు వాక్యము లైనది. కుతః ఫల మిహాస్య యనుటలో 'నెట్లు, ఫలము, ఇక్కడ దీనికి' అన్నవరుసలో నిబిడ మైన యాలోచనాశక్తి స్ఫురించుచున్నది. ఆ వరుస చెడినచో నా నిబిడత తగ్గిపోవును. ఇది పరమసూక్ష్మ మైన విషయము. కొంద ఱు ష్షన వచ్చును. అన్న వాఁడు బలవంతుఁడై ప్రతివాది బలహీనుఁడైనచో నా యుష్షనకుఁ బ్రతివాది యెగిరిపోవచ్చునుగాని విషయమునందలి గౌరవము మాత్రము తేలిపోవునది కాదు.

"పతు ల్విజృంభితశ్రీవిలసిల్లుకామినులు చేష్వాడి రిట్లపతిత్వ దీనతన్" ఇది వాడుక భాషకాదు. వాడుకభాషలో విజృంభితశ్రీ విలసిల్లు కామినులు నని యెవ్వఁడు ననఁడు. ఆ కూర్పులో భీమునిరౌద్రావేశ మున్నది. తనమహారుద్రకోపసాఫల్య మున్నది. 'సయమిక్ర మోచిత విచారక్లేశముల్ సంజయా'! తమనీతికిఁ బరాక్రమమునకు నుచితమయిన యాలోచనలు చేయవలసినకష్టములు వారి కెందుకు అని. ఈ భావము లోకములోఁగూడ తత్రతత్ర యుండవచ్చును. ఉన్నప్పుడది వాడుక భాష కాదు. ఒక యుద్వేగముతో నొకయావేశముతో నొక కోపముతో నొక యాలోచనతోఁ బరిపాకబుద్ధి యైనవాఁడు మాటాడునపుడు వాడెడు స్వభాషయు వాడుకభాష కాదు. అప్పుడు వాఁడు తన యుద్వేగాదులచేత మనస్సు నిశితము కాఁగా నొక ప్రత్యేక మయిన భాషను వాడును ఆ భాష లోకములో లేనిది కాదు. లోకములో నున్నదియే. ఆ కోపావేశముచేత నా శబ్దము లన్నియు నర్థాంతరము పొంది యరముయొక్క ప్రత్యేకతోల్బణము లై విచిత్రముగా భాసించును. కావ్యార్థములు లోకాతీతములుకావు. కావ్యము లోకము లోనిది. లోకమే యొకొక్కప్పుడు లోకాతీతముగాఁ బ్రవర్తించును. అందుచేతఁ గావ్యమునకు లోకమునందు విశిష్టస్థానము కలదు. లేదా విశిష్టస్థానము పొందిన లోకము కావ్యము.

ఇది కావ్యభాష. కనుకఁ గావ్యభాషకు వాడుకభాషకుఁ బ్రత్యేకము లైన హద్దు లున్నవి. లోకమునందుఁగూడ మానవులు ప్రత్యేకపరిస్థితులయందు విశిష్టముగాఁ బ్రవర్తింతురు. విశిష్టముగా భాషింతురు. కావ్యగతపురుషులుగూడ నొకొక్కప్పుడు లోకసామాన్యముగఁ బ్రవర్తింతురు. లోకసామాన్యముగ భాషింతురు. పద్యరచనయొక్కఁడు వీనిరెంటిమధ్యఁ బెట్టినగోడ.

ఈ విభేదము తొలుత స్థూలముగా నైన భాసించినతరువాత శబ్దస్వరూపనిర్ణయము. శబ్దార్థనిర్ణయము.

మనము పదిమంది కూర్చుండి మాటాడుచున్నాము. ఒకఁ డమర్యాదగా మాటాడినాఁడు. వానిని మనము నలుగురము నీకిది తగదన్నాము. అతఁ డమర్యాదగా మాటాడినాఁ డనఁగా నేమి? అది రెండు విధములు. ఒకటి యతఁడు వెలువఱిచినభావము సభాయోగ్యము కాకపోవుట. రెండవది యతఁ డుపయోగించినశబ్దములు మర్యాదాపేతము లైన వగుట. కనుక శబ్దములందుఁగూడ మర్యాదాపేతత్వమున్నది. కొన్ని శబ్దములు మర్యాదారహితములు. అవి కావ్యములందుపయోగించరాదు. ఆ శబ్దములు వాడుకభాషలో నున్నవి. అనఁగా లోకమునందు వాని కుచిత మైన సన్నివేశసమయమునందు వానిని వాడవచ్చును. వాడుదురు. ఆబ - ఇదియొకమాట. వ్యర్థ మైన బహుకాంతాదిగతాభిలాషకు దీనిని లోకములో వాడుదురు. దగ్గఱిస్నేహితులతో సరదాగా మాటాడికొన్నప్పుడు వాడదగినమాట. పదిమందిలో మాటాడరానిది. ఇట్టివి కావ్యమునందెట్లు వాడుట. కావ్యమునందుమాత్ర మేల వాడఁగూడ దన్నచో నెప్పుడు వాడినను బ్రయోజనాపేక్షయా వాడుదుము. మనము లోకమునందు శబ్దము వాడుటకంటెఁ గావ్యమునందుఁ బ్రయోజనాధిక్యాపేక్షచేత వాడుదుము. అందులోనితొలుతటిప్రయోజనము పాఠకునిమనస్సు నుదాత్తీభుల

యందు సంచరింపఁజేసి వాని కొక యుత్కృష్ట మైన మహార్థము భాసించుటకో, రసవీధులయందు సంచరింపఁజేయుటకో చేయుదుము. ఇది కావ్యప్రయోజనము. ఇట్టి యల్పార్థకములు దుష్టార్థకములు నైన శబ్దములు ప్రయోగించినచోఁ దత్ప్రయోజనభంగ మేర్పడును. అందు చేత నిట్టివి కావ్యమునందుఁ బరిహరణీయములు.

మఱియు నపభ్రంశములు కావ్యములందుఁ బరిహరణీయములు. 'వస్తున్నాఁడు' 'చూశాను' 'రాముఁడు' అనుటకు, రాండు ఇట్టిబహుశబ్దములు కావ్యోచితీభంగము కలిగించును. ఈ భంగము కలిగించుట స్వభావసిద్ధమే. ఏలయన నిందాకఁ జెప్పితిమి. ఒకఁ డసభ్యముగా మాటాడినాఁ డని పదిమంది మాటాడునపు డసభ్య మని యె ట్లనిపించెనో కావ్యమునం దది యనుచిత మని యట్లే యనిపించును. ఇది సద్గోష్ఠిభావన, మఱియు నిందొక్క విశేషమున్నది. మన స్వలవాటును బడి ప్రవర్తించును. పినతండ్రికూఁతులను కొన్ని మతములవారు పెండ్లాడుదురు. దక్షిణాపథమున మేనమామకూఁతును బెండ్లాడుదురు. మనకు మొదటిది తప్పు. ఔత్తరాహులకివి రెండును దప్పు. ధర్మశాస్త్ర విషయ మట్లుంచి యిది దోష మనుబుద్ధి యలవాటుచేతఁ బ్రాపించు చున్నది. ఒకయింటిలో ముక్కలు లేకుండుట పులుసుకాచుట యెట్లు అని పెద్ద తగాదా. ఆపూటకు ముక్కలు లేవు. తీసికొనివచ్చుటకు నిప్పుడు వీలులేదు. పులుసు లేకున్నచో ముద్ద దిగదు. ముక్కలులేకుండ పులుసుపెట్టుటకు వీలు లేదను బుద్ధి వట్టి యలవాటుమీఁద నాధారపడి యున్నది. అట్లే యీ యపభ్రంశశబ్దములు కావ్యమునందుఁ బ్రయోగింపఁబడినచో నలవాటు లేక నవి వెగ టనిపించవచ్చును. మఱికవులు ప్రయోగింప నారంభించినచోఁ గాలము పట్టును.

మఱియు ముక్కలు లేని పులుసు నిజముగా దానికి రాఁదగిన రుచి రానిది. కావ్యములో నట్టి కక్కుఱితి యెందులకు ? దీని కేమి

తొందఱ వచ్చినది. అపభ్రంశములయం దుదాత్తత యుండదు. ఉదాత్తతాగుణ మపభ్రంశశబ్దములకు వెలిపోలము. శబ్దము నర్థము నర్థగౌరవ లాఘవములు నిత్యమనోనిష్ఠములు. ఆ మనస్సు తద్వ్యాసంగిది. తద్వ్యాసంగవిరహితమనోభావము లచ్చట ప్రధానములు కావు. మఱియు నీ కాలమున నేతాదృగ్విషయవిచారణీయతరమయిన కావ్యమీమాంసావిషయము ప్రాశ్చాత్యగ్రంథవిమర్శ మార్గసంఘటనాహేతువై పలుపోకిళ్లు పోవుచున్నది. పాశ్చాత్యకావ్యవిమర్శన బయలుదేరి విజృంబించిన పద్ధతి వేఱు. భారతీయ కావ్యవిమర్శనమార్గము వృద్ధిపొందిన పద్ధతి వేఱు. పాశ్చాత్యవిమర్శనాపద్ధతి గాలిలో నెగురును. ఆకాశమునకు సుమములు మొలిపించును. ఎక్కువ భాగ మట్లుండును. వారివిమర్శలో కొంతభాగము సామంజస్యములే దని చెప్పుటకు వీలులేదు. కాని యావిమర్శమార్గ మపరిణతబుద్ధులకు సూత్రనిబద్ధము కాకపోవుటచేత యథేచ్ఛామార్గమున విహరించుటకు వీలుకలిగించుచున్నది. ఆధునికపరిశోధనలో నగానికి సగ మిట్టిది. ఒక రాజవంశమునఁ బదిమంది రాజులున్నారు. ఒక్కొక్కఁ డిరువదియేండ్లు రాజ్యము చేసె ననుకొందము. వారు రెండు నందలయేండ్లు రాజ్యముచేసియుందు రని నిర్ణయము చేయుదురు. పూర్వకాలమున మన దేశములో నూటయిరువదియేండ్లకు దక్కువ జీవించినవారు లే రని పాశ్చాత్య చరిత్రకారులు వ్రాసిన విషయమే. మఱి పదిమందిరాజులు కనీస మూఁడువందలయేం డ్లయినఁ బరిపాలించవచ్చును. ఏదియైన నూహయే. ఆధారము లేదు. కాని మన సాహిత్యగ్రంథములు శబ్దార్థవినిర్ణయము ప్రయోజననిర్ణయము చేసి గావ్యవిమర్శసూత్రములను గట్టినవి. మనము భూమిమీఁద నున్నాము. నీ కాకాశముమీఁద నుండవలయు నన్నచోఁ జేతనైనంత యెత్తుగా మేడ గట్టి యా పైన నాకాశమునం దా యెత్తున నివసింపుము. ఆ రీతిగాఁ గావ్యము శబ్దము నాశ్రయించియున్నది. శబ్దము నాశ్రయించి యర్థ

మున్నది.తక్కినగుణములువీనినిబట్టి సంక్రమించును. తత్కావ్యప్రయోజనబుద్ధ్యా యీ క్రింది నిర్మాణ మంతయుఁ జేయవలయును. ఇది సంప్రదాయపునడక. దీనిని వదలి నేను గాలిలో నెగురుచున్నా ననఁగా నెగురవచ్చును. వానిసి నిజముగా గాలిలో నున్నా డనెడువారును గలరు. గంతకుఁ దగిన బొంత యుండనే యుండును.

ఇం కొక్క మనవి చేసి యుపసంహరించెదను. ఈ తెనుఁగుదేశమున భాషావిషయికము లైన పరిషత్తులు, సంసత్తులు, సమితులు, సభలు, సమాజములు పందలకొలఁది నున్నవి. వీని నన్నింటి నొకకూటమిగాఁ దీసికొనివచ్చు ప్రయత్నము జరుగుటలేదు. ఢిల్లీలో నున్నవారికిచటిపరిస్థితులు తెలియవు. మనభాష వారికిఁ దెలియదు. వారికిఁ బెద్దయుద్యోగములు చేసినవారే ప్రమాణము. ఇచట సాహిత్యవేత్తలలో ననేకత్వము. సాహిత్యలక్ష్యము రాజకీయవిషయములఁబట్టి మాఱుచున్నది. ఇది ప్రచారసాధకముగా వాడబడుచున్నది. దానిలక్ష్యమే దయినను గావ్యము శిల్పముతోఁ గూడినది. శిల్పశక్తి తగ్గని దే కావ్యమైనను బహిర్గ్రాహ్యమే యగును. పాశ్చాత్యమహాకావ్యములు శిల్పభూయము లగుటచేతనే యచ్చటిమతసంప్రదాయాదివిషయము మనవి కాకపోయినను వానిని బహిర్గ్రహించుచున్నాము. రచయితల కా శిల్పబుద్ధి తగ్గనచోఁ గావ్యము కావ్య మగును. శిల్ప మత్సరమునొద్దనుండి కావ్యమహార్ఘాంతి మనుస్యాత మైన విషయము. ప్రపంచ మెంత యనంత మైనదో, యెంత వివిధ మైనదో, కవితావిద్య యంత యనంత మైనది. యంత వివిధ మైనది.

న న్నీ యాధ్యక్షమునందు వరించిన మీకు మఱలఁ గృతజ్ఞతాభివందనములు.

# చారిత్రిక మహాసభ—అధ్యక్షోపన్యాసము

శ్రీ రాళ్ళబండి సుబ్బారావు. ఎం. ఏ. ఎల్ టి. ఎం. ఇ. యస్.

కాకినాడ సాహిత్యపరిషత్ కార్యదర్శులు నన్నీ మహాసభకు నధ్యక్షత నహించవలసినదిగాఁ గోరినందులకుఁ గృతజ్ఞుఁడను.

ఈ పరిషత్తునకును, మా పరిశోధక మండలికిని, కొంత సంబంధ మున్నది. రెండును నాంధ్ర దేశములోని వాఙ్మయేతిహాసములకు సంబంధించిన విషయములనుగుఱించి చాల కాలముగ నాంధ్ర దేశమునకు సేవచేయుచున్న విషయ మందఱకును దెలిసినదే. సాహిత్యపరిషత్తు 45 సంవత్సరములకుఁ బైఁగా, మా యితిహాసకపరిశోధకమండలి 35 సంవత్సరములును సేవచేసినవి. ఇంకను జేయుచున్నవి.

చరిత్రి నెంత పరిశోధించి నిర్ణయించినను, ఆ నిర్ణయమే తుది నిర్ణయము కాఁజాలదు. పరిశోధనలు చేసినకొలది నెప్పటికప్పుడు క్రొత్త విషయములు బైటపడుచునే యుండును. ఈ విషయములను మనము గ్రహించవలెను. అనేక శాస్త్రములలో నుత్తీర్ణులైన పండితోత్తములు చరిత్రి విషయములోఁ జాల వెనుకఁబడియున్నారు. చారిత్రిక పరిశోధకులు భాషావాఙ్మయములోఁ జాల వెనుకఁబడియున్నారు. సాహితీపరులు, చారిత్రిక వేత్తలు నుభయులుఁ గలిసి సాహిత్యమును, చరిత్రను సమన్వయముచేసి, ఆంధ్రదేశ వాఙ్మయ చరిత్రిను, ఆంధ్రిదేశ చరిత్రను వ్రాసినయెడల దేశమునకు నెంతో యుపకారముచేసినవారు కాఁగలరు. అందువలన మనకుఁ గల యీలోటును బూర్తి చేయుట కాంధ్ర సాహితీపరులు, చారిత్రిక వేత్తలు పూనుకొనవలసియున్నది. మన దేశములోని యున్నతపాఠశాలలలోను, కళాశాలలలోను, సర్వకళాశాలలలోను మన దేశచరిత్రి, వాఙ్మయము తగినట్లు గ్రహించుటకుఁ దగిన యవకాశములు లేనందువలనఁ జరిత్రి, వాఙ్మయము, భాష, యుచితరీతిని నేర్చుకొనుటకు విద్యార్థులకుఁ దగిన యవకాశములు లేకుండుట యందఱకును దెలిసిన

విషయమే. మన దేశములో దొరకుచున్న పురావస్తుశిథిలములవల్లనేమి, శిలా, తామ్ర, శాసనములవల్ల నేమి, నాణెములవల్లనేమి, తాళపత్రి గ్రంథములవల్లనేమి, ఇంక నితర చారిత్రిక విషయములవల్లనేమి, (సర్వ కళలు) మనము మన దేశచరిత్రను నెక్కువ బాగుగ నేర్పఱచుకొనఁగలము. ఈ విషయములను సంగ్రహించి పరిశోధన చేయించుటకుఁ బ్రభుత్వము పూనుకొనవలెను. మన యాంధ్ర దేశములోను, తెలంగాణాలోను, పల్లె పల్లెలలోను వేలకొలఁది తాళపత్రగ్రంథములు కలవు. వీనిని నన్నిటిని సేకరించి యుపయోగించుకొను స్థితిలో మన దేశములో నే సంస్థయు నున్నట్లు కనఁబడదు. అందువల్లఁ బ్రభుత్వమే తాము స్వయముగఁ గాక, యున్న సంస్థలకే ధనసహాయ మొనరించిగాని, వానిని సేకరించి యందలి విషయములను బ్రచురించిన యెడల ననేక ముత్తమ గ్రంథములు వెలువడఁగలవు. ఇట్టి పని కొంతవఱకుఁ జెన్న రాజధానియందు జరుగుచున్నది. మన యాంధ్ర దేశమునఁగూడ నిట్టి పని కొనసాగించినచో మన జీవితపరిస్థితులేగాక జాతిపరిస్థితులేగాక, సర్వప్రపంచమునకును నభివృద్ధి కలుగఁగలదు.

తేనెవంటి తెలుఁగుభాష ద్రావిడ భాషలలో కెల్ల ప్రాచీనతను బట్టి రెండవది. మొదటిది మరవము. ప్రాచీనకాలమునుండియుఁ దెలుగు, కన్నడభాషలు కవలపిల్లలవలె వృద్ధిజెందినవి. శ్రీనాథుఁడు (1375—1455) ఆ తరువాత కృష్ణదేవరాయలు (1509—1530) దేశభాష యందుఁ దెలుఁగు లెస్స యని చెప్పిరి. రసోల్లాసమునందు మధురవచనమునందుఁ దెలుఁగువంటిభాషలేదని యప్పయ్యదీక్షితులు మొదలగువారు చెప్పిరి. దీనికి ముఖ్యకారణ మాంధ్రులకు సంస్కృతభాషయందుఁ బరిపూర్ణజ్ఞాన ముండుటయే. ఆంధ్రు లార్యులేగదా ? ఆర్యభాష వారిసొత్తు. ఆర్యమత సాంప్రదాయములను వీరు ప్రథమమునుండియు ననుసరించినటు లాంధ్రులశాసనములు ధృఢపఱచుచున్నవి. ఐతరేయ బ్రాహ్మ

ణమున నాంధ్రులు విశ్వామిత్ర సంతతివా రని తెలుపఁబడినది. వీరు కాల క్రమమున దక్షిణాపథమున వ్యాపింపఁగా వారిరాజులు సామ్రాజ్య మేలిరి. క్రీస్తుకు ననేకశతాబ్దములకుఁ బూర్వమే వీ రుత్తరమున మాల్వా మొదలు దక్షిణమున మైసూరుపఱకును, తూర్పుతీరము మొదలు, పశ్చిమతీరమువఱకును గల ప్రదేశమును పరిపాలించి రని వారి శాసనములేమి, నాణెములేమి, పురాణములేమి, చెప్పుచున్నవి.

వీరు పైశాచి (గుణాఢ్యుని బృహత్కథ) ప్రాకృతము (హాలుని గాథాసప్తశతి, అదే కాలమునాటి లీలావతి) సంస్కృతము, దేశి భాషలను బ్రోత్సహించి, యీ భాషలను నభ్యసించిరి. రాజభాష యాంధ్ర శాతవాహనులకాలమునాఁడు ప్రాకృతమే. ఈభాషయందే యనేకశాసనము లప్పటిరాజకీయ, సాంఘిక, విషయములను దెలుపునవి దేశమునం దంతటను దొరకినవి. కొద్దిపాటి సంస్కృత శాసనములును గలవు. ఆ కాలమున బౌద్ధగ్రంథములు పాళిభాషయందు రచింపఁబడి, దేశీయులగు దెలుఁగువారికిఁ దెలియుచుండెను. హాలుని గాథాసప్తశతి, భేతాళుని పంచవింశతి తెలుఁగుకవులు రచించిన ప్రాకృత కావ్యములే. గాథాసప్తశతియందుఁ గొన్ని తెలుఁగు పదములు గలవు. బుద్ధఘోషుని యాంధ్రఅట్ఠకథ (క్రీస్తుపూర్వము నాఁటిది.) తెలుఁగు, ప్రాకృతపదములు గలదే. సంస్కృతము నేర్చిన తెలుఁగువారికా కాలమున దేశకవిత్వమునందుసంస్కృతమును వాడుచుండుట యలవాటయ్యెను. శాసనములందు గల ప్రశస్తిచంపు, కావ్యముక్రింద మాఱి యిదియే క్రమముగ మార్గకవిత యయ్యెను. దేశివాఙ్మయ మంతయుఁ బ్రాచీన తెలుఁగునందే రచింపఁబడెను. ప్రాచీన అరవ, కన్నడ భాషలకు నిది సంధి మార్గము చూపెను.

ఇట్టిప్రాచీనాంధ్రరాజులకాలమునాఁటి సాంఘిక, మత విషయములును, రాజకీయ విషయములును, వశిష్ఠపుత్ర, పులోమావి

నాశిక్ గుహాలయందు దొరకిన ప్రాకృత గానీసము బట్టి తెలియును. మూఁడు సముద్రములమధ్య నున్న దేశమును నేలినవాఁడును, వింధ్య పర్వత దక్షిణ ప్రదేశము నంతను జయించి సామంతరాజులచే సేవింపఁ బడుచు, పౌరజనులలో సమసుఖదుఃఖములు కలవాఁడును, క్షత్రియుల గర్వ మణఁచి, శక, యవన, పల్లవులను నాశనముచేసి ధర్మమార్గమున పన్నులను గైకొనుచు ద్విజుల కుటుంబములను వృద్ధిచేయుచు, శాతవాహన వంశకీర్తి ప్రతిష్ఠించి, చాతుర్వర్ణ్యసంకరమును నివారించి యనేక యుద్ధములలో శత్రు సంఘములను జయించి, ఆగమములకు నిలయమై సత్పురుషులకు నాశ్రయుడై, సత్ప్రవర్తన గలిగిఁ ఏకాంకుశ, 'ఏకధనుర్ధర, 'ఏకశూర', ఏకబ్రాహ్మణ, మొదలగు బిరుదములుగలవాఁడును, రాజరాజును, గౌతమీపుత్రుఁడును నగు శ్రీ శాతకర్ణ గుణవిశేషములు వర్ణింపఁ బడినవి.

ఆంధ్ర శాతవాహనులతరువాత మనదేశము చిన్న చిన్న రాజ్యములుగఁజీలిపోయి యనేకవంశములవారిచేఁ బరిపాలింపఁబడెను. వర్ణాశ్రమధర్మములు మఱింత స్థిరపడెను. రాజులు బ్రాహ్మణమతమును బోషించుచు, సంస్కృత, ప్రాకృత భాషలకు, విద్యలను, సహాయ మొనర్చుచుండెడివారు. రాణులు (ఆంధ్ర శాతవాహన రాజ్యకాలములోవలెనే) బౌద్ధధర్మమునకు, మతమునకును సహాయ మొనర్చుచు, బౌద్ధ సంఘారామములు, చైత్యములు కట్టించుచుండెడివారు. ఆంధ్ర శిల్పికళ వృద్ధి చెందెను. ఆంధ్రదేశ మా తరువాత శాలంకాయన విష్ణుకుండిన రాజుల వశ మయ్యెను. మొదట శాలంకాయన రాజులశాసనములు (క్రీస్తు 3వ శతాబ్దము) ప్రాకృతభాషలోఁ జెక్కింపఁబడినను, ఆ తరువాత రాజుల శాసనములు సంస్కృతభాషయందే వ్రాయఁబడెను. వాని నన్నిటియందును, దేవాలయములకును వేదాధ్యయనసంపన్నులగు బ్రాహ్మణులకుఁ దదితరులకుఁ జేసిన తామ్రశాసనములందు, దానముచేయఁబడిన భూములు,

అగ్రహారములు, వానికి సరిహద్దులు, తెలుఁగుభాషయందే వ్రాయఁబడెను. అగ్రహారములు పొందిన బ్రాహ్మణులు ఘటికాశ్రమములు స్థాపించి వారివారి యగ్రహారములందే సంస్కృతమున, సకలవిద్యలను, సర్వకళలను బోధించుచుండెడివారు. తటస్థాంధ్ర దేశము నేలిన యీరాజ వంశముల కాలమున (200—600 A. D) బౌద్ధమతము క్రమముగా క్షీణించెను. బ్రాహ్మణమతము తల యెత్తి స్థిరపడెను. విష్ణుకుండిన వంశకర్త మహేంద్రవర్మ వాజపేయ, బహుసువర్ణ, పౌండరీకాది శతసహస్ర క్రతువులు చేసె ననియు, రాజసూయ,పురుషమేధ, ఏకాదశాశ్వమేధ యజ్ఞములను జేసినట్లు శాసనములు ప్రకటించుచున్నవి. సూర్య, శివ, విష్ణు, మతము లభివృద్ధిచెందెను. వేదభాష, వేదమతము దేశమున వ్యాపించెను, తెలుఁగు సంస్కృతభాషలను, బ్రజలును, రాజులును, పండితులు వాడుచుండిరి శాసనములందలి లిపి తెలుఁగు, కన్నడ లిపి, జనాశ్రయుని ఛందోవిచ్ఛితి యను గ్రంథమునుబట్టి శీర్షిక, ద్విపద త్రిపద, మొదలగు గణ, యతి ప్రాసలు వాడఁబడెను. ఆకాలపు శిలా శాసనములందును (7వ శతాబ్దము) తెలుఁగు వాడఁబడెను. (ముఖ్యముగా దానగ్రామముల సరిహద్దులను దెలుపు సందర్భమున).

క్రీస్తు 600 మొదలు 1200 వఱకు నాంధ్రదేశముతూర్పు చాళుక్యులచేఁ బరిపాలింపఁబడెను. వీరు దేశము జయించి పాలించిరి. వీరికాలము జైనమతముగూడ దేశమున నాదరింపఁబడుచుండెను. రాజులును, రాణులును జైన మతములకు దానము లిచ్చుచుండెడివారు. నన్నయ - రాజరాజనరేంద్రుల కాలమునుండి వైదికమతమే రాజులచేతను బ్రజలచేతను నాదరణ పొందసాగెను అప్పటినుండి తెలుఁగు భాషకు, వాఙ్మయమునకుఁ బ్రశస్తి కల్గెను. ఆంధ్రదేశమునఁ దెలుఁగు వాఙ్మయము చాళుక్యరాజుల వల్లనే పుట్టి పెరిఁగినది. ప్రప్రథమమునఁ బద్యరచన మార్గశైలిని, ఆ తర్వాత దేశిశైలిని (చాళుక్యులుప్రోత్సాహించిన రీతిని) రచింపఁబడెను.

9వ శతాబ్దప్రారంభమునఁ దెలుఁగు పద్యరచన (గుణగణ విజయాదిత్యుని శాసనములందువలె) ఆంధ్రదేశమునఁ గనఁబడెను. రెండువందలసం॥లవఱకు దెలుఁగు కావ్యమే లేకుండెను. శాసనములందుమాత్రము పద్యరచన గద్యతోపాటు విరివిగాఁ గనఁబడును. దీనికిఁ గారణము తెలుఁగు కవులు కన్నడ భాషయందే (కన్నడ రాజులను మెప్పించి బహుమతులు పొందుటకు) కవిత్వము చెప్పుచు, రచనలు సాగించుచుండుట. ఇట్లు వారే పొన్న, పంప, నాగ అను కమ్మనాటి (గుంటూరు) కవులు. పొన్న రచించిన శాంతి పురాణము జినేంద్రుని కంకితము చేయఁబడెను. పంప విక్రమార్జున విజయము, ఆదిపురాణము రచించెను. నాగ చందోంబుధి, కాదంబరి యను కన్నడ కావ్యములను రచించెను. ఇద్దరును జైనమతస్థులు ఈ పంప జైనభారతమునకుఁ బోటీగానే నన్నయభట్టు తన యాంధ్రభారతమును రాజాజ్ఞచే రచించెను.

# శ్రీహర్షుడు — శ్రీనాథుఁడు

రచయిత :: "కవిమూర్ధన్య" శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి.

శ్రీ హర్షుఁడు "కవిరాజరాజిమకుటాలంకార శ్రీహీరకుమారుఁడు - జితేంద్రియుఁడు - చింతామణిమంత్రసిద్ధుఁడు - ఖండనఖాద్యాదిప్రౌఢగ్రంథరచనాప్రసిద్ధుఁడు - కాశ్మీరమహారాజాస్థానకమల వనహేళి - షట్తర్కధర్మైకచక్రవర్తి".

శ్రీనాథుఁడును "బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడు - ఉరుప్రజ్ఞావిశేషోదయాజిహ్మస్వాంతుఁడు- ఈశ్వరార్చనకళాశీలుఁడు - అభ్యర్హితబ్రహ్మాండాది మహాపురాణచయతాత్పర్యార్థనిర్ధారిత బ్రహ్మజ్ఞానకళానిధాన" మగు మహాకవిసార్వభౌముఁడు

అమరభాషలో నమితప్రౌఢగతి హర్షపండితుఁచే నారికేళపాకమున రచింపఁబడిన నైషధకావ్యమునకు మెఱుఁగులు వెట్టి యాంధ్రీకరించిన యఖండపాండితీశౌండీర్యుఁడు - గౌడడిండిమభట్టారకకాంస్యఢక్కావిపాటనచణుఁడు శ్రీనాథుఁడు.

శ్రీహర్షుని మూలశ్లోకమును శ్రీనాథుఁ డెట్లాంధ్రీకరించెనో చూతము.

శ్లో॥ "పాణయే బలరిపో రథ భైమీ
శీతకోమలకరగ్రహ మర్హమ్
భేషజం చిరచితాశనివాస
వ్యాపదా ముపదిదేశ రతీశః"

(నైష ౫ సర్గ ౨౫ శ్లోకము)

"రతీశుఁడు (మన్మథుఁడు) చిరకాలము వజ్రాయుధమును బట్టుకొనుటచేఁ గలిగిన విదాహము శమించుటకై బలదమనుఁ డగు నింద్రుని హస్తమునకు దమయంతియొక్క చల్లని మెత్తని కరమును గ్రహించుట యను యుక్త మగు వైద్యము నుపదేశించెను" అని దీనియర్థము.

మ॥ "పక్షసంగంబునఁ దాప మందిన శచీప్రాణేశు కెంగేలికిం
జివురుంగైదువుజోదు వైద్య ముపదేశించెన్ రహస్యంబుగా
నవనీహారపయోమిళన్మలయజస్నానార్ద్ర పర్యంత మై
యువతాలించు విదర్భరాజతనయాహృద్యస్తనద్వంద్వమున్".

ఇది శ్రీనాథుని యాంధ్రీకరణము - ఇఁక మూలానువాదములందలి విభేదములను విశేషముల నించుక పరిశీలింపవలసి యున్నది.

1. మూలమున - భేషజ ముపదేశించినవాఁడు "రతీశుఁ" డగు మన్మథుఁడు.
   అనువాదమున — వైద్యోపదేష్ట "చివురుంగైదువుజోదు" నగు మన్మథుఁడు
2. మూలమున - "బలరిపుని పాణికి" చికిత్స
   అనువాదమున-"శచీప్రాణేశుని కెంగేలికి" చికిత్స.
3. మూలమున-"బలరిపుని పాణి" వజ్రాయుధధారణవైరగర్భ్యమునే విదాహస్థితి నందినది.
   ఆంధ్రీకరణమున-"శచీప్రాణేశుని కెంగేలు పక్షసంగంబునఁ దాప" మందినది.
4. మూలమున రతీశుఁడు "యుక్త మగు భేషజ" ముపదేశించినాఁడు.
   ఆంధ్రీకృతిలో - చివురుంగైదువుజోదు "వైద్యమును రహస్యంబుగా" నుపదేశించినాఁడు.
5 మూలమున భేషజము "భీమతనూజాశీతకోమలకరగ్రహణము".
   ఆంధ్రీకరణమున వైద్యము "క్రొమ్మంచునీటఁ గలిపిన చందనము నేఁ జల్లఁదన మందిన వైదర్భీహృద్యస్తనద్వంద్వము".

మూలానువాదములలో శ్రీహర్ష శ్రీనాథకవీంద్రుల కిరువురకు గొన్ని సాభిప్రాయవిశేషములలోఁ దక్క సర్వత్ర సాదృశ్య మున్నను-కాని భేషజకల్పనమునమాత్ర మరింత మగు విభేదము గన్పట్టుచున్నది.

—: శ్రీహర్షుని శ్లోకమందలి భావవిశేషములు :—

"బలభిత్" శబ్దప్రయోగముచే బలనామకదనుజసంహర్త యగు నింద్రుఁడనుటయేకాక బలశాలు రగుశాత్రవులు గలవాఁ డనికూడ ధ్వనించుచున్నది. తన్మూలమున బలవంతులఁ జయించుటచే సమరనాయకుఁ డమితబలశాలి యని భావము. మిగుల బలశాలుర సంహరించుట సులభముగఁ ద్వరితగతి నంతి మగు కృత్యము గాదు కావుననే "చిరచితాశనివాసవ్యాపత్" పదప్రయోగ మొనరించి చిరకాలవజ్రాయుధగ్రహణకారణము బోధింపఁబడినది. చిరవజ్రధారణముచే నింద్రుని పాణికి విదాహము సంభవించినది. విదాహమును శమింపఁ జేయునది శైత్యమే కావున నైంద్రవిదాహపీడితకరమునకు దమయంతీశీతకరస్పర్శ మవశ్యంసేవ్య మగుటచే నట్టి చికిత్సావిశేషము రతీశునిచే నింద్రున కుపదేశింపఁబడినది.

ఇంద్రుఁ డాయుర్వేదము నాశ్వినేయులవలన నుపదేశ మందినవాఁడు. దాని నత్రిపుత్రాదుల కుపదేశించినవాఁడు "బ్రహ్మా స్మృత్వాయుషో వేదం ప్రజాపతి మజిగ్రహత్ - సోఽశ్వినౌ తౌ సహస్రాక్షం సోఽత్రిపుత్రాదికాన్ మునీన్ ॥ అని యష్టాంగహృదయమునఁ జెప్పఁబడియున్నది.

ఇంద్రుఁ డాధివ్యాధిహార మగుశృంగారిభేషజము నిపుడు శృంగారరసాధిదేవత యగుమదనునిచే నదుపదేశ మందినాఁడు.

వజ్రము కఠినతమపదార్థము. అట్టి కఠినతమాయుధగ్రహణముచేఁ గ్లేశము నందుహస్తమునకుఁ గాఠిన్యవిరోధి యగుకోమలపదార్థమును గ్రహించుటయుఁగూడ ముఖ్య కర్తవ్యమే. కావున దాహకాఠిన్యాపనోదార్థము బైమీశీతకోమలకరసంపర్కము ముపదేశింపఁబడినది. మన్మథుఁడు దమయంతీపాణిగ్రహణార్థ మింద్రుని బ్రేరేఁచె నను భావమును బ్రౌఢకవి యగు శ్రీహర్ష భట్టారకుఁడు గంభీరప్రౌఢిమ కవితలో గమగమింప నీ వావిరిఁ జమత్కరించియున్నాఁడు.

ఇఁక శ్రీనాథుని యాంధ్రీకరణవిశేషవైదగ్ధ్యము నరయుదము. "శచీప్రాణేశ్వరుని కెంగేలు పవిసంపర్కమునఁ దాప మందినది. ప్రస్తుత విషయము వీరము గాక శృంగారమే కావున శ్రీనాథకవి మూలమందలి "బలరిపు" "చిరచిత" శబ్దయుగళమును బరిహరించి "పవిసంగంబునఁ దాప మందిన శచీప్రాణేశుకెంగే"లని మృదుగతిఁ దెనిఁగించినాఁడు. కెంగేలు శుభలక్షణము - చక్రవర్తిచిహ్న మని సాముద్రికశాస్త్రోక్తి. అదియునుగాక పవిసంగంబునఁ దాప మంది యరుణత భజించినది. "శచీప్రాణేశ" "విదర్భరాజతనయాహృ్యస్య స్వసద్వాంగ్వ" శబ్దములు శృంగారరసమునకే కథాభాగము ననుసరించి ప్రాధాన్య మొసఁగుచున్నవి.

ఇంద్రుఁడు త్రిభువనపాలకుఁడు. ఆతని యానతి నౌదలఁ దాల్చు నాశాపాలు రున్నారు. సంఖ్యాతీత మగుసైన్యమును సమర్థ సేనానులును నున్నారు. ప్రభువున కెప్పుడో కాని యాయుధగ్రహణావసరము సంభవింపదు. ఇంద్రుఁడు సదాయుధోపజీవి యగుసామాన్యసైనికుఁడు గాఁడు. సమర్థు లగునిజయోధవీరుల కసాధ్య మగుపని గల్గినప్పుడే తాను తాత్కాలికముగ వజ్రగ్రహణ మొనరించి పని తీరినవెనుక దానిని విసర్జించును. అందువలన "చిరచితాశనివాస" మను పదము శ్రీనాథునకు రుచింపమిఁ గేవలము "పవిసంగంబునఁ దాప మందిన" యని తేలికగఁ బలికి విడిచినాఁడు. "శచీప్రాణేశ" "శబ్దము ప్రయోగించి సతీమణియు, సౌందర్యరాశియు నగు పౌలోమిచే నంత గాఢముగఁ బ్రేమింపఁబడుచుండియు నింద్రుఁడు భైమీకుచగ్రహణాభిలాష గాంచె ననుటచే వైదర్భిసౌందర్యాతిశాయిత్వము సువ్యక్త మొనరించి యున్నాఁడు. మఱియుఁ "కెంగేలికి" "జివురుంగైదువుజోదు వైద్యముపదేశించె" నని నొడువుటలోఁ గెంగేలికిని జివురునకును సాదృశ్యము ధ్వనించుచున్నది. "చివురు" "వైద్యము"నను శబ్దములచే నోషధివైద్యముగూడ సూక్ష్మముగ ధ్వనింపకపోదు. పవిగ్రహణము సంగ్రామార్థము. పవిగ్రహణముచే సురపతికిఁ గరతాపము గలిగినది.

తన్నివృత్తికై తగిన వైద్య ముపదేశించువాఁడు సాంగ్రామిక వైద్యుఁడు (Military Doctor) మన్మథుఁడు. అతఁడు చిపురుంగ్రె దుపుజో దగు టయేకాక వైద్యుఁడుగూడను. అందుచే నాతఁడే సరిహాస్యముగ వైద్య ముపదేశించినాఁడు. భేషజము, మంత్రము, నాత్మతత్త్వము మొదలగు నవి యర్హు లగువారికి రహస్యముగ నుపదేశింపవలసిన మహావిద్యలు. అదియునుంగాక ప్రస్తుత మింద్రునకు మదనుఁ డుపదేశించిన భేషజము వైదర్భివక్షోజగ్రహణముకావున నత్యంత రహస్యోపదేశమున కర్హ మైనది. మూలమందలి "శీతకోమలకరగ్రహ"ములోని శీతశబ్దము "కాల్సేతులు చల్లఁబడుట" యను సూక్ష్మార్థ్మలత మనసునకు రవంత తాకుటచేఁ గాబోలును శ్రీనాథుఁడు మూలోక్త ముగుచికిత్సాపద్ధతిని బరిపూర్తిగఁ బరిత్యజించి యన్య వైద్యయోగము నుపదేశించినాఁడు. కరగ్రహణము కుచగ్రహణముగ మాఱినది. ఉరోజములకు శైత్యము సదాసహజమా యను శంక యంకురించుట యసహజము కానేరదు - ఏ మనఁ గూపోదకము, వటవృక్షము, సముద్రము. తరుణీకుచమును శీతలవేళ నుష్ణముగను, వేసవిలో శీతలముగ నుండు ననుట సుప్రసిద్ధము. కావుననే వైదర్భివక్షోజములందు శైత్యకల్పనము గావింపవలసివచ్చినది. చందనపంకసంకలితమై గుబాళించు నవీనతుషారనీరస్నానముచేఁ జల్లందనము కల్పించి మన్మథదేవునిచే విదర్భరాజతనయాహృద యంగమకుచయుగళి నింద్రునకు ధారాదత్త మొనరింప నమకట్టినాఁడు శ్రీనాథుఁడు. ఇంద్రునకు శచీపాణిములకంటె వైదర్భిస్తనద్వంద్వమే హృద్య మయ్యె నని భావము—

కొందఱ ఆధునికులు వాకొను తెలుఁగున సంస్కృతపదములకు డు, ము, వు, లు తగిలించిన కవి గానేరఁడు శ్రీనాథకవీంద్రుఁడు. కొన్ని తావుల నీతఁడు మడమలఁ ద్రొక్కుచు మూలానుసారి యై శ్లోకము లనువదించినాఁడు. మఱికొన్ని తావుల నిరాఘాటలీల స్వేచ్ఛానువాద

మొనరించి ప్రౌఢతనము బాహాటించినాఁడు. నైషధమునందలి మఱి యొక శ్లోకమును, దదాంధ్రీకరణచాతురియుఁ బరికింతము.

శ్లో॥ లిపి ర్న దైవీ సుపఠా భువీతి
తుభ్యం మయి ప్రేషితవాచికస్య
ఇంద్రస్య దూత్యాం రచయ ప్రసాదం
విజ్ఞాపయంత్యా మవధానదానమ్

(నైష ౩ సర ౮౮ శ్లోకము)

ఈ శ్లోకమునకు శ్రీనాథుని యనువాదము.

ఉ॥ చంచలనేత్ర! దివ్యలిపిసంతతి భూజనముల్ పఠింప లే
రంచును మానెఁ గాని నఖరాగ్రమునన్ లిఖియించి నీకుఁ బు
త్తెంచుఁ జుమీ మహేంద్రుఁడు మదీయకరంబున దేవతాపతి
కాంచనకేతకీకుసుమగర్భదళంబునఁ గార్యపద్ధతుల్.

మొదట మూలశ్లోకభావమును బరిశీలింతము.

"దేవతల లిపి భూలోకమునఁ జదువ నలవిగా దని యెంచి యింద్రుఁడు తన దూతిక నగు నాచే వాగ్రూపసందేశముఁ బంపినాఁడు. దానిని విన్నవించుకొనఁబోవు నాయం దనుగ్రహ ముంచి శ్రవణావధానమునఁ గటాక్షింపుము" అని యింద్రదూతిక దమయంతీసన్నిధానమున విన్నవించుకొనినది.

ఆంధ్రీకృతిపద్యభావము నరయుదము.

"ఓ చంచలాక్షి! దేవతాలిపిజాలమును భూలోకమందలి మానవులు పఠింపఁజాల రను కారణముచే లేఖాప్రేషణకృతి విరమించినాఁడు. కాని యో మామహేంద్రుఁడు నీకు నందనవనిజనిత మగుస్వర్ణకేతకీకుసుమమందలి (తెల్ల మొగలిపట్టకాదు) యంతర్దళమందుఁ దన కొనగోటఁ గార్యక్రమమును లిఖించి నాచేఁ బంచియేయుండునుసుమా".

అని శ్రీనాథుఁడు స్వేచ్ఛాగతి దెనిఁగించి మూలమునకు వన్నె పెట్టినాఁడు. ఇపుడు మూలానువాదము లందలివిశేషముల తారతమ్యముల నించుక పరిశీలింతము.

"దైవలిపి భూజనులు పఠింపఁజాల"రని కవీంద్రు లిరువురును పలికినారు.

శ్రీహర్షుని యైంద్రదూతిక "మర్త్యులు దివ్యలిపి పఠింపలే"రని యెంచి యింద్రుఁడు తన దూతిక నగు నన్ను వాచికసూచకవార్త నీకు నివేదించుటకై పుత్తెంచియున్నాఁడు. నీవు దయయుంచి (నాపై - ఇంద్రునిపై) శ్రవణభిక్ష నెట్టు" మని కార్యసాఫల్యాభిలాషిణి యై వినయ మినుమడింపఁ బేశలవిశదవచనరచనలఁ బ్రార్థించినది.

శ్రీనాథునిదూతిక యింద్రదూతిక గాదు - మహేంద్రదూతిక మిగుల ప్రౌఢ. తాను మహేంద్రదూతిక నని విచిత్రగతి నిగూఢముగఁ దెలియఁజేసినది. దివ్యలిపి భూజనులు పఠింపలే రనినది. "చంచలనేత్ర!" యని దమయంతిని సంబోధించుటలో "దేవత లనిమిషులు (రెప్ప పాటు లేనివారు) నీవు చంచలనేత్రవు. అనిమిషులచేమాత్రమే పఠింప సాధ్య మగు లిపి చంచలనేత్రలు పఠింపలేరు. ఈ విషయము త్రిభువనవిభుఁ డగు మామహేంద్రుఁ డెఱింగియే నీకుఁ బ్రేమలేఖ లిఖించి పుత్తెంచఁ డాయెను" అని దైవతాధిక్యమును జాటించినది. "మా నెఁగాని నఖరాగ్రముల లిఖియించి నీకుఁ బుత్తెంచుఁజుమీ మహేంద్రుఁడు మదీయకరంబున" యను దూతీప్రసంగములో మహేంద్రశబ్దమునఁ దన ప్రభుమాహాత్మ్యమును వ్యక్తీకరించుటయే కాక "మదీయకరంబున" యని పలికి మహేంద్రునకుఁ దనయందు మాత్రమే కల విశ్వాసమునుగూడఁ దెల్పినది. తా నతని యొక్క ప్రియదూతిక ననియు, తా నెట్టి లేఖను గైకొనిరాలేని కారణముఁ బ్రౌఢగతి సూచించి యుంటచేతనే తాను వాచికసందేశహారిణి నను భావమును జెప్పకయే వెల్ల మొనరించినది.

శ్రీహర్షునిదూతిక "నేను ఇంద్రదూతికను - అతఁడు నా ముఖమునఁ గొన్ని వార్తలంపియున్నాఁడు - అవి నేను మనవిచేసుకొనెదను. దయయుంచి యవధరింపుము" అని పేలవముగఁ దేటతెల్ల

ముగఁ గార్యానుకూల్యమునకై త్రిలోకీనాయకుఁ బ్రాభవ మణుమాత్ర మైనను మాటలలో బాహిరింపక, పలుకులలో భావగాంభీర్యము, విషయానిగరణము. చమత్కృతియు విరచించి వైదర్భిప్రౌఢహృదయము నాకర్షింపనేరక యొక్కమాఱుగ దైవతలోకమునుండి తలక్రిందుగ జాఱి - భూలోకమునకుఁగూడ నొక మెట్టు క్రిందుగ దిగి సవినయ సంప్రార్థనము నవధరించినది.

శ్రీనాథుని మహేంద్రదూతిక తాను లేఖాహారిణి గాక వార్తాహారిణి నను భావము చమత్కరించి ప్రౌఢగంభీరశృంగారరసము మేళవించి తనలోకముయొక్కయు, లోకనాథుని యొక్కయు, దనయొక్కయు నౌద్ధత్యము భంగింపఁబడని విధముగఁ బ్రసంగించినది మఱియు - "కాంచనకేతకీకుసుమ" యని పల్కుటలో దమయంతీ తనూరుచి కాంచనకేతకీరుచిర మనియు "గర్భదళ" పదప్రయోగముచే స్వర్ణసచ్ఛాయమగుమేనఁ దన మహేంద్రుఁడు "నఖరాగ్రమున లిఖియించు" ననియుఁ బలికి నఖక్షతము లొనరింప నభిలషించుచున్నవాఁ"డను నిలింపపతిగాఢశృంగార వాంఛితమునుగూడ గూఢముగ ధ్వనింపజేసినది.

ఆంధ్రదేశమున నన్ని ప్రాంతములతోడ విశేషపరిచితిగల కొంటెశ్రీనాథకవి "కార్య" మన పునస్సంధాన మను సామాన్యజన ప్రయోగమును మనసున నిడుకొనియే "కార్యపద్ధతుల"ని చమత్కారముగఁ బ్రయోగించెనేమో! ఏ మన నాతని కది పరిపాటి యనుట కొక తావున "వేల్పులెల్లను నిన్ను విషయింపవచ్చిరి" అనినాఁడు. విషయించుట యనఁగాఁ జూచుట యనియే యర్థముగదా! ఆ పదము "వీక్షింపవచ్చి"రని సంస్కరింపఁబడినది.

శ్రీనాథుఁడు దుముప్పులకవియో - స్వాతంత్రుఁడో - అనౌచిత్యంబు పరిహరించి - యౌచిత్యంబు పోషించి" యను యాతఁడు ప్రౌఢగంభీరగతి గావించిన ప్రతిజ్ఞ యవంధ్యమో - నిరర్థమో రసికపండితవిమర్శకలోకమే నిర్ధరింపఁగలదు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# ఆంధ్రభారత విమర్శనము

రచయిత : శ్రీ కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి B. A. ఆనర్సు.

ఒక గ్రంథమును విమర్శించుట కుపక్రమించుటకుముం దది యే జాతికిఁ జెందినదో నిర్ణయించుట ముఖ్యము. ఒక్కొక్క జాతి కొక్కొక్క వైలక్షణ్య ముండును. అది యా జాతిగ్రంథసముదాయముయొక్క జీవలక్షణము. దాని నెఱుఁగుట యా జాతి నెఱుఁగుట. తద్విలక్షణ లక్షితమైన యాగ్రంథమునుగూర్చిన యుచితానుచితవివక్ష యా గ్రంథ విమర్శన మగును. సంస్కృతవాఙ్మయమున వేదములు, (వానికిసంబంధించిన) సంహితలు, బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు-వేదాంగములు-ఇతిహాసములు-పురాణములు - కావ్యములు-ఖండకావ్యములు-నాటకములు-ఇత్యాదులైన వివిధజాతులగ్రంథము లున్నవి. వీనియన్నింటియందును గల జీవలక్షణ మొకటి గాదు. ఇందుఁ గర్మపరములు కొన్ని, జ్ఞానపరములు కొన్ని, సద్యఃపరనిర్వృతిపరములు కొన్ని యున్నవి. ఈ విషయములను బరామర్శించి గ్రంథస్థవిషయమునుబట్టి దానిజాతిని నిర్ణయింపవలయును. సద్యఃపరనిర్వృతిపర మైన గ్రంథసముదాయమును స్థూలముగా వాఙ్మయ మని యనవచ్చును. మిగిలిన పైవి వైదిక వాఙ్మయములోఁ జేరినవి. స్పష్టతకొఱకుఁ జేయఁబడిన విభజన మిది. సద్యఃపరనిర్వృతిపరమైన దంతయు వాఙ్మయ మనినను-అం దవాంతరములైన భేదము లున్నవి. ఇతిహాసములు-పురాణములు-కావ్యములు-ప్రబంధములు-ఖండకావ్యములు-నాటకములు-ఇత్యాదు లన్నియుఁ బరస్పరము భిన్నములు. సూక్ష్మపరిశీలనమున నీ విషయము లవగతములగును. ప్రస్తుతము నా యుపన్యాసవిషయ మాంధ్రభారతవిమర్శనము. అనఁగా నాంధ్రభారత మే జాతికిఁ జెందిన గ్రంథమో నిర్ణయించి దానివిమర్శనాపద్ధతిని సూచించుట. ఆంధ్రభారతమును విమర్శించుటలో

నేను మొదటివాఁడను గాను. నాకంటెముందు కొంద ఱా పని చేసిరి. వా రెట్లు చేసిరో స్పృశించి యెట్లు చేయవలయునో చెప్పుట నా యుద్దేశ్యము.

వ్యాసమునిప్రణీత మైన భారతము సంస్కృతమున నున్నది. కవిత్రయమువారి యాంధ్రభారతమందలి యితివృత్తము సంస్కృత భారతమునందలిదే. ఆ విషయమును గవిత్రయమువారు స్పష్టముగా వ్రాసియే యున్నారు. అందువలన సంస్కృతభారతమును గవిత్రయ మువా రాంధ్రీకరించినా రను నభిప్రాయము వ్యాప్తిలోనికి వచ్చినది. ఈ యభిప్రాయమును మనసునఁ బెట్టుకొని సంస్కృతాంధ్రభారతము లను బోల్చిచూడఁగాఁ గొంత వ్యత్యాస ముండుటవలన నా సరిపోల్చి చూచిన పండితవిమర్శకులు కవిత్రయము వారిది స్వతంత్రానువాద మనిరి. మాటను మార్చి కొందఱు స్వేచ్ఛానువాద మనిరి. ఇట్లనుచునే సంస్కృ తాంధ్రభారతములను బోల్చుచు నిచట కవిత్రయమువారు వ్యాసుని మూలమునకు మెఱుఁగులు పెట్టినా రనియు, నిచట మూలమున నున్న రసవత్తరము లైన శ్లోకములను గవిత్రయమువారు తెనిఁగించుట మాని నా రనియు, నిచటఁ బఱ్ఱ్తిగాఁ జెడఁగొట్టినా రనియు, వ్రాయుట సామాన్య మైపోయినది. ఇట్టివారిలో ముఖ్యులు (కీ. శే) కందుకూరి వీరేశలింగముపంతులు (ఆంధ్రకవులచరిత్ర) శ్రీ చాగంటి శేషయ్య (ఆంధ్రకవితరంగిణి) శ్రీ గుఱ్ఱము వేంకటసుబ్బరామయ్య (కవిత్రయ కవితావిమర్శనము) శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు-ఇంకను గొందఱు గలరు. వీ రందఱును స్వతంత్రానువాద మని, ఆంధ్రీకరణము యథేచ్ఛగా సాగిన దని, భాషాంతరీకరణ మను తలంపుతో దీనిని విమ ర్శింపఁబూనుట యుక్తము గా దని వెనువెంటనే తిక్కనాదులప్రతిభా విశేషము కవితాచాతుర్యము తెలిసికొనవలె నన్నచో మూలగ్రంథ ముతో సన్నిహితముగఁ బోల్చి చూడవలసిన యావశ్యకత కలుగు

చున్న దనియు, సంస్కృతమూలమునకుఁ గేవలానువాదమాత్రము గాదు, చాలవఱకు స్వతంత్రకావ్యము, ప్రధానముగా వ్యాసమహర్షిది పౌరాణికనైతికదృష్టి, కవిత్రయమువారిది కావ్యకళాదృష్టి యనియు వ్రాయుచు మూలము నుద్ధరించుచునే యాంధ్రభారతమును గొంత గొంత విమర్శించిరి. నాకుఁ దెలిసినంతవఱకు సంస్కృతభారతముతో నిమిత్తము లేకుండ తెనుఁగుభారతమును దమ కవకాశమున్నంతలో విమర్శించుటకుఁ బూనినది శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావు, (భారతము-తిక్కనరచన) శ్రీ విశ్వనాథ సత్యనారాయణ (నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తి) శ్రీమాన్ నండూరి రామకృష్ణమాచార్య (కవిత్రయము) శ్రీ కాళూరి వ్యాసమూర్తి (తిక్కనకళాసామ్రాజ్యము) గారలుమాత్రమే. తా మెందుకు సంస్కృతభారతముతోఁ బోల్చి తెనుఁగుభారతమును విమర్శించుట లేదో వీరిలో నెవ్వరును స్పష్టముగాఁ జెప్పినట్లు లేదు. ఏది యె ట్లున్నను దెనుఁగుభారతవిమర్శకులలో రెండు వర్గము లున్నట్లు స్పష్టము. సంస్కృతభారతముతోఁ బోల్చి విమర్శించు వర్గ మొకటి. తెనుఁగుభారతమును దన్నిరపేక్షముగా విమర్శించు వర్గ మొకటి. ఈ రెండు వర్గములవారివి రెండు మార్గములు. ఇం దేది యనుసరణీయ మన్నది ప్రశ్న. కవిత్రయమువారు తా మేమి యెట్లు వ్రాసినారో స్పష్టపఱచియున్నారు. మునుముం దా విషయమును విశదీకరించి-యపుడు తెనుఁగుభారత మే జాతిగ్రంథమో నిర్ణయించి, సంస్కృతభారతగ్రంథ విషయమును జర్చించి దానిజాతినిగూడ నిర్ణయించి పై రెండు మార్గములలో నేది యనుసరణీయమో యప్పుడు చెప్పవలయును.

కవిత్రయములో మొదటివాఁడు నన్నయ. రాజరాజు నన్నయతో ననిన మాటలు "నాకు ననవరతంబును శ్రీ మహాభారతంబునందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్ద యై యుండు" కావున

"జననుత కృష్ణద్వైపా
యనమునినృపభాభిహితమహాభారతబ
ద్ధనిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధికధీయుక్తిమెయిన్"

సంస్కృతభాషలో నున్న భారతమును దెనుఁగుభాషలో వ్రాయు మని రాజరా జడుగలేదు. సంస్కృతమున భారతము వ్రాసిన వ్యాసునియభిప్రాయ మేమి ? అం దాతఁడు నిరూపించిన పరమార్థ మేది ? ఆ పరమార్థమును గ్రహించి తెనుఁగున రచింపుము- అని రాజరా జడిగినాఁడు. అడుగుట సులభమే. చేయుట కష్టము. నన్నయ యనినాఁడు. "బుద్ధిబాహావిక్రమమున దుర్గమార్థజలగౌరవభారతభారతీసముద్రముఁ దఱియంగ నీఁదను విధాతృన కైనను నేరఁబోలునే ? అయినను దేవా నీ యనుమతంబున విద్వజ్జనులయనుగ్రహంబునం జేసి నా నేర్చువిధంబున" అట్లే కావించెద ననెను. కష్టసాధ్య మైనదానిని జేయుటలోనే గొప్పయున్నది. నన్నయయు నంగీకరించినాఁడు. అనఁగా సంస్కృతభారతమునఁ గల పరమార్థమును వ్యాసుఁడు దేనిని నిరూపించుటకా గ్రంథము వ్రాసినాఁడో దానిని దెనుఁగున వ్రాయుట కంగీకరించి యుపక్రమించినాఁడు. తరువాత తిక్కన వచ్చినాఁడు. భారతరచన కుపక్రమించు నన్నయను స్మరించినాఁడు. "ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబు గల్గి,యష్టాదశపర్వనిర్వహణసంభృత మై పెనుపొంది యుండ నం దాదిదొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు విద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్" అష్టాదశపర్వనిర్వహణసంభృత మైన సంస్కృతభారతము "వివిధార్థగతిస్ఫురణ" కలిగినదఁట. అందు మూఁడు కృతులు (పర్వములు) నన్నయభట్టు దక్షతతో నొనర్చెనఁట. అనఁగా నన్నయ సంస్కృతభారత బద్ధనిరూపితార్థమునే వ్రాసె నని తిక్కన చెప్పినాఁ డన్నమాట. నన్నయభారత

మును జూడక చెప్పినమాట కాదది. చూచి పరిశీలించి చెప్పినమాట. ఈ మాట చెప్పి తాను విరాటపర్వము మొదలు దుదివఱకు వ్రాయుదు ననినాఁడు. అనఁగా నన్నయవలెనే యర్థగతిని ముఖ్యముగా నిరూపించుచు నని యర్థము. నన్నయలో నీ యర్థగతినిరూపణము లేకపోయినచోఁ దిక్కన మొదటి మూఁడు పర్వములను దిగుగ వ్రాసియుండెడివాఁడు. నన్నయ తెనుఁగుభారతమున నే మార్గ మవలంబించెనో తిక్కనయు నదే మార్గ మవలంబించెను. నన్నయవలెనే తిక్కన "భారత గౌరవ మూహించి తెనుఁగున రచియింపఁబూని నా నేర్చినభంగి చెప్పి వరణీయుఁడ నయ్యెద"ననినాఁడు. ఇట్లు భారతరచన కుపక్రమించి ముగించి ఫలశ్రుతి పలుకుచు, తా నూహించిన భారతగౌరవము-అనఁగా వివిధార్థగతిస్ఫురణము-తన తెనుఁగు భారతమున సమగ్రముగా వచ్చిన దను నాత్మవిశ్వాసముతో

"వ్యాసమునీంద్రసార కరుణాతిశయంబున భారతార్థ ము
ద్భాసిత మైనయట్టి నుతభాగ్యనరుం డ సకలాగమార్థసం
వాసన మానవిల్లు జనపంక్తులు కీర్తనసేయ శశ్వదు
ల్లాససుఖానుభూతి నచలస్థితి నొప్పు నతం డుదాత్తుఁడై"

అని వ్రాసినాఁడు. భారతార్థముద్భాసితము కావలయును. అట్టివానిని జనపంక్తులు కీర్తనసేయును. తిక్కన తన కా స్థితి గల దను నమ్మకము కలవాఁడు. ఋషులుమాత్రమే యట్టి విశ్వాసము కలిగియుందురు. తిక్కనకూడ సంస్కృతభారతమును దెనుఁగున వ్రాయలేదు. తిక్కన మనస్సు సంస్కృతభారతముమీఁద లేదు. వ్యాసునిమీఁద నున్నది. సాత్యవతేయసంస్మృతి శ్రీ విభవాస్పద మైన చిత్తముతోఁ దెనుఁగు భారతము వ్రాసినాఁడు తిక్కన.

వ్యాసమునిప్రణీతభారతమునుఁగాక తదర్థమును వ్రాయుచున్నా నని నన్నయ చెప్పెను. వ్రాసినాఁ డని తిక్కన చెప్పెను. తానును

భారతార్థమునే వ్రాసినా నని తిక్కన చెప్పెను. వా రిరువురును జెప్పి నదియు వ్రాసినదియు నొకటియే యని యెఱ్ఱన "వ్యాసమునిప్రణీత పర మార్థము తెల్లగఁ జేసినట్టి యజ్ఞానసకల్పు"లని నన్నయతిక్కనలను గుఱించి నృసింహపురాణమునఁ జెప్పెను. తానుగూడ భారతమును వ్రాసెనుగదా ! మరి తన విషయము ? నన్నయతిక్కన లంతవిపుల ముగాఁ జెప్పుట కాయన కవకాశము లేదు. కనుక భారతారణ్యపర్వ శేషమును బూర్తిచేసి నన్నయభట్టమహాకవీంద్రు సరససారస్వతాంశ ప్రశస్తి తన్నుఁ జెందుటయు......తత్కవితారీతియుఁ గొంత దోపఁ దద్రచనయకా" వ్రాసినా నని చెప్పినాఁడు. ఎఱ్ఱనయు నన్నయతిక్క నలవలెనే వ్యాసమునిప్రణీతపరమార్థమునే వ్రాసెను. కవిత్రయము వారు కేవలము కవులు గాదు. విమర్శకులుగూడ. విమర్శకుఁడు నిజముగాఁ గవియైనచో మహాకవి యగును. కవిత్రయము వారు మహాకవులు. వా రేమి వ్రాసినారో యిప్పటికి స్పష్టపడియుండును. ఇఁక దాని నెట్లు వ్రాసిరో క్లుప్తముగాఁ జెప్పెదను.

నానారుచిరార్థసూక్తినిధి యైన నన్నయభట్టు లోకజ్ఞుఁడు. అనఁగా లోకమును దెలిసినవాఁ డని యర్థము. లోకమును దెలియుట యనఁగా లోకులను దెలియుట. స్థూలముగా లోకులలో నిరు తెఱఁగు లున్నవి. పండితులు. తదితరులు, తదితరు లందఱును బామరు లని యర్థము గాదు. పండితులు కానివా రనియే భావము. ఈ యిరు తెఱఁగులవారికిని దన గ్రంథ ముపాదేయము కావలయును. కావలయు నన్నచోఁ దా నట్లుగా వ్రాయవలయును. అప్పుడు జగద్ధితముగా వ్రాసిన ట్లగును. నన్నయ యట్లే వ్రాసెను. ఏ మార్గము ననుసరించి యట్లు వ్రాసెను ? ఒక మార్గము గాదు. రెండు మార్గములు. ప్రసన్న కథాకలితార్థయుక్తి యొకటి. అక్షరరమ్యత మఱొకటి. ఈ రెండును రెండువర్గములవారి కుపాదేయములు. మొదటిది సారమతు లైన

కవీంద్రులకు. కవి యన్న శబ్దమును బండితుఁ డన్న యర్థమున నన్నయ వాడెను. కవిశబ్దమున కర్థములు చాల యున్నవి. వారు లో నారసి చూచినచోఁ బ్రసన్నకథాకలితార్థ యుక్తి స్పష్టపడును. సూక్ష్మ పరిశీలన మన్నది పండితుఁ డైనవాఁడు చేయఁగలఁడు. అట్లు చేయఁ గలుగుటయే యాతఁడు పండితుఁ డగుటకు హేతువు. దేశమునఁ బండి తుల సంఖ్య తగ్గుకొలఁది నన్నయభారత మర్థ మగుటను దగ్గించు కొన్నది. పాశ్చాత్యసంపర్కము దీనికిఁ గొంత తోడుపడినది. పాశ్చా త్యులు హిందూమతమునకు బ్రాహ్మణమత మను పేరు ప్రచారము నకుఁ దెచ్చిరి. హిందూమతమునకు మూలభూతములు వేదము లగుట వలన దానికి వైదికమత మను పేరును బ్రబలినది. ఈ వైదిక బ్రాహ్మణశబ్దములు సూక్ష్మవిచారణము లేని పండితేతరులలోఁ గొంత యలజడిని - అభిప్రాయభేదములను గలిగించినవి. బ్రాహ్మణవర్గము వారు తమలోఁ గల యంతశ్శాఖలనుబట్టి కవిత్రయమువారికిని వీరై నంతవఱకు వాని నంటగట్టి నన్నయవైదికి యనియు, వానిది వైదిక మతధర్మరక్షణదృష్టి యనియు - ఆయనభారతము నట్లే వ్రాసె ననియు, తిక్కనది రసమయ మగు కావ్యకళాదృష్టి యనియు, ఎఱ్ఱన తిక్కన ననుసరించె ననియు వ్రాసిరి. ఈ యభిప్రాయములు ప్రచా రమునకు వచ్చుటతో భారతము మరింత యర్థమగుట మానుకొనినది. నన్నయభారతము సరిగా నర్థము కావలయు నన్నచో నాయన వాడిన శబ్దములయందలి యర్థమును లో నారయుచు యోజన చేయువల యును. ఆ యోజనచేయుటవలనఁ గథ ప్రసన్న మగును. అం దొక యెడ తెగనితనముతోఁ గూడిన రామణీయక మైన గాంభీర్య మవగత మగును. దాని నవగతము చేసికొనినవాఁడుగాని నన్నయ భారత విమర్శనమునకు యోగ్యుఁడు గాఁడు. నన్నయభారతరచనాశిల్పము లోని జీవలక్షణ మెఱుఁగక విమర్శింపరాదు. ప్రతికవి విషయ మంతే.

ఇఁకఁ దిక్కన. నిర్వచనోత్తరరామాయణమున నవతారికలోఁ దెనుఁగుకవిత్వమునుగూర్చి కొంత వ్రాసి తనను గూర్చి "అమలోదాత్త మనీష నే నుభయకావ్యప్రౌఢిఁ బాటించుశిల్పమునం బారగుఁడం గళావిదుఁడ"నని చెప్పికొనినాఁడు. ఉభయకావ్యప్రౌఢి యని వాడుటలోఁ దిక్కనహృదయ మేమై యుండునో మును ముందు తెలిసికొనవలయును. ఈయన కుభయకవిమిత్త్రుఁ డను బిరుద మున్నది. రామాయణ రచనాకాలము నాఁటి కది లేదు. ఈ యుభయకవిమిత్రనామము నకుఁ గేతన యుపపత్తిని జూపినాఁడు. దశకుమారచరిత్రలో—

"అభినుతుఁడు మనుమభూవిభు
సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా
నుభయకవిమిత్త్రనామము
త్రిభువనముల నెగడ మంత్రి తిక్కఁడు దాల్చెన్".

సంస్కృతాంధ్రములలోఁ జతురుఁడై తిక్కన యుభయకవులకుమిత్రుఁ డైనాఁడట. ఉభయకవు లనఁగా సంస్కృతాంధ్రకవులు. సంస్కృతాంధ్రములలోఁ జతురుఁ డనఁగా నారెంటిలోను గవిత్వము చెప్పుటయం దలి యర్థము. ఉభయకవిమిత్త్రుఁ డనగాఁ గేవలసంస్కృతకవులకుఁ గేవలాంధ్రకవులకుఁగూడ మిత్త్రుఁ డని యనఁగా దగ్గఱవాఁ డైనాఁ డని భావము. గంగాదేవి యనునామె (1343-79) తనభర్త దిగ్విజయములను వర్ణించుచు వ్రాసిన "మధురావిజయము" (వీరకంపరాయచరితము) నఁ దిక్కనను సంస్కృతకవిగా స్తుతించినది. సంస్కృతమునను దిక్కనకవిత్వము వ్రాసెడివాఁ డన్న కేతనవాక్యమును గంగాదేవి సమర్థించుచున్నది. ఇందువలనఁ దిక్కన సంస్కృతాంధ్రములందుఁ గవి యను నభిప్రాయము రూఢమైనది. ఉభయకవిమిత్త్రు నుపలెనే యుభయకావ్యప్రౌఢి యున్నది. పై దాని ననుసరించి కొందఱు సంస్కృతాంధ్రకావ్యముల ప్రౌఢిమను బాటించినా నని చెప్పుకొనినాఁ డనియుఁ గొందఱు మార్గదేశకావ్య

ప్రౌఢిమను మనసునఁ బెట్టుకొని యీమాట వ్రాసినాఁ డనియుఁ జెప్పు చున్నారు. ఉభయకావ్యప్రౌఢి బాటించుశిల్పమునఁ బారగుఁడ ననఁగా రెండుకావ్యములందును బ్రౌఢి నెరపుటకుగా నాదరించవలసిన శిల్పరహస్యము నెఱిఁగినవాఁడ నని యర్థము. కావ్యశబ్దమును మొదట వాడినది భరతుఁడు. ఆయన దశరూపాత్మకముగా నా శబ్దమును వాడెను. ధ్వనిసిద్ధాంతస్థాపనాచార్యుఁ డైన యానందవర్ధనుఁడే (850 A. D.) మొదటిసారిగా నీ రూపకరససిద్ధాంతమును శ్రవ్యకావ్యమునకు సమన్వయించినది. ధ్వన్యాలోకమునందలి కారికలకర్తృత్వవిషయ మటుంచి ధ్వనిసిద్ధాంతస్థాపకుఁ డానందవర్ధనుఁ డని చెప్పుచున్నాను. తరువాత వచ్చిన యభినవగుప్తులవారు (1000 A. D.) దానికి లోచనము రచించి యీ సిద్ధాంతమును బ్రచారము చేసిరి. అప్పటినుండి కావ్యములు రెండువిధము లైనవి. రూపకము లనియు, దృశ్యకావ్యము లనియు, మిగిలినవి శ్రవ్యకావ్యము లనియు. దృశ్యశ్రవ్యకావ్యముల కాత్మ యొకటియే యైనను రచనాశిల్పమున భేద మున్నది. దృశ్య కావ్యములలో సంభాషణపద్ధతి యుపాదేయము. అది యనివార్యము. శ్రవ్యకావ్యములలో నాఖ్యానపద్ధతి యుపాదేయము. ఈ రెండు పద్ధతులను మిశ్రమొనరించి శ్రవ్యకావ్యము చేయవచ్చునుగాని దృశ్యకావ్యము చేయరాదు. చేయఁబడదు. తిక్కనకాలమునకు (1220 - 1300) దృశ్యశ్రవ్యకావ్యము లన్న యీ భేదము విరివి యైనది. దృశ్యశ్రవ్యకావ్యమర్యాదల నుచితరీతిని సమ్మేళనము చేసి వ్రాసినకావ్యశోభ యినుమడించు నన్న తలంపు రామాయణరచనాకాలమునాఁటి కాయన కేర్పడియుండును. అట్లు రామాయణమును వ్రాసినందుననే కాఁబోలును దానిని మహాకావ్య మని పేర్కొనినాఁడు. దృశ్యశ్రవ్యకావ్యములను బ్రౌఢములుగా ననఁగా నుదాత్తములుగా రచించుటకుఁ గావలసిన శిల్పమునఁ దనకుఁ బారగత్వము కల దని చెప్పినట్లుగా మన పూ

రామాయణమునందలి 'అమలోదాత్తమనీష నేనుభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుఁడ' నన్న వాక్యము నన్వయించుకొన వచ్చును. ఈ యుభయకావ్యములమర్యాదలను రామాయణమున నే ప్రవేశపెట్టినాఁడు. అనఁ లది శ్రవ్యకావ్యము. అందు దృశ్యకావ్య శిల్పమును బ్రవేశపెట్టి యద్వితీయముగా నిర్వహించిన ఘట్టములలో సప్తమాశ్వాసము 109 పద్యమునుండి నవమాశ్వాసము 49 పద్యము వఱకుఁ గల సీతాపరిత్యాగవిషయఘట్టము.

కావ్యశిల్ప మనుపది తిక్కనయే వాడెను. కవిత్వముతో పాటు శిల్పమునుగూడ నాయన గ్రహించెను. కథాపిదుఁడ ననిగూడ నాయన చెప్పెను. అనఁగాఁ గావ్యకళ, శిల్పకళ రెండును నాయన కవగతములే. వ్యస్తశిల్పమునకును గావ్యశిల్పమునకు భేద మున్నది. వ్యస్తశిల్పమున నొక పదార్థముయొక్క యొకనిముసప్రుటచంచలస్థితి నే శిల్పి చిత్రింపఁగలఁడు. కావ్యశిల్పమున క్షణక్షణచాంచల్యమాన వివిధ దశావిశేషములను శబ్దచిత్ర సహాయమునఁ జిత్రించవచ్చును. శిల్పకళ కంటెఁ గావ్యకళ యీవిషయమున గొప్పది. దేనివలనఁ గావ్యమునకు గౌరవము హెచ్చునో తిక్కన యందుఁ బారగుఁడు. నిర్వచనోత్తర రామాయణరచనాకాలమునాఁటికే కావ్యశిల్పకళావిషయవిదుఁడై - పారగుఁడైనవాఁడు భారతరచనాకాలమునాఁటికిఁ బరిపక్వస్థితికి వచ్చి యుండు ననుటలో సందేహ ముండరాదు. కొందఱు నిర్వచనోత్తర రామాయణమునకే యది పట్టునుగాని భారతమునకుఁ బట్ట దనవచ్చును. అది యర్థము లేని మాట. కనుక భారతము నా దృష్టితోఁ బరిశీలించి విమర్శింపఁదలయును. తిక్కనవిషయమునఁ బండితు లంతగాఁ బొరఁబడి నట్లు కానరాదు. తిక్కనభారతమున నాటకరీతు లున్న వని సామాన్యముగా నందఱును జెప్పుచున్నారు.

ఇంక మిగిలినవాం డెట్లున. వీనిగూర్చి యీ నా యుపన్యాసమున విపులిగాం జెప్పుటకవకాశము లేదు. "నన్నయభట్టు తిక్కనకవి నాథులు చూపిన త్రోవ పావన" మనుకొనినాం డాయన. నన్నయ తిక్కనల యిద్దఱో యాలంకారికు లెట్లున్నన మన కర్థమగును. ప్రబంధ పరమేశ్వరునిగా నాయనను విపులిగా నర్థముచేసికొనవలయును. ఆయన శబ్దశాస్త్రవేత్తయుటు. నే నా విషయములను విస్తరింపను.

కవిత్రయము నా యీ విషయము నెట్లు వ్రాసినానో స్థూలముగాం జెప్పినాను. ఇంకం బనుంగుభారత మే జాతిగ్రంథమో చూడవలయును. నన్నయ భారతమును బురాణ మని, చరిత్ర యని, సంహిత యని, కథ యని ధర్మశాస్త్ర మని, వేదాంత మని, నీతిశాస్త్ర మని, మహాకావ్య మని, లక్ష్యసంగ్రహ మని, ఇతిహాస మని పేర్కొనినాండు. తిక్కన, ఇతిహాస మని, మహనీయేతిహాస మని, మహాకథ యని, వినుతేతిహాస మని, పంచమవేద మని, సంహిత యని, మహితేతిహాస మని, ఇతిహాసరత్న మని, అపసవ్యకథ యని, నిర్మలేతిహాస మని పేర్కొనినాండు. ఇ వన్నియుసంస్కృతభారతమున కన్వయించునవియే. పాశ్చాత్యవిమర్శకులును సంస్కృతభారతమును నితిహాసముగాం జేర్కొనుచున్నారు. ఇతిహాస మన్నది యొక జాతిగ్రంథము. ఈ జాతిగ్రంథములలో పెక్కు స్థూలమైన భేదము లున్నవి. నిర్మలేతిహాసములు కొన్ని. కావ్యేతిహాసములు కొన్ని. ఇతిహాసవిషయమును సంస్కృతాలంకారికు లంతగాం జర్చించినట్లు గానరాదు. కావ్యము - కావ్యశరీరము - కావ్యాత్మ - రసము లెన్నిష్టము - రసము లెన్ని - ఇత్యాదులనే యాలంకారికులు విపులిగాం జర్చించిరి. కావ్యభేదములను, జాతులను, గూర్చిన చర్చ బహుస్వల్పము. భోజుండు సరస్వతీకంఠాభరణమునం గావ్యభేదములను - కావ్యము, శాస్త్రము, ఇతిహాసము, కావ్యశాస్త్రము - కావ్యేతిహాసము, శాస్త్రేతిహాసము -

వాటింటిని జేర్కొనెను. ఆనందవర్ధనుఁడు "మహాభారతేఽపి శాస్త్రకావ్యరూపచ్ఛాయాన్వయిని" అని ధ్వన్యాలోకమున వ్రాసెను. శాస్త్రకావ్యమునకు క్షేమేంద్రుఁడు చతుర్వర్గప్రియమైన సర్వోపదేశక మని యర్థము చెప్పెను. ఇతిహాస మనఁగాఁ బూర్వరాజులకథలను జెప్పెనదను నభిప్రాయ మొకటి గాఢమై ప్రచారమున నున్నది. శాస్త్రమునందువలెఁ బురుషార్థనిరూపణమును, కావ్యమునందువలె రసనిరూపణమును గల గ్రంథము శాస్త్రకావ్య మని శిరోమణులు చెప్పుచున్నారు. ఇతిహాసస్వరూపస్వభావాదులచర్చానిర్ణయము - మనకంతగా లే సందునఁ బ్రపంచములోని యితరభాషేతిహాసములవిషయము కొంత పరిశీలించి మన కన్వయించుకొనవలెను గ్రహించుటలో దోషము లేదు.

పాశ్చాత్యులదృష్టిని నితిహాసములు స్థూలముగా రెండు రకములు. Authentic and Literary ఈ రెండింటిని మనసునఁ బెట్టుకొనియే యింతకుఁబూర్వము నిర్మలేతిహాసములు - కావ్యేతిహాసము లని చెప్పినది. ఈ రెండింటికిని నాంగ్లమున వానిలోని యొక్కొక్క గుణమున కొక పేరు చొప్పున నాలుగైదు పేర్లున్నవి. ఈ పేర్ల కేమిగాని యీరెండింటిజీవలక్షణమున భేద మున్నది. అథంటిక్కెపిక్కు వినుట కుద్దేశింపఁబడినది. లిటరరీఎపిక్కు చదువుకొనుట కుద్దేశింపబడినది. మొదటిదాని కెదుగుఁదన మొక గుణము. వ్రాయఁబడక ప్రచారమునకు వచ్చుట యందలివిశేషము. సంస్కృతభారత మీ మొదటిరకమునకుఁ జెందినది. అనఁగా నథంటిక్కెపిక్కు. నిర్మలేతిహాస మని నేను వాడుదును. వ్యాసుఁడు తాను (జయము) భారతమును దన శిష్యులకుఁ జెప్పి దేవ, పితృలోకములందును, గరుడగంధర్వయక్షరాక్షసలోకములను, నాగలోక, భూలోకములందును వినిపింపఁజేసెను. నారద, దేవల, శుక, సుమంత, వైశంపాయనుల వా వని కాయన నియోగించెను

వ్యాసుఁడు భారతమును వ్రాయలేదు. జనమేజయునకు వైశంపాయనుఁడు భారతమును జెప్పెను. మధ్యమధ్య జనమేజయునకుఁ గొన్ని సందేహములు వచ్చినవి. వానికి సమాధానములను వైశంపాయనుఁడు చెప్పెను. ఈయన చెప్పిన నా యీ విషయమువలన వ్యాసునిభారతము పెరిఁగినది. జనమేజయునకు వైశంపాయనుఁడు భారతమును జెప్పుచుండగా నుగ్రశ్రవసుఁడు వినినాఁడు. తదనంతరము నైమిశారణ్యమున శౌనకాదిమహామునులకు నాయన భారతమును దాను వినినదానిఁ జెప్పినాఁడు. శౌనకాదిమహర్షులకుఁ గలిగిన సందేహముల నతఁడు తీర్చుచుఁ జెప్పినాఁడు. ఆ చెప్పుటలో విస్తరించి చెప్పుట యున్నదున్నది. వైశంపాయనుఁడును వ్యాసుఁడు చెప్పినదానిని విస్తరించియే చెప్పెను. ఆంధ్రభారత మాదిపర్వమున వ్యాసభారతప్రచారవిషయ ముగ్రశ్రవసుఁడు చెప్పినట్లుగా నన్నయ వ్రాసిన [ప్రథమాశ్వాసము] (66) వచనమున వివిధలోకములకు నారదాదులను వఖ్యాణింపఁ బంపినట్లుగా నున్నది. నన్నయ వైకుసార్లను 'వఖ్యాణింప' ననియే వాడినాఁడు. వఖ్యాణించు శబ్దమునకు స్పష్టముగా వ్యాఖ్యానించుట యని యర్థము. మల్లినాథునివలె "నామూలం లిఖ్యతే కించి న్నానపేక్షిత ముచ్యతే" అని యెంత ప్రతిన బూనినను, అవాంతరవిషయవివరణములు వ్యాఖ్యానమున ననివార్యములు. అందులో నారదాదులు విన్నదానిని వ్యాఖ్యానించవలసినవారైరి. అపు డధికముగా వారు వివరించవలసినయవసర మేర్పడును. వారి వివరణ మంతయు భారతముగా రూపుగట్టుకొనినది. భారతకథ వినిన శౌనకాదిమహామునులు హరివంశము చెప్పవలసినదిగాఁ గోరుచు నుగ్రశ్రవసునితో "వ్యాసప్రోక్తము భారతాగమము నీ వత్యంతహృద్యోక్తివిన్యాసం బొప్పఁగ విస్తరింపఁగఁ గడుఁ హర్షించితి మేమెల్ల" అని 'ఆ యదువృష్ణిరమణాన్వయోత్తములజన్మచరిత్ర ప్రపంచంబు సమస్తంబును విస్తరప్రశస్తంబుగా నుపన్యసింపవలయు' నని

వారిఁ గోరిన ట్లట్టిన వ్రాసినాఁడు. భారతము విస్తరింపఁబడినట్లు విన్నవారికే తెలిసినది. కనుక సంస్కృతభారతము వ్యాస వైశంపాయనోగ్రశ్రవసప్రోక్త వివిధవిషయసంకలిత మన్న మాట. నారదుఁడు మొదలుకొని యుగ్రశ్రవసునివఱకు గల వ్యాసశిష్యగణము చేసిన పనినిబట్టి సంస్కృతభారతము వినుట కుద్దేశింపఁబడిన దన్న విషయము స్పష్టము. ఆంధ్రభారత ముభయభాషాకావ్యరచనాభిశోభితులై, మహాకవిత్వదీక్షానిధిఁ బొందిన వారిచేత, గా నారసి యాంధ్రావళి మోదముం బొరసి మే లనునట్లుగా వ్రాయఁబడినది. అనఁగా నిశితముగాఁ బరిశీలించుచుఁ బఠించినఁగాని తెనుఁగుభారతమునందలి రామణీయక మవగతము గా దనుట. నన్నయ రాజరాజునకును, తిక్కన హరిహరనాథునకును వినిపించుచున్నట్లు స్థూలదృష్టికిఁ గనిపించినను-పఠించి యానందింపవలసిన యవసరము మున్నట్లును - అందుకే దాని నుద్దేశించినట్లును - వారియవతారికలు - గ్రంథములు స్పష్టము చేయుచున్నవి.

నిర్మలేతిహాసమునకును - కావ్యేతిహాసమునకును ముఖ్యమైన భేదము వానిరచనావిధానమునఁ గల ప్రత్యేకమైన పద్ధతులలో నున్నది. విషయవిపులీకరణముతోఁ గూడిన యాశుకవనపుఁ బద్ధతి మొదటిదానిలో నుండును. నిబిడమైన రచనావిధానము రెండవదానిలో నుండును. శ్రోతలకన్నఁ బాఠకులు నిశితమైన దృష్టి గలవారు. శ్రోతలకు వక్త చెప్పు వర్తమానవిషయముమీఁదనే దృష్టి యుండునుగాని చెప్పి విడచినదానిమీఁద నుండదు. ఉండఁగాదు. అట్లున్నచోఁ జెప్పుచున్నది యాతఁడు వినుటపడదు. శ్రోతలు తమ కెచట క్లిష్టముగా నుండి యవగతము గాదో వెంటనే వివరణము కోరుదురు. వక్త చెప్పును. అప్పుడు శాఖాచంక్రమణము జరుగును. తరువాత నసలువిషయమునకు వచ్చును. పాఠకునివిషయము వేఱు. ఎంత వ్రాయఁబడియున్నదో యంతే గల దతనికి. వెనుకముందు లాలో

చించుకొనుచు నతఁడు చదువుకొనును. పూర్వాపరములకుఁ గల సంబంధములను - ఉచితానుచితములను. విచారించుకొనుచుఁ జదువుకొనును. కావ్యేతిహాస మట్లుచదువుకొనుటకై వ్రాయఁబడినది. అట్లు వ్రాయఁబడినదిగనుకనే నిబిడమైన బంధము గలదైనది. నిర్మలేతిహాసమునఁ బ్రధానేతివృత్తము మధ్యలో నాఁపి యవాంతరవిషయవివరణమును జరుపుట గలదు. ఇట్టివానిలో నుదంకునిగురుపరంపరాభివర్ణనము, దుస్సలాజననము, దుర్గాస్తవము, సనత్సుజాతీయము, భగవద్గీతలు ముఖ్యములు. ఇవి ప్రధానకథ కెంతవఱకు సంబంధించిన వన్న ప్రశ్న శ్రోతలకు రాదు. ఎక్కడి కక్కడ మెచ్చుకొనుటయే - ఆనందించుటయే శ్రోతలు చేయఁగలరు. పాఠకు లట్లు గాదు. ఈ వర్ణన మింత దీర్ఘముగాఁ జేయుట ప్రధానకథ కవసరమా ? ఈ ధర్మపన్నము లిచట యుచితములా ? అని ప్రశ్నించుకొని తా మొక నిర్ణయమునకు వత్తురు. కనుక కావ్యేతిహాసమునందలి రచనావిధానమునకును, నిర్మలేతిహాసమునందలి రచనావిధానమునకును జాల భేద ముండును. రెండురకములయితిహాసములును మన కుపాదేయములే. కేవలము కథాకథనదక్షత నిర్మలేతిహాసమునకుఁ జాలును. శిల్పముతో నిమిత్తము లేదు. శబ్దములను దూఁచి వాడుట యన్నది కావ్యేతిహాసమున నుండును. తాను జెప్పఁదలఁచుకొనినది స్పష్టముగాఁ జెప్పుటయే నిర్మలేతిహాసకర్తపని. చెప్పఁదగినదానిని జూచి చెప్పుట కావ్యేతిహాస కర్తపని. దేశీయమైన మతముతోఁగాని, రాజకీయ, నైతికపరిస్థితులతోఁగాని సంబంధము లేకుండ యితిహాసము లుండవు. ఆ యా విషయములు నిర్మలేతిహాసమున విరివిగాఁ బెంచఁబడును. కావ్యేతిహాసమునఁ బ్రధానకథ దా నంతట నది యూఁగినపు డా యా మత, రాజకీయ, నైతికధర్మము లుచితరీతిని జెప్పఁబడును. అనేకవిషయము లనేకమందిచేత భారతమునఁ జేర్పఁబడినవి. అది నిర్మలేతిహాసము గనుక

నెన్ని చేరినను దానికి సేగి లేదు. కావ్యేతిహాసము కర్తచేత నెంత వ్రాయఁబడునో యంతే. ఎవరును, ఏమియుఁ జేర్చుటకు వీలు లేదు. ఇతివృత్తగ్రంథమునను, సన్నివేశకల్పనమునను, రచనావిధానమునను, నిర్మలకావ్యేతిహాసములకు భేద మున్నది. ఇన్నివిధముల భేదించు గ్రంథములను బోల్చి చూచి విమర్శించుట రెండు గ్రంథముల పట్లను చేయఁగూడని యపరాధము చేయుటయే. సంస్కృతాంధ్రభారత ములు రెండును రెండు రకముల గ్రంథములు. వాని జీవలక్షణమున భేద మున్నది. కొంత సూచించితిని. అన లితిహాసస్వరూపస్వభావాదు లను గూర్చి వేఱుగా వ్రాయవలయు నని యున్నది. ఎప్పుడో వ్రాసెదను.

ఈ జాతిభేదము నటుంచినను సంస్కృతాంధ్రభారతములను బోల్చి చూచి విమర్శించుట కవకాశము కనిపించదు. ఫలానా సంస్కృతభారతప్రతి పరిశుద్ధ మగు మూలపాఠములతోఁ గూడిన దన్న నిష్కర్ష లేదు. ఉంచుటకు వీలు లేదు. కవిత్రయము వారే యే ప్రతు లను జూచినారో నిశ్చయించుట కవకాశము లేదు. లభించిన సంస్కృత ప్రతులలో నుత్తరదక్షిణదేశములవానికిఁ బాఠభేదము లున్నవి. అన్ని దక్షిణదేశప్రతులును, అన్ని యుత్తరదేశప్రతులును నొక విధముగా లేవు. భారతముమీఁద నున్న వ్యాఖ్యానము లీ విషయమును స్పష్టము చేయును. సర్వజ్ఞనారాయణుఁడుగాని, అర్జునమిశ్రుఁడుగాని విరాట పర్వమునందలి దుర్గాస్తవమును వ్యాఖ్యానించలేదు. వారికాలమునకు భారతమున నా స్తవము చేరలేదు. లేక నా స్తవము లేనిప్రతులే వారిరువురుఁ జూచియుండవలయును. విరాటపర్వమునఁ గీచకుఁడు మునుముందు ద్రౌపదితోఁ మాటాడిన ట్లున్న శ్లోకములకు వ్యాఖ్యాన మర్జునమిశ్రుఁడు, నీలకంఠుఁడు వ్రాసిరిగాని సర్వజ్ఞ నారాయణుఁడు వ్రాయలేదు. అతఁడు 14 వ శతాబ్దమువాఁడు. అటుతరువాత నవి

భారతమునఁ జేరియుండును. ఇట్టి ప్రక్షిప్తాంశములు సంస్కృతభారతమునఁ జాల గలవు తిక్కనభారతరచన మైనతరువాతికాలమునఁగూడఁ గొంత సంస్కృతభారతములకుఁ జేరిన దని కొందఱు పండితు లభిప్రాయ పడుచున్నారు. దేశములోని సంస్కృత భారతప్రతుల నన్నిటిని సేకరించి యుచితపాఠములను నిర్ణయించి యొక భారతమును దయారు చేయవలయు నని భండార్కరు ప్రాచ్యపరిశోధనాలయము కృషిచేయు చున్నది. విరాటోద్యోగములువచ్చిన ట్లున్నవి. ఆ పాఠములనిర్ణయమున నెన్ని చిక్కులు గలవో కీ. శే. Dr. V. S. సుక్తాంకరుగారి యుపోద్ఘాతము స్పష్టము చేసినది. ఇంత శ్రమచేసి చేసినను సంస్కృత భారతమునుగూర్చి The History and Culture of The Indian People vol. 2 "The Conclusion drawn from the huge Conglomeration of matter of the moss diverse type, viz. that the text of the Present epic has unity of authorship or of time, is further strengthened by Considerations of style, language and metre. All these show a curious mixture of earlier and later characteristics." Page. 251 అని వ్రాసినది. సంస్కృతభారతమును గూర్పులు చేర్పులును నధికము. అందు వ్యాసునివ్యక్తిత్వ మెంత యున్నదో వైశంపాయనోగ్రశ్రవసులవ్యక్తిత్వము లెంత యున్నవో తెలియదు. ఆంధ్రభారతమును గవిత్రయమువారు కావలయు నని తీర్చి దిద్దిరి. వ్యాసమునిప్రతిపాదితపరమార్థమును దమ వైన కావ్యశిల్పమార్గముల ననుసరించి దెనుఁగునఁ గవిత్రయమువారు వ్రాసియుండుటచేతను, సరియైన సంస్కృతభారతప్రతి లేకపోవుటను, దొరకిన సంస్కృతప్రతిని గ్రహించి దానితో నాంధ్రభారతమును బోల్చి విమర్శింపరాదు. దాని వలనఁ బ్రయోజనము లేదు. ఆదిపర్వమున జనమేజయుని సర్పయాగ మొనరించుటకుఁ బ్రోత్సహించుసందర్భమున నేను చూచినసంస్కృత ప్రతిలో, ఆంధ్రభారతమునఁ గల "ఏకవిప్రసంబోధనచేసి" "అనేక భూసురాపాదితసర్పయాగము" మొదలైనవి లేవు. జనమేజయునివద్ద

కన్నీకుఁడు వేదవేదాంగపారగు లయిన బ్రాహ్మణులతోఁ గూడి పోయిన ట్లాంధ్రభారతమున నున్నది. సంస్కృతమున లేదు. ఇట్లు కొన్ని లక్షులు చెప్పవచ్చును. ప్రయోజన మే మున్నది? దీనివలనఁ గవిత్రయమువారి గ్రంథగత విశేషము స్పష్టపడుచున్నదా? లేక సంస్కృతభారతగౌరవ మెట్టిపడుచున్నదా? ఏమియు లేదు. ఇం కొక యడుగు ముందుకు వేసి కవిత్రయమువారు మూలాతిక్రమణము చేసినారు. చేసి స్వతంత్రించినారు—అని చెప్పినను విమర్శనము కాదు. అ ట్లెంతకాలము చెప్పుకొనుట ప్రచారమున నుండునో తెనుఁగుభారత మంతకాల మట్లే యర్థము గాక యుండును. సంస్కృతభారతముతోఁ బోల్చకుండ కవిత్రయమువారిభారతమునుగూర్చి ప్రసంగించినచోఁ, దమకు సంస్కృతము రా దని యెనుటివా రెక్కడను గొనిపోదురో యను భయము చాలమందికి నున్నది. అట్లనుకొనుటయు, ననుటయుఁ జాలమంది నేఁటి సంస్కృతపండితుల మనుకొనువారిలో నున్నది. అను కొనుటమాత్రమే మిగిలి నిజ మైన పాండిత్యము క్షీణించిపోవు కాల మిది. ఎవ రే మనుకొనినను సంస్కృతభారతముతోఁ బోలిక తీసికొని రాకుండఁ దెనుఁగుభారతమును విమర్శించినపుడే దానివిశ్వరూపము లోచనగోచర మగును.

వ్యాసమునిప్రణీతపరమార్థమును దెనుఁగుభారతమున దర్శింపఁ దలఁచినవారు మునుముందు సంస్కృతాభారతము నంతయుఁ జదివి యం దున్న పరమార్థమును దాము దర్శించి తెనుఁగుభారతమును దెనుఁగుభారతముగాఁ జదివి దీనిపరమార్థమును దర్శించి యవు డా రెంటికిని గల తారతమ్యమును జెప్పుటకు యత్నింపవలయునుగాని యెక్కడి కక్కడ సంస్కృతాంధ్రభారతములను బోల్చుచు చదువుట వలన రెండును సమగ్రముగా నర్థముగావు. దానివలన సాధించు ప్రయోజనమును స్వల్పము. సంస్కృతాంధ్రభారతములు రెండును

రెండుజాతులగ్రంథము లగుటవలన నా రెండింటిని విడివిడిగాఁ జదివి నపుడే వానియథార్థస్థితి బోధపడును. నిర్మలేతిహాసమున కేది యుచితమో సంస్కృతభారతమున నది యున్నది. ఏయే గుణములకలిమిని గావ్యేతిహాస మువ్యాపిత మగునో తెనుఁగుభారతమున నా యా గుణము లున్నవి. ఈ రెండు గ్రంథములందలి జీవలక్షణమును నొకటి గాదు. ఆ యా జీవలక్షణములనుబట్టి ఆ యా గ్రంథములు విమర్శింపఁ బడవలయును. సంస్కృతభారతనిరపేక్షముగా నాంధ్రభారతమును విమర్శించుట యుచిత మనియు-అవసర మనియు మనవి.

ఆంధ్రభారతవిమర్శనమున కవతారికా మాత్రముగా నా చెప్పిన యీ విషయములు పండితుల కవధానార్హము లైనచో ధన్యుఁడను. సదస్యులకు నమోవాకములు—

# కావ్య పరమార్థము

రచయిత:- శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి

మన మండలిమును సాహిత్యసేవకులము. సాహిత్యసేవకుఁ డనఁగా సాహిత్యమును ప్రచారము సేయువాఁడు. సాహిత్యమును గుఱించి ప్రచారమును జేయవలయు నన్న దానిని గుఱించి కొంత తెలియవలయును గదా! కాఁబట్టి మనము సాహిత్యవేత్తలము కనీస మట్లనుకొనుచున్నాము. కొందఱిచేత ననుకొనఁబడుచున్నాము. కాని నిజముగా మనలో సాహిత్య మన్న హృదయపరిపూర్ణముగ నెంత మందికిఁ దెలియును? మన కెంతవఱకుఁ దెలియు నని హృదయముపైఁ జేయివైచుకొని యాలోచించినవా రెంతమంది మనలో నున్నారు?

మఱియును నీ సాహిత్యమునుగుఱించి మనలో నొక్కొక్కరికి నొక్కొక్క యభిప్రాయ మున్నది. ఒక యభిప్రాయమునకును మఱి యొక యభిప్రాయమునకును బొంతన లేదు. ఒకరియభిప్రాయములో మెత్తనిపదములకూర్పు కవిత్వము. ఒకరియభిప్రాయములో ధారాశుద్ధి కవిత్వము. ఒకరియభిప్రాయములో సమానబంధురతి, వ్యాకరణపాండితీ ప్రకర్ష కవిత్వము. ఒకరియభిప్రాయములోఁ గవిత్వ మందఱకుఁ దెలియ వలయును. ఒకరియభిప్రాయములోఁ బద్యములు వ్రాసినఁ గవిత్వమే కాదు. వచనపద్యము లని క్రొత్తగా వచ్చినవి. అవి వ్రాయవలయును. కొందఱికి గ్రాంథికభాష వ్రాసిన గొప్ప కవిత్వము. కొందఱికి వ్యావహారిక భాషలోనే వ్రాయవలయును. ఇది యంతయుఁ గవితాభాషను గుఱించిన భేదము. ఇట్లే వస్తువునుగుఱించికూడ ననంతమైన భేద మున్నది. కొందఱకుఁ బురాణకథ లన్నఁ గిట్టవు. క్రొత్త కథలను సృష్టించవలయును. ఆ కథలుగూడ నేదేనొక రాజకీయాభిప్రాయమును సంఘసంస్కరణాభిప్రాయమును వ్యక్తము సేయుచుండవలయును. ఈ

కథానిర్మాణమునందుఁగూడఁ జాల యభిప్రాయభేదము లున్నవి. కథకుఁ దీసికొనవలసిన నాయకునిగుఱించి పాత్రపోషణమునుగుఱించి సంభాషణమునుగుఱించి యౌచిత్యమునుగుఱించి యనంతముగా విమర్శలు జరుగుచునేయున్నవి. ఇట్లు సాహిత్యముయొక్క బహిరాకారమునందలి యెదేనొక గుణమును బట్టికొని యది యున్నచో సాహిత్యమైనట్లు, తక్కిన దంతయుఁ గానట్లు పరస్పరనిందాసహిత మైన స్వాభిప్రాయ ప్రచారమును గావించుచు నిది యంతయు సాహిత్యసేవక్రింద జమకట్టుకొనుచున్నవారు మనలో నెంతమంది లేరు ? ఇదియంతయు నచ్చమైన సాహిత్యసేవ యగునా యని మనము ప్రశ్నించుకొనవలసి యున్నది.

ఈ పై యభిప్రాయములలో దేనినిగాని నేను గాదనుటలేదు. నేను జెప్పఁదలఁచుకొన్నది సాహిత్యవేత్తకుఁగాని కవికిఁగాని యుండవలసిన యాంతరపరిణతినిగుఱించి యట్టి పరిణతికిసంబంధించిన మహాకవి సంప్రదాయమునుగుఱించి. సాహిత్యమునం దన్నిటికంటె మిక్కిలి ముఖ్యమైన వీ రెండు విషయములు.

ఈ యాంతరపరిణతియొక్క స్వరూప మేమి ? ఇది కావ్యమార్గమున నెట్లు సాధిత మగును ? సాధారణముగాఁ బ్రతిజీవికిని సుఖసంపాదనమునందు, దుఃఖనిరాసమునందు సహజేచ్ఛ యున్నది. ప్రతిజీవియుఁ దా నేదో బంధింపఁబడి యుంటి ననియు నీ బంధములనుండి ముక్తి పొందవలయు ననియు సహజముగాఁ గోరుచుండును. ఈ సహజేచ్ఛయే యార్తి. ఈ యార్తి యొకనిలో నుత్కటముగా నుండును. ఒకనిలో మందముగా నుండును. మొత్తముమీఁదఁ బ్రతిప్రాణికిని నిది సహజముగా నున్నది. ఈ సుఖముయొక్క స్వరూప మేమి ? ఈ ముక్తియొక్క స్వరూప మేమి ? ఇది శాంతి. ఇదియే కవియొక్క యాంతరపరిణతి. ఇది కవి తనలో నుత్కటముగా నున్న యార్తివలనఁ బొందగల్గు

చున్నాఁడు. ఈ యార్తియే పరిణతమై శాంతియందుఁ బర్యవసించు చున్నదిగావున నిది కవి కుండవలసిన గుణములలో మిక్కిలి ముఖ్యమైనది. ఈ యార్తి యిప్పుడు రెండు విధములు. మొదటిది యాకూతి. రెండవది యనుభూతి. కవి యనుసరించు మార్గముయొక్క భేదమును బట్టి యీ యార్తియొక్క భేదముగూడ నుండును. కావున దీనిని రసాకూతి, రసానుభూతి యని వ్యవహరింతము. అనగాఁ గవి కుండు నార్తి రసవిషయక మైనది. రసముగాఁ బరిణమించునది యన్నమాట.

ఇట్లు రెండువిధము లైన యార్తియొక్క స్వరూపమును వివరించుటకు ముందిది యే కావ్యమునందుఁ బ్రధాన మని నిరూపింపవలయును. ఇది రెండు విధములు చేయవచ్చును. ఒకటి యా యా శబ్దములయొక్క యర్థమును విచారించుటవలన, రెండు ప్రామాణికు లైన వారి సాక్ష్యమువలన. మొదటఁ గవిశబ్దమును దీసికొని విచారింతము-కవయతే వర్ణయతీతి కవిః-అనఁగా వర్ణించువాఁడు కవి. వర్ణన మను క్రియ సకర్మకము- ఇచ్చట నా కర్మ చెప్పఁబడలేదు. ఎచ్చటఁ గర్మ చెప్పఁబడలేదో యచట నౌచిత్యమునలన దానిని సంపాదించుకొనవలయును. ఇచ్చట నౌచిత్యమువలన ననుభూతి యనునది కర్మగా స్వీకరింపవలయును. ఔచిత్య మే మనఁగా- మొదటగాఁ గర్మస్థానమున నొకదానిని బ్రత్యేకముగాఁ జెప్పలేదుగాన దేనినైనను వర్ణించువాఁడు కవి యని చెప్పుట న్యాయము. ఏదేనొకదానిని గవి యేల వర్ణించవలయును ? అందఱు చూచిన వస్తువునే కవియుఁ జూచుచున్నాఁడు. దానిని బదిమందికి వేఱుగా వర్ణించి చెప్పనేల ? అట్లు చెప్పుచున్నాఁడుగాన నీ పదిమందికంటె నతఁడు వేఱుగా దానిని జూచె నన్న మాట. ఈ పదిమంది చూచుట లౌకికానుభూతి. దీనికంటె నతనిచూపు వేఱైనదిగావున నది యలౌకికానుభూతి. కావున నిట్టి యలౌకికానుభూతి వర్ణనము కవిత్వ మనుట యుచితము. లౌకిక మనఁగా స్వపరసంబంధ

సహితే మైనది. అలౌకిక మనఁగా నిట్టి సంబంధములు విగళిత మైనది. స్వపరసంబంధశూన్యముగా లోకమును జూడఁగల శక్తి కవి కున్నది. ఇట్లు చూచుటయే సాధారణీకృతి యని యలంకార గ్రంథములందుఁ జేర్కొనఁబడ్డది. ఈ శక్తి కవి కె ట్లబ్బినది? పైనఁ జెప్పిన రసాకూతి రూప మైన యార్తివలన. కావున నిదియే ప్రధాన మని తేలుచున్నది. రెండవది సాహిత్యశబ్దము. సాహిత్య మనఁగాఁ గలయిక. ఇచటఁగూడఁ గర్మ చెప్పఁబడలేదు. కావున నౌచిత్యమువలన శబ్దార్థములకలయిక యని చెప్పికొనవలయును. ఔచిత్యము శబ్దరూప మైనదానినే మనము సాహిత్య మని పిలుచుట. శబ్దార్థముల కీ సాహిత్యము దేనివలన సంపాదిత మగును? పూర్వము చెప్పిన యలౌకికానుభూతివలన. ఎట్లనఁగా మనము సాహిత్య మన్నప్పుడే దాని నొక ప్రత్యేక మైన శబ్దజాలమునుగుఱించి వాడుచున్నాము. ఆ ప్రత్యేక మైన శబ్దజాలము కావ్యము. సాహిత్య మనఁగా శబ్దార్థములకలయిక కావున నట్టి కలయిక యొక్క కావ్యభాషయందే సంభవ మగుచున్నది. తక్కిన భాషయందీ సాహిత్యము లేదు. కారణము తక్కిన భాష లౌకికానుభూతిని జెప్పుచున్నది. గానకావ్యభాష యొక విశిష్ట మైన యనుభూతిని జెప్పిననేకాని లౌకికభాషకంటె వేఱు గాదు. ఆ విశిష్టానుభూతియే రసము. కావున రసమయ మయినదియే సాహిత్య మని తేలుచున్నది. కవియొక్క పరిణత మైన యార్తియే యీ రసము. ఇట్లు కవిశబ్దసాహిత్యశబ్దములను దీసికొని విచారించగాఁ గావ్యమునందు రసాకూతి రసానుభూతిరూప మైన యార్తి ప్రధాన మని మనకుఁ దెలియుచున్నది.

ఈ విషయమున వాల్మీకిప్రభృతులవాక్యములుగూడ మనకు నిట్టి యర్థమునే బోధించుచున్నవి. వాల్మీకి "పాదబద్ధః అక్షరసమః తంత్రీలయసమన్వితః శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా" యనియును, కాళిదాసు "త చ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం।

భావస్థిరాణి జననాంతరసౌహృదాని" యనియును చెప్పియున్నారు. నన్నయభట్టారకుఁడుగూడ "సాధ్యో హి రసో యథాతథం కవిభిః" యని చెప్పెను. క్రౌంచద్వంద్వవియోగమును జూచి వాల్మీకి శోకమును బొందెను. ఈ శోక మెవరిది? ఇది క్రౌంచములది గాదు. వాల్మీకిది గాదు. క్రౌంచములు కారణముగా వాల్మీకి పొందినదియుఁ గాదు. క్రౌంచములశోక మన్నచో నది వాల్మీకి యెట్లు పొందును? కావునఁ గ్రౌంచములశోకము గాదు. మఱి వాల్మీకిశోక మన వాల్మీకి ముని గావున నాయనకు శోక ముండఁజాలదు. అతఁడు మునిగావుననే లేని శోకమునకుఁ గ్రౌంచములు కారణ మెట్లగును? కావున నీ శోక మెవరిదియుఁ గాదు. సాధారణశోకము. సంబంధరహితమైన శోక మని చెప్పవలయును. దీనిచేత వాల్మీకి యార్తుఁ డైనాఁడు. ఇక్కడ నార్తి శబ్దమునకు రసరూపముగాఁ బరిణమించిన యార్తి యని చెప్పికొనవలయును. ఎందుచేత ననఁగా రసాకూతిరూప మైన యార్తి సహజమే కాఁబట్టి. ఇచ్చట నార్తి శోకముచేతఁ గలిగినది గాబట్టి. ఈ శోకము సాధారణరూపము గాఁబట్టి. ఇదే విషయమును గాళిదాసు "త చ్చేతసా స్మరతి" త్యాదిరూపమున వివరించెను. ఈ లక్షణముపై వాల్మీకి యనుభూతికి సరిపోవునో లేదో విచారింతము. వాల్మీకి క్రౌంచద్వంద్వమును జూచెను. చూచి శోకముపొందెనుగదా! ఈశోకము వాల్మీకిచిత్తమునం దున్నయొకానొక సంస్కారము-దానినిబూర్వాపరసంబంధశూన్యముగా వాల్మీకి చిత్తమునందు స్మరించినాఁడు. ఈ స్మరణమే వాల్మీకి పొందిన యార్తి. ఇచట స్మరణమునకుఁ జిత్తము తన్మయ మగుట యని యర్థము. అనఁగాఁ జిత్త మానందమయ మగుట యన్నమాట. ఎందుచేత ననఁగా స్మరణ మెప్పుడును బూర్వానుభవము నపేక్షించును. ఇచ్చటిస్మరణముపూర్వానుభవానపేక్షము."అబోధపూర్వం"అన్నాఁడు గాన. అందుచేత నీస్మరణశబ్దమునకుఁ జిత్తవృత్త్యనుభవ మని చెప్ప

కొనవలయును. చిత్తవృత్త్యనుభవ మనఁగాఁ జిత్తవృత్తు లాత్మరూపము నందుట. లేక యాత్మప్రకాశముచేఁ బ్రకాశితములగుట యని యర్థము. వాల్మీకి "శోకార్తస్య" యన్నమాట కర్థ మిదియే. వాల్మీకి పొందిన శోక మాత్మ ప్రకాశముచేఁ బ్రకాశిత మైనదిగావుననే యది శ్లోకముగ వ్యక్త మయ్యెను. "నిషాదవిద్ధాండజదర్శనోత్థః శ్లోకత్వ మాపద్యత యస్య శోకః" అని కాళిదాసు చెప్పెను. "సాధ్యో హి రసో యథాతథం కవిభిః" అన్న నన్నయగారిమాటనుగూడ నిదే దృష్టితో నర్థము చేసికొనవలెను. జ్ఞానులకువలెనే కవులకుఁగూడ రసము సాధ్యముగదా అని దీనియర్థము. హి శబ్దమువలన నీ విషయమున వివాదము లేదనియు యథాతథం అనుటవలన శాంతరసమే ప్రధాన మనియుఁ దాత్పర్యము. పై వాల్మీక్యాదిమహాకవుల సాక్ష్యమువలనఁగూడఁ గావ్యము నందుఁ బ్రధాన మైనది యార్తిస్వరూప మగు రస మనియే విశద మైనది.

ఈ యార్తి యచ్ఛ మైన కవిలో నిరంతరము జ్వలించుచుండును. ఈ జ్వాలలయందుఁ గ్రాచఁబడి కవిమనస్సు మాలిన్యరహిత మై తళతళలాడుచుండును. కావునఁ గవిత్వ మొక తపస్సు. ఒక యోగము. రసాకూతిరూప మైన యార్తి యీ యోగమార్గమున నాత్మ రూపతఁ బొందుటయే కావ్యమై వెలయుచున్నది. ఈ యర్థమునే కాళిదాసు "కృత్వా తాసా మభిగమ మపాం సౌమ్యసారస్వతీనాం అంతశ్శుద్ధ స్త్వ మసి భవితా వర్ణమాత్రేణ కృష్ణః" అనుటలో ధ్వనించెను. సారస్వతసేవ వలన నంతశ్శుద్ధి కల్గును. "అనవరతకావ్యానుశీలనాభ్యాసవశాత్ విశదీభూతే మనోముకురే వర్ణనీయ తన్మయీభవనయోగ్యతా యేషాం తే సహృదయాః" అని గుప్తపాదుని సహృదయ లక్షణము. ఈ లక్షణము "అంతశ్శుద్ధస్త్వ మసి భవితా" యన్నదానితోఁ జక్కగా సన్వయించుచున్నది. అనవరత కావ్యానుశీలనమువలన మనసు స్వచ్ఛమగును. అట్టి స్వచ్ఛ మైన మనసునందే వర్ణనీయము విషయముగా గల

తన్మయీభవనము గలుగును. ఇచట యనుశీలనము, తన్మయీభవనమను మాటలను జాగ్రత్తగా విచారించుకొనవలయును. అనుశీలన మనఁగా ననుసరించి సమాధిపొందుట. 'శీల సమాధౌ' అని ధాత్వర్థము. కవి యే మార్గము వెంటఁ జిత్తసమాధి సంపాదించెనో యామార్గము కావ్యము. ఆ మార్గము ననుసరించి సహృదయుఁడుగూడఁ జిత్తసమాధి సంపాదించవలయును. ఇట్లు నిరంతరసమాధిమగ్న మగు చిత్తము నిరంతరాత్మసాన్నిధ్యమువలనఁ బరిశుద్ధ మగును. చిత్తము సమాధి పొందినప్పు డాత్మకు నావరకముగా నున్న యజ్ఞానము ధ్వంస మయి యాత్మప్రకాశము చిత్తమునందు వెల్లివిరియును. ఆ చిత్తమునందు వర్ణనీయ ముద్బుద్ధమైనది. ఇచట వర్ణనీయ మనఁగాఁ బూర్వము చెప్పిన చిత్తసంస్కారము. రత్యాదిరూపము. ఈ రత్యాదిచిత్తసంస్కార మాత్మప్రకాశప్రకాశిత మై యాత్మరూపత నందుచున్నది. ఇట్లాత్మరూపత నందు రత్యాదిసంస్కారమే రసము. కావునఁ దన్మయీభవన మను మాటకు భావ మాత్మతాదాత్మ్యము నందుట యని యర్థము. సహృదయుఁ డనఁగాఁ గావ్యమార్గము వెంట నిట్టి యాత్మతాదాత్మ్యము నందువాఁడు. ఇందుచేతనే గుప్తపాదుఁడు 'సరస్వత్యా స్తత్త్వం కవిసహృదయాఖ్యం విజయతే' అన్నాఁడు. కవికిని సహృదయునకును నే యనుభూతి యైనను నింత హృదయప్రమాణముగ నింత యాత్మరూపముగ నుండును. అందుచేత నిద్దఱును వేఱు గాదు. "కః పున రనయో ర్భేదః యత్కవి ర్భావయతి భావక శ్చ కవిః" అని రాజశేఖరునిమాట కావున సచ్చమైన కవికి రసాకూతిరూపమున నున్న యీ ర్తి రసానుభూతిరూపమునఁ బరిణమించును. సహృదయునకుఁ గూడ నట్టి పరిణామమే కల్గును. కావున నిద్దఱికిని భేదము లేదు. కేవలము కుకవులనుండి సత్కవులను వేఱుచేయుటకు 'సరస్వత్యా స్తత్త్వం కవిసహృదయాఖ్యం' అని యభినవగుప్తుఁ డన్నాఁడు. కవి సహృదయుఁ డనఁగా మహాకవి యన్నమాట

చిత్తగతసంస్కార మాత్మరూపత పొంది వాల్మీకి యీ మహాకవిసంప్రదాయనిర్మాణము గావించెను. అదియే 'పాదబద్ధ అక్షరసమ' ఇత్యాదిశ్లోకము కావున సంప్రదాయము పుట్టినది. యాత్మానుభవము నుండి. ఇది యెఱిఁగిన వాఁ డెవ్వఁడును సంప్రదాయమును దిరస్కరింపఁ జాలఁడు

ఇట్టి చిత్తవృత్తియైనను నాత్మరూపత నందుటలోఁ గవి భాగవతధర్మము నాశ్రయించినవాఁ డగుచున్నాఁడు అంతరపరిణతి యనఁగా నే నుద్దేశించినది యీ భాగవతధర్మమే. ఆత్మ తేజముతో నిండిన చిత్తము గలవానికి లోక మంతయు నానందమయముగఁ గన్పించును. అట్టివాఁడు శోకము పొందినది శోకము గాక కరుణ మగును. అనఁగా నాతని కే భావమైనను నాత్మానందరూపమైన శాంతమునందుఁ బర్యవసించును. ఈ శాంతమే పరిణతాత్తి. ఇట్టివానికి లోకమునందుఁ దగుల ముండదు అందుచేతనే "శుచి ర్విప్రః శుచిః కవిః" అని శ్రుతి చెప్పుచున్నది. భాగవతధర్మము నాశ్రయించి జీవించుటయే పరమార్థజీవనము. అట్టివాఁ డే పనిచేసినను భగవత్కైంకర్యము పొందును. తిక్కన్నగారు "ఇదియు నొక యారాధనావిశేషంబుగ" ననుటలో నర్థ మిదియే.

ఆత్మా త్వం గిరిజామతిః పరిజనాః ప్రాణా శ్శరీరం గృహం
పూజా తే విషయోపభోగరచనా నిద్రా సమాధిస్థితిః
సంచారః పదయోః ప్రదక్షిణవిధి స్తోత్రాణి సర్వా గిరః
య ద్య త్కర్మ కరోమి తత్త దఖిలం శంభో తవారాధనమ్॥

# శైలి (Style)

రచయిత : శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తమం, యమ్. ఎ.

౧

'శైలి'యను పద మీనాఁడు మిక్కిలి ప్రచురముగాఁ బ్రయోగింపఁబడుచున్నది. దీనియర్థ మేమియో గ్రహింపవలయు నని శబ్దరత్నాకరము, ఆంధ్రవాచస్పత్యము అను నిఘంటువులను వెదకితిని. అందీ శబ్దము లేదు. ఇది యర్వాచీనశబ్దము. విస్తృతార్థమున నిది ప్రసిద్ధవడసినది. ఇందుఁ బదగతియు, భావగతియుఁ బరిగొన్నవి. ఆలంకారికులు పేర్కొనిన రీతి, వృత్తులేకాక యమకాదిశబ్దాలంకారములు, ఉపమాద్యర్థాలంకారములుకూడ నీ పదమునం దిమిడియున్నవి. అందుచే నొక కవిరచనలోని ప్రయోగవైచిత్రీప్రభావ మంతయు నీ పదమునకు వర్తించును

కవియాత్మీయతపై శైలి యాధారపడియుండును. గతానుగతిక మగు రచన సేయువారిని, అనుకరణప్రియులైనవారిని విసర్జించి పరికించినచో, ఒకకవిశైలి, మఱియొకకవిశైలితో సరితూఁగదు. వ్యక్తిగత మగు విశిష్టత యేదోయొకచోట ద్యోతకము కాకతప్పదు లోకమున నిద్దఱు మనుష్యులొకేరీతిని భావించుట దుర్లభము. అది ప్రకృతికి విరుద్ధము, ఒకేజాతికి, ఒకేకాలమునకుఁ, జెందిన కవు లొకే యితివృత్తమును గైకొని కవిత నల్లిన, నవి యొకేరూపమున భాసిలక, ద్వివిధములుగాఁ జదువరుల నానందింపఁజేయు ననుటలో విప్రతిపత్తి లేదు. వారివారిభావనావైచిత్ర్యము, వైవిధ్యము, వైశిష్ట్యము, వారి శైలులలోఁ బ్రతిబింబించితీరును. మానవునిభావములకుఁ బదములు కేవలము సంకేతములుమాత్రమే. భావనలోని భేదము, విశిష్టత, పదరచనమునందును గానపించును. దీనినిబట్టి 'వ్యక్తివిశిష్ట మగు రచనావిధానమును శైలి'యని పేర్కొననగును.

౨

మనపూర్వకవులు కొందఱు తమ కెట్టి కవితాశైలియం దభిమానమో స్పష్టీకరించిరి. మఱికొంద అస్పష్టముగను, వ్యంగ్యముగను బేర్కొనిరి. నన్నపార్యుఁడు తన 'అక్షరరమ్యత' నితరు లాదరించినట్లు చెప్పుకొన్నాఁడు. తాను 'నానారుచిరార్థసూక్తినిధి' ననికూడ నాయన వాక్రుచ్చెను. ఈ 'అక్షరరమ్య'మగు శైలి, ఈ 'నానారుచిరార్థసూక్తి' యుక్తమగు కవిత్వ మెట్టిదో స్పష్టముచేయుట కష్టము. సంస్కృతమున 'గౌడి' 'వైదర్భి'యను కవితారీతులు ప్రసిద్ధములు. పరుషాక్షరయుక్తమగు పదములును, దీర్ఘసమాసములును గల రచనారీతి 'గౌడి' యనియు; సమాసవిరహితమై, మృదుపదఘటిత మగు రీతి 'వైదర్భి' యనియు నాలంకారికులు నిర్వచించిరి. ఈ రెంటికి మధ్య వర్తించునది 'పాంచాలి'. రీతులు వృత్తుల నాశ్రయించియుండును. వృత్తు లర్థము నాశ్రయించియుండును. నన్నయకవితా శైలి యీ మూఁడు రీతులకన్న విశిష్ట మైనది. దీనిని 'చాళుక్య శైలి'యన్న సమంజసముగా నుండును. ఎంతటిదీర్ఘసమాసము నందును గాఢిన్యము గానుపింప కుండుటయే యీ చాళుక్యశైలీవిశేషము. ఇందులకు నన్నయపద్యములన్నియు నుదాహరణములే. ఇట్టివి నూత్నకవితాశైలిని సమీక్షించియే, కాలాంతరమున 'జగన్నాథపండితరాయలు' 'రమణీయార్థప్రతిపాదక శబ్దఃకావ్య మ్మ'ని నిర్వచించె నని కొంద ఱూహించుచున్నారు.

'కవిరాజశిఖామణి'యగు నన్నిచోడుఁడు తనకవితాశైలిని గూర్చి సుస్పష్టముగ వివరించినాఁడు.

చ॥ సరళము గాఁగ భావములు జానుఁదెనుంగున నింపుపెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థము లొత్తగిల్ల, బం
ధురముగఁ బ్రాణముల్ మధుమృదుత్వరసంబునఁ గందళింపన
క్షరములు సూక్తు లార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగఁ

జానుఁదెనుఁగన్న నేమిదో యీాయన నిర్వచింపలేదు. ఇంకను నీయన తన కవిత 'మదనాగము' వలె నడయాడనలయు నని మత్తేభవృత్తము లో నిట్లు పేర్కొనెను:—

మ॥ పదబంధంబుల నగ్గలించి, బుధశబ్దభ్రాజియై, సద్గుణా
స్పదమై, దుష్కవిహృత్సరోజవనముల్ భంజించుచుఁ, భూరిస
మ్మదలీలన్ విలసిల్లి, సత్కవిజగన్మాన్యప్రభావంబునన్
మదనాగంబునుబోలెఁ గ్రాలవలదా మా కెందు లే కుద్ధతిన్॥

ప్రబంధకవితోచిత మగు సూక్తిచమత్కారము నీతఁడు విశేషముగ సంభావించినాఁడు. ఆంధ్రవాఙ్మయమున నిది యాదిప్రబంధమే యయ్యును, కాలమునుబట్టి, దేశమునుబట్టియు దీని కట్టి సమాదరణము సమకూడలేదు. ఇది విషయాంతరము. కవీశ్వరుఁ డింకను దనకావ్యము నెట్లు తీర్చి దిద్దవలయునో పేర్కొని యట్టి లక్ష్యమును దనకావ్యమున సాధించినాఁడు :—

సీ॥ మృదురీతి సూక్తు లింపొదవింప మే లిట్లు
భావంబు నెలమిఁ గ్రీడావహముగ
మెఱుఁగులఁ గన్నులు మిఱుమిట్లువోవంగఁ
గాంతి సుధానూతి కాంతిఁ దనర
వర్ణన లెల్లచో వర్ణన కెక్కంగ
రసములు దళుకొత్తి రాలువాఱ
దేశి, మార్గంబుల, దేశీయమునుగా న
లంకారములఁ దా నలంకరింప
గీ॥ నాదరించి విని సదర్థాతిశయముల
బుధులు నెమ్మనమున నిధులునిలుప
వలవదే రచింప వరకవీశ్వరునకు
నూత్నరుచిరకావ్యరత్నవీథి॥

పాల్కురికి సోమనాథుఁడు కూడ జానుఁదెనుఁగు కవితాశైలినే ప్రస్తుతించెను.

"ఉరుతర గద్యపద్యోక్తుల కంటె
సరస మై పరగిన జానుఁదెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్య మౌటఁ
గూర్చెద ద్విపదలు కోర్కె దైవాఱ"

అని ప్రతినపట్టి, భక్తిపారవశ్యమున నాతఁ డాప్రతిజ్ఞ నంతగాఁ బాటించలేకపోయెను. కాని తన లక్ష్యమునుమాత్ర మచంచలముగఁ బ్రతి కావ్యమందును బ్రకటించెను. 'బసవపురాణము'నఁ జేర్కొన్న పై పంక్తులనే పదభేదముతో 'పండితారాధ్య చరిత్రమున'

"ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబుగాను
జానుఁదెనుఁగు విశేషము ప్రసన్నతకు"

అని మఱియొకమాఱు ప్రస్తుతించెను. ఈజానుఁదెనుఁగు స్వరూపస్వభావము లెట్టివో యీతఁడు వివరింపలేదు. అట్లని మిన్నకున్నను బాగుండెడిది. తన 'వృషాధిప శతకము'లోఁ బరమేశ్వరుని జానుదెనుఁగున నిట్లు కొనియాడి మనకుఁ గ్లిష్టత కల్గించెను.

"బలుపొడతోలు, సీరమును, బాపసరుల్, గిఱుపారు కన్ను, వె
న్నెలతల, సేదుకుత్తుకయు, నిండినవేఁ ఒపుటేఱు పుల్గుపూ
సలు గల జేనిలెంక వని జాను దెనుంగున విన్నవించెదన్
వలపు మదిం దలిర్ప బసవా! బసవా!! బసవా!!! వృషాధిపా!"

ఇదియే జానుఁదెనుఁగైనచో నది యచ్చతెనుఁగునకుఁ బర్యాయపద మై యుండవలయును. అయినను గాకున్నను సోమనాథుఁడు జానుఁదెనుఁగు కవితాశైలిని దా నాశించినంతగా నాచరింపలేకపోయె ననుట సత్యము.

ఈతఁ డవలంబింతు నని వ్రాసటఁ గావించిన మఱియొక కవితానిబంధనము "అల్పాక్షరముల ననల్పార్థ రచన". ఇందును నాతఁ డంతంత మాత్రముగనే కృతకృత్యుఁ డైనాఁడు. మతావేశపూరితుఁ డగు నీ కవి శైలిలో నట్టి నియమము సార్థక మౌట యసాధ్యము. పదకవిత్వము నకు సన్నిహిత మైన 'ద్విపద' ఛందస్సు నెన్నుకొనుట; దేశీయము లగు నితివృత్తములను గావ్యవస్తువులఁ గావించుకొనుటచే నీతఁడు 'దేశికవితాచార్యుఁ' డనకతప్పదు. కాని యట్టి దేశితన మతని కవితాశైలిలో సర్వత్ర గోచరింపదు. అందుల కాతఁడు మహావిద్వాంసుఁ డౌటయే హేతువు.

పాల్కురికి సోమనాథుఁడు భాషావిషయమునఁ దెచ్చిన యీ మహావిప్లవమును సమగ్రముగా సమీక్షించినాఁడు తిక్కన. భవికవుల మార్గమును గూలఁద్రోయుటకుఁ బాల్కురి సోమనాథుఁ డవలంబించిన స్వేచ్ఛావిధాన మాతనికి నచ్చలేదు. అందుచే నుత్తమ మగు కొన్ని సాహిత్యనియమముల నీ మహాకవి తన 'నిర్వచనోత్తర రామాయణ మున' నవతారికలోఁ బేర్కొన్నాఁడు. అట్టి నియమముల నక్షరములఁ బాటించి తన కవితాశైలి నేర్పఱచుకొనుటయే కాక, భావికవులకుఁ గూడ మహోపకారము గావించినాఁడు. కావున వాని నిట సవిస్తారముగఁ బేర్కొను టుచితము.

1. గంధవహుఁడు దళమునందలి సౌరభము సులువుగా గ్రహించుచందమున, పద్యమునందలి రసమును గవీశ్వరుఁడు 'ఇంపారెడు పల్కుల' సరిగ్రుచ్చి రసజ్ఞున కొసంగవలయును.

ఉ॥ భూరివివేకచిత్తులకుఁ బోలు ననం దలఁపన్ దళంబులన్
సౌరభ మిచ్చు గంధవహుచందమునం బ్రకటంబు చేసి, యిం
పారెడు పల్కులం గడయ నప్పలుకుల్ సరిగ్రుచ్చునట్లుగాఁ
జేరుప నేరగావలయు......................"

(2) పలుకులపొందు గల్గియుండవలయును. ప్రాఁతవడ్డమాటలు (Obsoleti words) ప్రయోగింపరాదు. ఇది తిక్కన పాటించిన గొప్ప నియమము. ఇతరు లంతంతమాత్రముగఁ బాటింపలేనిది. ఇందులకు జన వ్యవహారమున నున్న చైతన్యపూరితమైన వాణిని నిర్ణిమేషదృష్టితో నిశితపరిశీలనము గావింపఁగల సామర్థ్య ముండవలయును. అట్టి సామర్థ్యము తిక్కనార్యునకే చెల్లినది.

(3) ఛందోవ్యాకరణనియమోల్లంఘనము చేయఁగూడదు, భావానుకూల మగు ఛందస్సు వాడవలయును;—

క॥ తెలుఁగుకవిత్వము చెప్పం
దలఁచిన కవి యర్థమునకుఁ దగియుండెడి మా
టలు గొని పలుకుం బ్రాసం
బులు నిలుపక యొగిని బలిమి పుచ్చుట చదురే?

(4) లింగవచనములు భేదింపకుండ, సంస్కృతశబ్దము, తెలుఁగుఁ బడి విశేషణము తేటపడునట్లు పలుకవలయును.

(5) అనుకరణవిహీనముగా సంస్కృత వాక్యముగాని, తెలుఁగు ప్రత్యయములు చేరకున్న సంస్కృతపదముతోఁ దెనుఁగుపదము సమ సించుటకాని పనికిరాదు. అనఁగా 'మణిప్రవాళ' శైలి తెలుఁగుభాషకుఁ గూడదు. అది పరిహరింపవలయు నని హెచ్చరించినాఁడుతిక్కన. 'జాత్యము గామి నొప్పయిన సంస్కృత మెయ్యెడఁ జొన్ప' ననుట కర్థ మిది.

(6) శాంతప్రాసాదులు వాడరాదు. అది శ్రుతిహితవు కాదు. ద్విత్వమునకు, సంయుక్తమునకుఁ బ్రాన తగదు. 'దార్గత్యము దోఁపఁ బ్రాసము ప్రకారము వే అగు నక్షరంబులన్, శ్రుత్యనురూప మంచు నిడ.'

(7) ఇతివృత్తమునందలి పూర్వాపరకథాసందర్భములు 'లలిత పదహృద్యపద్యంబుల'చే 'అలఁతియలంతి తునియలుగ, వాలసంధించిన విధంబు సమరఁగవలయున్'.

ఇట్టియిరువురు కవుల నుపాసించియీతనికవితాసరస్వతి గంగాయమునా సంగమమున సంతత స్రోతస్విని యైనది. ఒకానొక సందర్భమున Dryden మహాశయుఁడు చెప్పిన యీ మాట లెట్లా పెద్దవల్ల సన్వర్థ మౌను:—

"The force of Nature could no further go
To make a third, she joined the two."

ప్రబంధోచిత మగు కవితాశైలికి శ్రీకారము చుట్టినవాఁడు నాచన సోమన, ఈతఁడు తిక్కనసోమయాజికిఁ బరోక్షశిష్యుఁడు. తిక్కన వలెనే యీతఁడును నలఁతియలఁతి తునియలతోఁ జతురవాక్యసంధాన చణత్వము గల దిట్ట. తిక్కనవలె నుడికారములను సందర్భోచితముగ నుపయోగించిన ప్రజ్ఞాశాలి. తిక్కనవలె హరిహరబ్రహ్మ,— నుపాసించిన భక్తుఁడు. ఈతఁడు తన గద్యలయందుఁ దిక్కన సోమయాజి ప్రణీతం బైన 'శ్రీమహాభారతకథానంతరమున' అని సోమయాజియందలి తన భక్తి ప్రపత్తులఁ బ్రకటించుకొన్నాఁడు కాని తన గురువర్యునివలె మాన వప్రకృతి నామూలచూడముగఁ బరిశీలించినవాఁడు కాఁడీతఁడు. ఋషి జనోచిత మగు లోకాంతరవసుసందర్శన మా 'కవిబ్రహ్మ' కున్నట్లీ నవీనగుణసనాథునకు లేదు. హరిహరబ్రహ్మోపాసనమునందును, సోమయాజి కున్నంత స్థితప్రజ్ఞత్వము సోమన్నకు లేదు. వీ రిరువురి యాత్మీయతలోఁ (Personality) గల యీ తారతమ్యము వీరికవితాశైలులందును స్పష్టపడును. కాఁగా సోమన్నశైలి 'వక్రోక్తిజీవనము' ప్రధానముగాఁ గలదైనది.

సోమనాథుఁడు శ్రీకారము చుట్టిన ప్రబంధోచిత కవితాశైలికిఁ బుష్టిని జేకూర్చినవాఁడు. 'కవిసార్వభౌముఁడు శ్రీనాథుఁడు' తనకవితాశైలి యెట్టి నడలతో నర్తించునో యీ కవీశ్వరుఁడే ముద్దు ముద్దుగాఁ జెప్పుకొని యెట్లు మురిసికొన్నాఁడో!

"వచియింతు వేములవాడ భీమనభంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు;
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు;
వాకృత్తుఁ దిక్కయజ్వప్రకారము రసా
భ్యుచితబంధమునఁ నొక్కొక్కమాటు"

ఈ రీతిని బూర్వకవుల శైలులలోఁ గల యుత్తమలక్షణములను బుణికి పుచ్చుకొనుటచేఁ బరిపుష్టిఁ జెందక

"పంపావిరూపాక్షు బహుజటాజూటికా
రగ్వధప్రసవసౌరభ్యములకు
తుంగభద్రాసముత్తుంగవీచీఘటా
గంభీరఘుమఘుమారంభములకు
కళసాపురప్రాంతకదళీవనాంతర
ద్రాక్షాలతాఫలస్తబకములకు
కర్ణాటకామినీకర్ణహాటకరత్న
తాటంకయుగధాళధళ్యములకు.

నిర్ణిబంధనిబంధమై నెనయు కవితా" శైలిని ఒలికించిన వాఁడీ కవిరాజు.

"నానాస్త్రప్రమదామదస్ఫూర్తిసక్రోధాతకాఠిన్యముల్ ।
బూనన్ జాలు వచోవిలాసములతోఁ"

గూడిన దీతనికవితాశైలి. ఇట్టి ప్రౌఢకవితాశైలి "సంస్కృతశౌరసేనీముఖ్యభాషాపరిజ్ఞానపాటవంబు"వలనను, "పన్నగపతిసార్వభౌమభాషితమహాభాష్యవిద్యాసమభ్యాసబలము"వలనను, "అక్షపాదకణాదపక్షిలో దీరిత న్యాయకళాకేశలాతిశయము"చేతను, "శ్రుతిపురాణాగమస్మృతిసాంఖ్యసిద్ధాంతకబళనవ్యుత్పత్తిగౌరవంబు"వలనను "పూర్వకవిముఖ్యవిరచితాపూర్వకావ్యభావరససుధాచర్వణము"చేతను చేకూరినది. కేవల

మిట్టి పాండితీపటుత్వము మాత్రముచేతనే కాక, లోకవ్యవహారదిదృక్షా దక్షత్వముచేతను నీ కవిసార్వభౌమునిశైలి సంపూర్ణత్వమును సవదరించుకొన్నది. ఇట్లు పలుపోకడలఁ బోవు నీతనిశైలియందలి భాషను జూచి పండితులు వితర్కించుట విని శ్రీనాథుఁడు

"ప్రౌఢి పరికింప సంస్కృతభాష యండ్రు
పలుకునుడికారమున దెనుఁగౌస యండ్రు
ఎవ్వ రేమనుకొన్న నా కేమి భయము
నా కవిత్వమ్ము నిజము కర్ణాటభాష"యనిసమాధానించి వక్ష్యమాణ విపశ్చిద్వర్యులకుఁ దలపట్లు పట్టించినాఁడు పోతనామాత్యుని కవితాశైలి 'అందఱను మెప్పించు'నలౌకికమహత్వపటుత్వము గలయది.

పెద్దనార్యుని మధురహస్తమునఁ ప్రబంధకవితాశైలి 'శిరీష కుసుమ పేశలసుధామయోక్తు లందు' నిండి పరాకష్ఠ నందినది. ముక్కు తిమ్మనార్యునిముద్దు లొల్కెడి కవితాశైలి 'జనముద్దు'గాఁ బెరిగినది. సంకుసాలనృసింహునిశైలి యతిని విటునిగను, విటుని యతిగను జేయఁ గల సామర్థ్యముకలది. ధూర్జటిశైలి "సుకుమారవారవనితాజనతాఘన తాపహారి, సంతతమధురాధరోదితసుధారస ధారలు"గ్రోలుటచేఁ గైపెక్కినది. శ్రీకృష్ణదేవరాయలశైలి సంస్కృతపాండిత్యజటిలమైనది. "ఉత్ప్రేక్షోపమలజాతి పెంపెక్కినది; "భావధ్వనివ్యంగ్యసేవధి"యైనది. "సరసార్థబోధఘటనాహేలాపరిష్కారశారద"యవతారమెత్తిన తెనాలి రామకృష్ణుని కవితాశైలి పద్యమున నొక తీరుగా నుండును.

పింగళసూరనార్యుఁడు శైలినిగూర్చి కథాగతపాత్రలముఖమున విపుల మగు విచారము సల్పినాఁడు. తన కాత్మీయ మగు శైలి నిట్లు ప్రశంసించుకొనియే తెనుఁగకవియుఁ బోనిపోకడ పోయినాఁ డీ ప్రౌఢకవి. మణికంధరునిదండకమును గలభాషిణి తన నిసర్గామలకోమల మధుర వాక్యవిన్యాసముతో నెట్లు ప్రస్తుతించెనో పరికించుట ముచ్చటౌను:-

పొసఁగ ము త్తెపుసరు ల్పోహళించినలీలఁ
దమలోన దొరయు శబ్దములఁ గూర్చి
అర్థంబు వాచ్యలక్ష్యవ్యంగ్యభేదంబు
లెఱిఁగి నిర్దోషత నెసఁగఁజేసి
రసభావములకు సర్వాంబుగ వైదర్భి
మొదలైన రీతు లిమ్ముగ సమర్చి
రీతుల కుచితంబులై తనరారెడు
పాకంబు లింపుగాఁ బాదుకొల్పి
యమక నుపమాదులును యమకాదులు నగు
నట్టి యర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవితఁ జెప్పంగ నేర్చు సత్కవివరునకు
వాంఛితార్థంబు లొసఁగనివారు గలరె?''

కళాపూర్ణోదయానంతర మీకవి 'ప్రభావతీప్రద్యుమ్న'మను ప్రబంధరాజమును సృజించెను. కవిశైలిలో నెన్నఁదగిన పరిణతి యేర్పడినది. అందుచే నింద్రుపిచే 'శుచిముఖి' సురుచిరవాగ్రోచిస్సుల నిట్లు గొని యాడఁజేసెను:—

''శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగనీక
పదమైత్రి యర్థసంపదలఁ బొదలఁ
దలఁపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ
బునరుక్తిదోషంబుపొంతఁ బోక
యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా
ఖాచంక్రమక్రియఁ గడవఁజనక
పరిష్కృతార్థభావంబు పాదుకో నదుకుచు
నుపపత్తి యొందు నత్యూర్జితముగ

నొకటఁ బూర్వోత్తరవిరోధ మొందకుండఁ
దత్తదవయవవాక్యతాత్పర్యభేద
ములు మహావాక్యతాత్పర్యమునకు నొసరఁ
బలుకనేర్చుట బహుతపఃఫలము కాదె ?"

"ఈ రెండుపద్యములం బోల్చి చూచితిమేని, ఈ రెండవకృతి రచించు లోపలఁ గవి కొంతమట్టునకు శైలింగూర్చిన యభిప్రాయము మార్చినాఁ డనియుఁ జెప్పుట కవకాశ మయ్యెడి" నను రామలింగారెడ్డి గారి పరిశీలన ముచిత మైనది. తొలిపద్యమునఁ గవిశబ్దాలంకారములను గూడ మన్నించి, యా యా సందర్భములఁ గళాపూర్ణోదయమునఁ బ్రదర్శించెను. కాని 'ప్రాయేణ యమకే చిత్రే రసపుష్టి ర్నవిద్యతే' యను నాదేశమును శిరసా వహించి, కాలమున కెదు రీది, యీ మహాకవి తన స్వతంత్రతాగరిమను గాపాడుకొనుట యదృష్టము. శైలిని గూర్చి యిట్టి రసవత్తర మగు చర్చ గావించి, సూరన తన నవ్యత నన్నివిషయములందువలెనే యిందును జాటుకొనెను.

ప్రబంధకవితావృక్షమునఁ గాసిన యమృతఫలము 'వసుచరిత్ర' తత్కర్త యగు రామరాజభూషణునికవితాశైలి యాపాతమధురము, నాలోచనామృతము నైనది. అందులకుఁ గారణ మాతఁడు 'సాహిత్యకళానిష్ణాతుఁడే' కాక 'సంగీతకళారహస్యనిధి' కూడ. తరువాత నెన్నఁదగిన చేమకూర వేంకటకవిశైలి చేమకూరరుచులతో నొప్పునది.

ఆధునికకవులలో "నన్నయాక్షరరమ్యప్రసన్నఫణితి"ని, "సోమయాజి యర్థోన్నతసునిశితోక్తి"ని దమతమయభిమానముకొలఁది "పొదివి పోషించి సర్వతోముఖవికాసభాసురం బైన కావ్యసౌభాగ్యము"ను జేకూర్చినవారనేకు లున్నారు.

3

ఇంతఁదనుక ఆంధ్రమహాకవులశైలీవిభేదములను, వానివాని విశిష్టతలను స్థాలీపులాకముగ వివరింపఁబడెను. ఇఁక ఆంగ్లసారస్వతేయులు 'శైలి' అను పదమున కిచ్చిన నిర్వచనములను బరికింతము.

"పచేళిమ మైన భావసంపద, విశిష్ట మగు విజ్ఞానము, సునిశిత జీవితానుభవము, హేతువాదపటుత్వము గల రచయితరచనలో "శైలి" యున్న దని పేర్కొనదగును. శైలి యనఁగాఁ బదములను శిల్పదృష్టితో సమకూర్చుట (Style is the artistic arrangement of words) పఠితలమనోభావములను బ్రేరేచునట్లు రచయిత తన విశిష్టవ్యక్తిత్వానుకూలముగ భాష నుపయోగించుటయే శైలి. అందుచే నాత్మీయతాగుణము శైలి కతిప్రధానము." అని యాంగ్ల విజ్ఞాన సర్వస్వము తెల్పుచున్నది.

"మానవునినీడవలె, రచయితను శైలి వెన్నంటియుండు"నని న్యూమన్ పండితుని వాక్యము. 'శైలియే రచయిత' (Style is the man) 'విలక్షణ మగు నాత్మగుణముల కనుకూలముగ, విలక్షణ మగు పదములను, విలక్షణ మగు వాక్యములయందు సవదరించి, విలక్షణ మగు విషయబోధనము చేయుటయే శైలి'యని మఱియొక సారస్వతేయుని నిర్వచనము.

"రచయితమానసికప్రతిబింబమే శైలి. చక్కనిశైలి సంస్కృతి విలసిత మగు మనసు గల రచయితనుండియే యాశింపనగును. ఉదాత్త మగు ప్రవర్తన మున్ననేకాని యుదాత్త మగు శైలి యలవడదు" అని గెటేపండితుఁడు. "రచయితయాత్మీయతనుండి వేఱుచేయరాని విశిష్టతాగుణమే శైలి'యని విపుల్.

చక్కనిశైలి నలవఱచుకొనవలయు నన్న బైబిల్ గ్రంథమును బదేపదే చదువలసినదిగా కాల్‌రిడ్జిసహృదయునిసలహా. 'భావుకత, భావావేశ మున్నచో శైలికై మన మెవ్వరిని ననుకరింపఁ బనిలేదు. ఒకేవిధానమునకుఁ గట్టువడియుండ నక్కఱలేదు. పర్వతాగ్రము నుండి పరువళ్లుత్రొక్కు ప్రవాహమును సముద్రముఖమునకు సహజముగా గమించురీతిని, ఉద్వేగము గల భావములు, సహృదయహృదయముల నానందింపఁజేయఁగలవు 'అని హెన్రీఇర్వింగు హితోపదేశము.

పై పరిశీలనమునుబట్టి నిర్ణయింపఁదగిన యంశము శైలి యనునది వ్యక్తివిశిష్ట మగు రచన యనియె. రచయిత యాత్మీయతాపటుత్వముకొలఁది నది వర్ధిల్లుచు సహృదయుల కానందసంసిద్ధిని గూర్చును. సృష్టిలో గభీరసుందరము లగు సముద్రము లున్నవి. అవ్యక్తమనోహరారావములఁ గావించుచు నర్తించు సెలయేటికన్నె లున్నవి. తీర్చిదిద్దుకొనిన పెద్ద ముత్తైదువలనుబోలిన నదు లున్నవి. ప్రశాంతమనోజ్ఞము లగు కాసారము లున్నవి. ఇవన్నియు విభిన్నరీతులలో మానవున కానందమును ప్రసాదించుచున్నవి. అట్లే నన్నయ తిక్కనలు, ఎఱ్ఱన సోమనలు, కేతన మారనలు, శ్రీనాథపోతనలు, పెద్దన తిమ్మనలు, సూరన భట్టుమూర్తులు, రాయప్రోలువిశ్వనాథాదికవులు మన వాఙ్మయమునఁ దమతమశైలీవిశిష్టతలతో నానందోపలబ్ధికిఁ గారణభూతు లగుచున్నారు. ఇట్లే షేక్స్పియర్ షెల్లీలు; మిల్టన్ వర్డ్సువర్తులు, ఆంగ్లవాఙ్మయమునం దున్నారు. వాల్టేరు, రూసోలు, తమ శైలిప్రభావముచే ఫ్రాంసుదేశమును విప్లవోన్ముఖము గావించి, తమకాలమున నైరోపాఖండచరిత్రకే నూతనాధ్యాయమును గల్పించిరి. గెతేయందుఁగల తత్త్వచింత, గభీరత షెల్లరునందు లేవు. గెతేశైలి జర్మనుదేశమునకు నూతన మగు జవజీవములఁ బ్రసాదించినది.

"వర్డ్సువర్తు. కీట్సు, షెల్లీలు 'కోయిల'పైఁ గవిత్వ మల్లిరి. కాని యొకరి'కోయిల'మఱియొకరి'కోయిల'ను బోలినది కాదు. ఇదియే కవిసృష్టికిని, భగవంతునిసృష్టికిని గల విభేదము. వర్డ్సువర్తు'కోయిల'భావబంధుర మైనది. ఐహికాముష్మికములకు సమన్వయవాక్యముల నాలాపించినది. షెల్లీకోయిల యత్యంతగమనవేగము కలది. ఉద్వేగయుత మైనది. పరమహంసవలె విహాయసపథమున స్వేచ్ఛగా విహరించునది. కీట్సు'కోయిల'అధివ్యాకులిత మైనది. దానికీ ప్రపంచమున సౌఖ్యము శూన్యము. అక్షయ మగు కవితాపక్షములతో నానందార్ణవాంచలముల

కెగురలేక యెగురలేక యెగుర నుంకించును. ఇట్టి పిభేదము వారివారి యాత్మీయతలనుబట్టి యేర్పడినది. "కవిశైలిని నిర్దుష్ట మొనర్చునది కవి యంతరంగముకాని, యెన్నఁడో వల్లించిన యమరకోశము కాదు."

(సాహిత్యతత్త్వవిమర్శనము : శ్రీ జొ. సత్యనారాయణమూర్తి)

౪

మన ప్రాచీనాలంకారికు లుపయోగించిన 'రీతి' యను పదమును సంగ్రహముగఁ బరామర్శింతము. "రీతి రాత్మా కావ్యస్య"-కావ్యము నకు రీతి యాత్మ యని వామనునిమతము. రీతి యన విశిష్ట మగు పదరచన. ఇది వైదర్భి, గౌడి, పాంచాలిభేదములచేఁ ద్రివిధములు. ఇందు, సమగ్రగుణశోభితి యగుటచే 'వైదర్భి' అత్యుత్తమ మని వామనుఁడు. వామనమతము నానందవర్ధనునిచేఁ బరాస్తము చేయఁ బడినది. కావ్యమునకు 'ధ్వని' యాత్మ యనియు, రీతులు రసవ్యంజ కము లనియు సిద్ధాంతీకరింపఁబడెను.

వామనుఁడు రీతిని పదాశ్రయముగనే నిర్వచించినను, భావ ద్యోతకము లగు పదముల నేఱుకొనుట యని వ్యాఖ్యానము చేయ నగును. దీనినే 'శయ్య' 'పాకము' 'ధారాశుద్ధి'యను నితరపదముల చేతను వ్యవహరించుచున్నాము. భావానుకూల మగు పదముల నెన్ను కొనుట కవియాత్మీయతపై నాధారపడి యున్నది. కావున శైలి - రీతి యను పదములు పరస్పరసన్నిహితము లనకతప్పదు. శబ్దపాక మన్నను నించుమించుగా నీ యర్థమునే సూచించుచున్నది. పరివృత్త్యసహిష్ణువు లగు పదములను వివేకి యగు కవి విన్నాణముతో నేర్చికూర్చును. పాకములలో ద్రాక్షాపాక మత్యుత్తమము. అర్థగాంభీర్యాలంకార యుత మగు కాళిదాసాదికవులకవిత్వ మిట్టి పాకమునఁ బడినది. మహా కవి యలంకారములను రసోపస్కారముగనే యుపయోగించునుగాని కవితాకన్యకు భారము లగు నాభరణములను గానీయఁడు. వెనుకఁ

బేర్కొన్న యాంధ్రకవు లందఱు చక్కని చిక్కని ధారాశుద్ధి గల సిద్ధహస్తులు.

ఈ వ్యాసమున నాత్మీయత (Personality) అను పద మనేక పర్యాయములు ప్రయుక్త మైనది. ఆత్మీయత యన నేమి? వ్యక్తిగత మగు మహిమయే యాత్మీయత.(Personality is what is unique in man) కుసుమమునందు సౌరభమువలె మానవునియందును నానావిధ విశిష్టగుణసముదాయసౌరభ ముండును. దానిచే నాతఁడు తన వైజ్ఞానిక యాత్రను సాగించి, పలువురిప్రశంసలఁ బడయును. ఇట్టి యాత్మీయత రచయితశైలి యను నావకుఁ జుక్కానివట్టు.

"Style is the effluence of character and not merely external decoration." అని న్యూమనుపండితుఁడు. శైలి రచయిత శీలము ననుసరించి యున్నిలన మాను. కొందఱు స్వభావముచే మంజు మిత భాషులు. మఱికొందఱు వాచాలురు కొందఱు మృదుమధుర భాషులు మఱికొందఱు దారుణాఖండలశస్త్రతుల్యముల నాడ్లాడు దురు. ఈ స్వభావములే వారివారిశైలులయందును బ్రతిబింబించును.

నన్నయకవితాశైలి యక్షరరమ్య మైనది. నాదశ్రీమంజుపద విన్యాసమే యా శైలి. నిరంతరవేదాధ్యయనశీలము కలవాఁ డౌటచే నాతనివాక్కున కట్టి శైలి యలవడినది. ఇందు సంగీతమునకుఁ గల యాపాతమాధుర్యము,సాహిత్యమునకుఁగల యాలోచనామృతము సమ ముగా మేళవించి యుండును. ఇందలిపదములు, సమాసములు, తమ రామణీయకమహిమచేఁ బఠితను గైవసము గావించుకొనును. ఇట్టి శైలి, యొక మహాభావమందలి వివిధావస్థలను గ్రోడీకరించి, గంభీరతాము ద్రతో నేకోన్ముఖముగ వెలువడును. పఠిత తనబుద్ధినైశారద్యమును బ్రకటించి, శైలీప్రభావమును దర్కవితర్కములతో గుర్తింపఁజాలఁడు. ఇందు భావవైశద్యముకన్న, భావోద్రేక మధికము. దీనినే Emotional style అందురు.

అల్పాక్షరముల ననల్పార్థ రచన కల్పించు శైలి దీనికి విరుద్ధ మైనది. ఇది బుద్ధికిఁ బనుపెట్టును. ఇది యొక మహాభావమందలి వివిధావస్థలను వేఱుపఱచి, (Analyse) శాశ్వతభావముద్రను వేయును. ఇందు మన స్తత్త్వపరిశీలనము, క్రమపరిణామపద్ధతి, యధికముగ నుండును, మితభాషులకు, తీవ్రయోచనాపరులకు, బుద్ధినైశిత్యము గలవారి కిట్టి శైలి యలవడు నని యూహింపనగును. తిక్కనాగ్యుఁ డిట్టి శైలి కాచార్యపీఠము. సూరన్న నీ కోవలోనివానినిగా నెన్నవగును. దీనినే Intellectual Style అననగును. ఈ ద్వివిధము లగు శైలీభేదము లన్ని భాషలయందును బొడఁగట్టును. ఈ రెండు మార్గము లనేక మొనర్పఁ గల శైలి సంభవమా ? యని సంశయము వేధించుచుండును.

కుంతలుఁడు తన 'వక్రోక్తిజీవితము' లోఁ గవితామార్గములను (Style) త్రివిధములుగా విభజించెను.

(i) సుకుమారమార్గము:—ఇది జన్మసిద్ధ మైనది. సహజశోభా విలసితము. శక్తి లేక ప్రతిభాజనితము. కాళిదాసభవభూత్యాది సంస్కృతకవులు, నన్నయ తిక్కనాగ్యాంధ్రకవులు నీ మార్గమునకుఁ జెందినవారు.

(ii) విచిత్రమార్గము:—ఇందు ద్రాక్షాశోభ యధికము. ఇది కృషి సాధ్యము. బాణహర్షాది సంస్కృతకవులు, నాచనసోమన, శ్రీనాథాది యాంధ్రకవు లుదాహరణములు.

(iii) మధ్యమార్గము:—భారవి, మాఘాది సంస్కృతకవులు, పెద్దన, తిమ్మన, ధూర్జటి, సూరనాది ప్రబంధకవు లీ వర్గమునకుఁ జేరుదురు.

ఇట్లు స్థూలవిభజనముగావించినను, కవిస్వభావభేదమునుబట్టి యవి యనంతములుగా నుండు నని యాయాలంకారికుఁడే యిట్లన్నాఁడు.
"యద్యపి కవి స్వభావభేదనిబంధనత్వాత్, అనంతభేదభిన్నత్వ మనివార్యమ్."

అక్షరములు, శబ్దము లుండియు, ఏది లేనిచో శోభింపదో యదే యుత్తమ మగు మార్గము (శైలి) యని నీలకంఠదీక్షితు లద్వితీయముగ నిర్వచించిరి. పరులచే నేర్పఱుపఁబడిన మార్గమున నడచుకవు లంధప్రాయు లని యీ మహనీయుఁడే హెచ్చరించెను. అట్టివారినే కుకవు లని తిక్కనామాత్యుఁడు తన నిర్వచనోత్తర రామాయణమున నిట్లు నిందించెను.

పలుకులపొందులేక, రసభంగము సేయుచుఁ బ్రాఁతవడ్డ మా
టలఁ దమనేర్పుఁ జూపి, యొకటన్ హృదయం బలరింపలేక, రోఁ
పాలమునుగాని యట్టిక్రమవృత్తిఁ దమ మెచ్చఁగ లోకమెల్ల న
వ్వులఁ బొరయం జరించుకుకవుల్, ధర దుర్విటులట్లు చూడఁగన్.

కాన నిట్టి నిందకుఁ బాల్గాకుండ నుండవలయునన్న కవులు తమ తమ స్వభావానుకూల మగు శైలి నేర్పఱుచుకొనవలయును. అది తత్తమచితముగ సహృదయుల కానంద నిర్వృతి నొసంగును.

"జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః".

# శ్రీమద్రామాయణములోని వ్యాస ఘట్టములు

శ్రీ భమిడి సత్యనారాయణశర్మ

---

లోకమునందు మనవారి కేదేని క్లిష్టసమస్యలు తోఁచినప్పు డయ్యో! నేఁడు మా కొక వ్యాసఘట్టము సంప్రాప్తించిన దని యనుట వాడుక. వ్యాసఘట్టము లనఁగా మహాభారతరచనకుఁ గడంగిన శ్రీవ్యాస భట్టారకుఁడు తాను శ్లోకములను జెప్పుటకును, గణపతి రచించుటకును నిర్ణయించుకొనిరఁట ! అత్తఱి గణపతి "నేను రచించునంతలో నీవు శ్లోకమును జెప్పనియెడ గంటము నటఁ బాఱవైచి వెడలిపోవుదు" నని యనఁగ వ్యాసాచార్యులుగూడఁ దాను జెప్పెడి ప్రతిశ్లోకమును గణపతి యన్వయము చేసికొనకుండ వ్రాయఁగూడ దని శపథముసేసెనఁట ! అట్లిరువురిరచనలు సాగుచుండ మహాలేఖకుఁ డగు గణపతి సమస్త విద్యాధిపుఁడుగూడ నగుటచేఁ మఱిటిలో వ్యాసశ్లోకములసమన్వయముఁ జేసికొనుచు నతిత్వరితముగ వ్రాయుచుండ వ్యాసాచార్యులు నారాయణాంశసంభూతుం డయ్యును గొంత యిక్కిఱిబిక్కిఱిచెందినయప్పుడు కొన్ని శ్లోకములు ప్రతినూఱున కొక్కొక్కటిచొప్పున దూరాన్వయాది కాఠిన్యము గలవానిని జెప్పె ననియు, నయ్యవి వ్యాసఘట్టము లని లోకమునందు బ్రసిద్ధిజెందె ననియుఁ బెద్దలు చెప్పుదురు. ఆయా ఘట్టముల నన్వయము చేసికొనుట కా గణపతికిఁ గొంతకాలము పట్టుచుండ నింతలో వ్యాసుఁడు కొన్ని శ్లోకములు చెప్పుచుండెడివాఁ డని వాడుక. అట్టి ఘట్టములు లోకమునందు నానాఁట వ్యవహారదశయందుఁ బ్రతిచిక్కు సమస్యకు ననువర్తింపఁజేయఁబడి మన కేదేని క్లిష్టము లగు విషయములు సంప్రాప్తించినతఱి "మా కొక వ్యాసఘట్టము నేఁ డెదుర్కొన వలసివచ్చిన" దని మన మందుము. ఆ రీతివిషమసమస్యలు చమత్కారయుక్తసన్నివేశములు శ్రీమద్రామాయణమునందు మనల నెదుర్కొనుట మన పరిషన్మండలియందలి విద్వాంసులకు నేను క్రొత్తగఁ జెప్ప

సక్కఱలేదు. కాని నేఁటివఱకు నా యీ సన్ని వేశములకుఁ దృప్తికరము లగు సమాధానములను శ్రీమద్రామాయణ వ్యాఖ్యాతలుగాని లోకము నందలిపండితులుగాని యిత్థమిత్థ మని నిరూపించియుండలేదని నామనవి. నేఁడు రామాయణమునుగుఱించి పెక్కు విమర్శనములు, పలువిధము లగు రచనలు, వే యేల? వివిధరూపము లగు భాషాంతరీకరణములు గూడ జరుగుచున్నవి. కావున నేఁ డా యీపండితపుంగవు లీ సభామండపమునఁ గొందఱు సమావేశ మగుటచే నీ విద్వన్మండలిమ్రోల నాకుఁ దోఁచిన కొన్ని ముఖ్యవిషయములనుంచి యట్టివానికిఁ గాలక్రమమునఁ బత్రికాముఖమునఁగాని లేక నిట్టి పునఃపునస్సమావేశములందుఁగాని సమాధానముల నభిలషించుచున్నాఁడను. (1) తొలుదొల్తఁ దమకు దశరథపుత్రప్రాప్తివిషయమున నొక యపూర్వసంఘటనమునుగూర్చి మనవిచేయుచున్నాను. దశరథుఁడు తనకుఁ బుత్రులు లేరని యఱువది వేలేండ్లుగ "మమ లాలస్యమానస్య పుత్రార్థం నాస్తి వై సుఖ" మ్మని కడుంగడు విషాదమును జెందుచుండెను! అట్లఱువదివేలేండ్లనుండి పరితపించుచుండిన దశరథమహారాజున కటు పురోహితుఁ డగు వశిష్ఠుఁడు గాని యిటు నమాత్యవర్యుఁ డగు సుమంత్రుఁడుగాని సనత్కుమారుఁ డెన్నఁడో దేవయుగమునందుఁ జెప్పియుండిన దశరథపుత్రప్రాప్తివృత్తాంతము నెఱింగినవా రయ్యు నేల నావిషయ మా నృపాలున కెఱింగించి యూరకుండఁజేయరైరి? తా నెఱింగిన యర్థము నొకవేళ కారణాంతరములచేఁ బురోహితుఁడు చెప్పక దాఁచినను బ్రతినెలకుఁ బ్రభువువద్ద జీతబత్తెములను గ్రహించుచుండెడి సుమంత్రుఁ డేల నూరకుండెను? ఆతఁ డమాత్యుఁడుఁ కదా! నిరంతరము రాజుసన్నిధినుండి యాతని కన్ని విధములఁ దోడ్పడెడి యమాత్యునకుఁ దన ప్రభువునకుఁ గలిగిన యీ వేదనము తొలఁగించునట్టి బాధ్యత యెక్కుడుగ నుండవలసిన విధి కాదా? అట్టి యుదాసీనతవలన వశిష్ఠ, సుమంత్రి, దశరథ

పాత్రలయందలి యౌచిత్యమును వాల్మీకిమహర్షి యేతీరునఁ దనకావ్యమునందు నిర్ధరించియున్నాఁడు?

(2) దశరథునకు, వృద్ధులగు నంధదంపతులవలన శాపము కలిగెనని తెలియకుండ నుండలేదు. ఆ శాపవశమున నాతఁడు పుత్రవియోగము నొంది మరణింపవలసియున్నదికదా! ఇఁక దశరథుఁడు తన మృతికిఁ గారణ మగు సంతానముకొఱకై యేల యంతకాలము పరితపించెను? సర్వసాధారణముగ లోకమునందుఁ బ్రతిమానవుఁడును మృత్యువును దప్పించుకొనుటకై కడుంగడు జాగరూకతతో వర్తించుట సహజము. ఎట్టి మందబుద్ధియుఁ గూడ తన మృత్యుకారణమునకై వెదకికొనఁడు. దశరథుఁ డట్టి మూర్ఖుఁడు కాఁడని మనకు వాల్మీకియే యీ తీరున బోధించుచున్నాఁడు.

శ్లో. పుర్యాం తస్యా మయోధ్యాయాం వేదవి త్సర్వసంగ్రహః
దీర్ఘదర్శీ మహాతేజాః పౌరజానపదప్రియః॥

శ్లో. "ఇక్ష్వాకూణా మతిరథో యజ్వా ధర్మపరో వశీ
మహర్షికల్పో రాజర్షి స్త్రిషు లోకేషు విశ్రుతః" 1-6-1, 2)

అట్టి "దీర్ఘదర్శి" యగు రాజర్షి యాత్మమృత్యుహేతువు లగు పుత్రులకై యేల యీ తీరునఁ బరితాపము నొందవలసివచ్చెను? దీనివలన దశరథపాత్రనుగుఱించి మన మేమి నిర్ణయింపఁగలము?

(3) నారదనుస్సంప్రాప్తి దేవరాతున కే తీరునఁ గలిగెనో జనకుఁడు తన యజ్ఞసందర్శనార్థ మరుదెంచిన రామలక్ష్మణ,విశ్వామిత్రుల యెదుట మహాపరిషన్మధ్యమున నీ తీరున వాక్రుచ్చెను:—

శ్లో. దేవరాత ఇతి ఖ్యాతో నిమే ష్షష్ఠో మహీపతిః
న్యాసోఽయం తస్య భగవన్! హస్తే దత్తో మహాత్మనాం॥
(1-66-8)

దక్షయజ్ఞవిధ్వంసానంతరము రుద్రుండు తనకు యజ్ఞభాగముల నివ్వ

నిచో 'వరాంగాణి మహార్హాణి ధనుషా శాతయామివః' అని బెదరింపఁగా, దేవతలు భీతులై యా రుద్రునకు యజ్ఞభాగములను గల్పించి యాతని సంతసింపఁజేసిరఁట. అటుపిమ్మట నా మహాదేవుఁడు తనకు భక్తుఁ డగుటచేఁగాఁబోలు నా విల్లును దేవరాతునివద్ద న్యాసముసేసె నని దేవరాతునకుఁ బదునాఱవపురుషుఁ డగు జనకుఁ డా వృత్తాంతమును సాకల్యముగ వంశపరంపరాగతముగఁ దెలిసికొని చెప్పియుండును. అదియటులుండ నా బాలకాండాంతమునందలి పరశురామగర్వభంగఘట్టమునందు శివధనుర్వృత్తాంతమునుగూర్చి భార్గవరాముఁడు పూర్వోక్తవృత్తాంతమునకుఁ గేవలవిభిన్న మగు మరియొక గాథ నీ తీరున వాకొనియుండెను!

శ్లో. ఇమే ద్వే ధనుషీ దివ్యే లోకాభివిశ్రుతే।

ఇత్యాదిగా రెండు ధనుస్సులు విశ్వకర్మ యొనరించి సమానసారములు గలవానినిగాఁ జేసి యం దొకదానిని త్ర్యంబకున కిచ్చె ననియు రెండవది "ఇదిదం వైష్ణవం రామ! ధనుః పరమభాస్వరం" మ్మని యా ద్వితీయధనువును విష్ణున కిచ్చె ననియుఁ జెప్పెను. అంత దేవత లా యిరువురియం దెవ్వ రెక్కుడు పరాక్రమవంతులో తెలియంగోరి యా శివకేశవులకుఁ గయ్యము పెట్టి రనియు నా యుద్ధమునందు శివునిధనువు విష్ణుమాయచే జృంభిత మయ్యె ననియు నందుచే యా శివునకుఁ గోపము వచ్చి తన ధనువు నటఁ బాఱవేయ నయ్యది శివుని చేతనే తుదకు దేవరాతున కొసంగబడిన దనియు నీ రీతిని వర్ణింపఁబడెను:-

శ్లో. జృంభితం తద్ధను ర్దృష్ట్వా శైవం విష్ణుపరాక్రమైః
అధికం మేనిరే విష్ణుం దేవా స్సర్షిగణా స్తథా
"ధను రుద్ర స్తు సంక్రుద్ధో విదేహేషు మహాయశాః
దేవరాతస్య రాజర్షే ర్దదౌ హస్తే ససాయకం" (1-76-19,21)

ఈ తీరున నొకేకాండమునందుఁ బది సర్గలయనంతర మొక విధముగను దత్పూర్వమున వేఱొకవిధముగను నా హరధనుర్వృత్తాంతమును గవి రచించుటకుఁ గారణ మేమి? అం దేది నిజము?

(4) ఇఁక నాల్గవది. అరణ్యవాసమునకుఁ బయన మగుటకుఁబూర్వము సీతాదేవి శ్రీరామాజ్ఞచేఁ దన సమస్తభూషణములను బ్రాహ్మణులకు నాశ్రితులకును దానము చేసియుండెను. అంతియకాక యామె యొక తపస్వినివలె నరణ్యమునందుఁ గాలము గడుపవలె నని శ్రీరామ చంద్రుఁ డీ తీరున బోధించియుండెను:—

శ్లో. "క్రోధలోభౌ విమోక్తవ్యౌ కర్తవ్యా తపసే మతిః"
(2-28-24)

శ్లో. "భూషణాని మహార్హాణి వరవస్త్రాణి యాని చ
రమణీయాశ్చ యే కేచి త్క్రీడార్థా శ్చాప్యుపస్కరాః॥
"శయనీయాని యానాని మమ చాన్యాని యాని చ
దేహి స్వభృత్యవర్గస్య బ్రాహ్మణానా మనంతరమ్.
(2-30_44-45)

అటు లాజ్ఞాపింపఁబడిన సీతామతల్లి తన సర్వాభరణములను బ్రాహ్మణులకు నాశ్రితులకు నిచ్చివేసెను:—

శ్లో. "తతః ప్రహృష్టా ప్రతిపూర్ణమానసా
యశస్వినీ భర్తురవేక్ష్య భాషితం
ధనాని రత్నాని చ దాతు మంగనా
ప్రచక్రమే ధర్మభృతాం మనస్వినీ" 2-30-47)

ఆ రీతిగఁ దన సర్వాభరణపరిత్యాగ మొనరించిన యా సీత, శ్వశుర గృహమునుండి యరణ్యవాసమునకుఁ బోవునప్పుడు, మఱల దశరథుఁ డొసంగిన యపూర్వము లగు భూషణములను దివ్యవస్త్రములను ధరించి యలంకరించుకొని రథారోహణ మొనరించిన ట్లీ తీరున వాల్మీకి వర్ణించెను:-

శ్లో. సా సుజాతా సుజాతాని వైదేహీ ప్రస్థితా వనం
భూషయామాస గాత్రాణి తై ర్విచిత్రై ర్విభూషణైః
"వ్యరాజయత వైదేహీ వేశ్మ తత్సువిభూషితా
ఉద్యతోఽంశుమతః కాలే ఖం ప్రభేవ వివస్వతః"
(2-39-17-18)

అట్టి విపరీతవేషభూషిత యగు సీతను జూచియే కౌసల్యామాత యీ తీరున నా యను నధిక్షేపించియుండెనుకదా !

శ్లో. "న కులం న కృతం, విద్యాం న దత్తం నాఽపి సంగ్రహం
స్త్రీణాం గృహ్ణాతి హృదయం అనిత్యహృదయా హి తాః॥
"సత్వయా నాఽవమంతవ్యః పుత్రః ప్రవ్రాజితో మను
తవ దైవత మస్త్వేష నిర్ధన స్సధనోఽపి వా॥"
(2-39-22, 25)

ఆ రీతి సీత యపూర్వప్రవర్తనకుఁ గత మేమి ? దానివలన సీతపాత్రపోషణమునందు వాల్మీకి యే తీరున నిర్ధరించెను ? శ్రీరాముఁ డా యలంకారములను వల దని యేల నిరాకరింపలేదు ?

5. చిత్రకూటమునుండి వెడలి, అత్రిమహర్షి యాశ్రమమునకు శ్రీరాముఁ డేఁగినప్పుడు మహర్షిపత్ని యగు యనసూయ సీత నామె కళ్యాణ మే తీరున నిర్వర్తింపఁబడె నని ప్రశ్నించెను. అప్పుడు సీత తన వివాహవిషయము నీ తీరున వర్ణించెను:—

శ్లో. "తతోఽహం తత్ర రామాయ పిత్రా సత్యాభిసంధినా
నిశ్చితా దాతు ముద్యమ్య జలభాజన ముత్తమం"
దీయమానాం న తు తదా ప్రతిజగ్రాహ రాఘవః
అవిజ్ఞాయ పితు శ్ఛంద మయోధ్యాధిపతేః ప్రభోః॥
(2-118-50, 51)

కీనినిబట్టి ధనుర్భంగమయినవెంటనే జనకుఁడు శ్రీరామచంద్రునకు సీత నీయఁసిద్ధ మయి జలకలశమును గొనివచ్చె ననియు నట్టితఱి రాముఁడు నిరాకరించి పితాజ్ఞ యగువఱకుఁ దానుద్వాహము నంగీకరింపననియుఁ జెప్పినటుల తేలుచున్నది. కాని సీతావివాహఘట్టమున హరధనుర్భంగము రాముఁడు కావించినవెంటనే జనకచక్రవర్తి దశరథునికొఱకు వర్తమానము నంపెనేగాని శ్రీరామునితో నెట్టి ప్రసంగము సేయుట కాని, జలకలశమును గొని సీత నిత్తును పరిగ్రహింపు మని యడిగినటుల గాని, వాల్మీకి రచించియుండలేదు. హరధనుర్భంగానంతరము జనకుఁ డీ కీతిగఁ గౌశికునితోమాత్రమే ప్రసంగించినటుల కానవచ్చుచున్నది:-

శ్లో. "మమ సత్యాప్రతిజ్ఞా చ వీర్యశుల్కేతి కౌశిక ॥
సీతా ప్రాణైర్బహుమతా దేయా రామాయ మే సుతా"
"భవతోఽనుమతే బ్రహ్మన్ శీఘ్రం గచ్ఛంతు మంత్రిణః।
మమ కౌశిక భద్రం తే అయోధ్యాం త్వరితా రథైః॥"
"రాజానం ప్రశ్రితైర్వాక్యై రానయంతు పురం మమ॥"
(1-67-23,24,25)

అచ్చటకు సీతను తెచ్చినటులకూడ నా ధనుర్భంగసందర్భమునఁ గానరాదు! ఇఁక ననసూయతోఁ దనపాణిగ్రహణవృత్తాంతమునుగూర్చి సీత యా తీరునఁ బలుకుటకుఁ గారణము దుహ్యూహ్యముకదా!

(6) సుగ్రీవుఁ డాంజనేయుని శ్రీరామలక్ష్మణులయొద్దకుఁ బంపునప్పుడు:—

శ్లో. మమైవాభిముఖం స్థిత్వా పృచ్ఛ త్వం హరిపుంగవ!।
ప్రయోజనం ప్రవేశస్య వనస్యాస్య ధనుర్ధరౌ॥" (4-2-26)

అనఁగా నీవు నా యాభిముఖ్యమును, అనఁగా స్థానమును వహించి యా నూతనవిలక్షణపురుషులు ధనుర్ధరులై యీ వనమునందుఁ బ్రవేశించుటకుఁ గారణమును బోయి యరయు మని చెప్పియుండెను. స్వభావముచే

సుగ్రీవుఁడు కొంత పిఱికిదనము చూపినను జాల యాత్మగౌరవము నభిమానమును గల వానరప్రభు వగుట నిర్వివాదము. అదిగాక కొంత యాడంబరమునందు విలాసములందుఁగూడ కాంక్ష గలిగిన ప్రభు వని మనము గ్రహింపఁగలము. అట్టితఱి నాంజనేయు లా రామలక్ష్మణులను జూచి వారితో నుచితాలాపముల నొనరించి తన ప్రభునియొద్దకు వారిని గొనివచ్చుటలోఁ దన భుజములపై వారి నెక్కించుకొని మోచికొని వచ్చుటలో నౌచిత్య మేమి? మంత్రి యై యుండియు నా తీరున హనుమంతుఁడు ప్రవర్తించుట తనకుఁగాని తనప్రభువునకుఁగాని గౌరవాపాదక మగు నని తలంచుట యుక్తమా? అయ్యది రాజనీతియా? అది యటులుండ, బుద్ధిమంతులలో వరిష్ఠుఁ డగు నాంజనేయులు భిక్షురూపప్రతిచ్ఛన్నుఁడై యా రామలక్ష్మణులయొద్దకుఁ బోయి వారివర్తనమును ప్రవృత్తమును బూర్తిగ వారు చెప్పుటకుఁబూర్వమె యాతఁడు తానొక భిక్షురూపప్రతిచ్ఛన్నుఁ డగు వానరుఁడ నని తన గుట్టును బయటపెట్టుకొనుటలో నర్థ మేమి?

(7) స్వయంప్రభావృత్తాంతము వలన రామాయణ కావ్యచరితార్థత కే విధమున సహకారము కలిగెను? ఆ వృత్తాంతమును జెప్పకుండినచోఁ గావ్యమునకుఁ గథాసందర్భమున లోపము వాటిల్లునా?

(8) మధువనభంగసందర్భమునం దంగదుఁడు వానరులకు మధుభక్షణమునకై యాజ్ఞ యిచ్చి యుండెను. సుగ్రీవుని కత్యంత హితుఁ డగు నాంజనేయు లట్టి కార్యమును నిజమునకు నివారింపవలసిన వాఁడు. ఏలయన మధువనము సుగ్రీవున కత్యంతప్రియ మగు ప్రమదావనము. ఆంజనేయుని ప్రభుభక్తి లోకప్రసిద్ధము. అట్టి సందర్భమునఁ దా నంగదునితో వల దని చెప్పుటకు మాఱుగ వానరులను యథేచ్ఛముగ మధువును గ్రోలుఁ డని హెచ్చరించుటయేకాక వారి నెవ్వరైన నడ్డగించినచో నట్టివారిని దాను నివారింతు నని యాంజనేయు లీ తీరున ధైర్య మొసంగెను:—

శ్లో. "తా నువాచ హరిశ్రేష్ఠో హనుమాన్ వానరర్షభః।
అవ్యగ్రమనసో యూయం మధు సేవత వానరాః॥"
"అహ మావారయిష్యామి యుష్మాకం పరిపంథినః॥"(5-62-1)

స్వామిభక్తియందుఁ బేరెన్నిక గన్న నయశాలి యగు నాంజనేయుఁ డా విధముగఁ దన ప్రభు వగు సుగ్రీవుని కత్యంతప్రియ మగు వనమును భంగ మొనరింపఁ బ్రోత్సహింపవచ్చునా ?

(9) యుద్ధము ప్రవృత్త మగుటకుఁ బూర్వము శ్రీరామచంద్రుఁడు రావణునకు రాయబారము నంపెను. ఆ రాయబారము నంపుటలో నాంజనేయుని బంపక ముక్కుపచ్చ లాఱనట్టియు, లంకాపట్టణ మానవాలెన్నఁడు నెఱుంగనట్టియు నంగదుని బంపుటలోని స్వారస్య మేమి? లంక నంతయుఁ బూర్తిగఁ జూచి రావణాంతఃపురమును, సభామంటపమును, గూడఁ గలయఁగనుగొన్న యాంజనేయుని వదలి యంగదుని బంపుటలోని రాజనీతి యేమి?

(10) సీత తన తపస్వినీరూపమున శ్రీరాముని సందర్శించి యా మహామహుని దన తాపసరూపమున నాలింగనము చేసికొనుటకై కాంక్షించుచుండె నని యీ తీరున నామె యాంజనేయునితో ననియుండెను:--

శ్లో. "యథా తం పురుషవ్యాఘ్రం గాత్రైః శోకాభికర్శితైః।
సంస్పృశేయం సకామాఽహం తథా కురు దయాం మయి॥"
(5-40-3)

ఇఁక రావణసంహారానంతరము సీతవద్ద కాంజనేయుని శ్రీరామచంద్రుఁ డంపినప్పుడు సీత యీ తీరున రాముని దర్శించుటకుఁ గుతూహలపడుచున్నటుల చెప్పఁబడినది:—

శ్లో. "ఏవ ముక్తో హనుమతా వైదేహీ జనకాత్మజా।
అబ్రవీ ద్ద్రష్టు మిచ్ఛామి భర్తారం వానరోత్తమ!॥"(6-116-49)

ఆ విషయమునే యథాతథముగ నాంజనేయుఁడు శ్రీరామచంద్రునితో

"భర్తారం ద్రష్టు మిచ్ఛామి కృతార్థం సహలక్ష్మణ''మ్మని సీత యభిప్రాయమును వెల్లడించియుండెను. కాని సీతామతల్లియభిప్రాయమునకుం బూర్తిగ వ్యతిరేకముగ శ్రీరాముం డాలోచించి తుదకు విభీషణుని బిలిచి:—

శ్లో. "దివ్యాంగరాగాం వైదేహీం దివ్యాభరణభూషితాం।
ఇహ సీతాం శిరస్నాతా ముపస్థాపయ మా చిరమ్॥"
(6-117-7)

అని యాదేశించుటకుం గారణ మేమి? అటుతరువాత నా యబలను దన కటు భాషణములచే నొప్పించుటకై యటుల రాముడు చేసెనం దుమా? తన యాజ్ఞచే శృంగారింపంబడిన సీతను "నహి త్వాం రావణో దృష్ట్వా దివ్యరూపాం మనోరమాం। మర్షయేత చిరం సీతే స్వగృహే పరివర్తినీం॥"అని యనంతర మధిక్షేపించుట తగునా?

ఈ రీతిగ ననేకక్లిష్టసమస్యలు చిన్నవియుఃబెద్దవియు నగు విషయములు శ్రీమద్రామాయణమునందు లెక్కకు మిక్కిలిగ మనల నెదుర్కొనుచుండును. ఆ యా సంఘటనములకు సమాధానములు నాకు సాధ్య మగునంతవఱకు యుక్తియుక్తముగను సహేతుకముగను నేను రచించుచున్న "శ్రీమద్రామాయణము మానవత్వప్రతిష్ఠ"యను వ్యాసావళియందుం బొందుపరుప నుద్యమింతును. పాఠకమహాశయు లాయా విశేషములను దమ కుచితరీతిని విమర్శించి తమయుపదేశములచే నన్నుఁ గూడ ధన్యుని చేయఁ బ్రార్థించుచున్నాఁడను.



# సాహిత్యము - తాత్త్విక సింహావలోకనము

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎమ్.ఏ., బి.ఎల్.



ఈశ్వరసృష్టి సౌందర్యదీపిత మైనది. ఆనందభరిత మైనది. భాస్వదాశయసంశోభిత మైనది. కావున నీశ్వరసృష్టిలోనే సాహిత్యసృష్టి కల దని తెలుపఁ జెల్లును. దానిని గుర్తించు కన్నులును దోడ్తోడనే రసానుభూతి నందఁజాలు హృదయములును సృజింపఁ బడెను. అద్భుత మైన సృష్టివర్ణన జ్యోతిర్మయ మైన వైదికవాఙ్మయమునఁ గలదు. నీల తోయదమండలి విద్యుల్లతను వజ్రపుఁదునకవలెఁ దూర్పుదిక్కునఁ గాంతిలు శుక్రతారను, ప్రాగ్దిశాఫాలతిలమున శోభిలు రక్తాభను, ప్రభాత ప్రభాకరమునుండి వెడలు స్వర్ణమరీచిగుచ్ఛమును, వీక్షించి తొల్లింటికవులు రసభరితహృదయు లైరి. శుభ్రజ్యోత్స్న సోఁకినపుడు ప్రఫుల్లముఖు లగు కైరవములను రవి గోచరించునపు డానందానుభూతి నందు పుండరీకములను బరిశీలించి వారు పులకితశరీరు లైరి. మధురము లైన శకుంతగీతికలు శ్రుతిగోచర మైనప్పుడు తన్మయత్వముతో వారు నృత్య మొనరించిరి. వారసూక్తులు స్వరయుక్తము లై భావబంధురకవితాధార లైనవి.

వైదికవాఙ్మయము వనవీథులందుఁ బుట్టెను. సుప్రసిద్ధసంస్కృతకావ్యము లరణ్యములం దుద్భవించెను. వనసందేశము (The message of the forst) అను గ్రంథములో రవీంద్రుఁ డీ విషయమును విపులముగ వివరించెను.

"మననధ్యాననిదిధ్యాససమాధులందే మహాకావ్యము నుదయించును. ఏకాంతమునఁ గాని యీ రీతి సాధన సాధ్యము కాదు. మతగ్రంథము లుల్లేఖించు సాధన యిట్టిదే. తత్త్వశాస్త్ర మతశాస్త్రము లుత్తమసాహిత్యమున కుదాత్తభావశబలతను బ్రసాదించునుగదా!

స్వర్ణయుగముగ నిర్మించెను. సముద్రగుప్తుని విజయకీర్తులను చాటుచున్న స్తంభము, ఆ కాలమందలి నాణెములు నాఁటి యితిహాసము తెల్పుచున్నవి. బొంబాయికిఁ గొంత దూరమున నున్న యెలిఫెంటాగుహాలందలి త్రిమూర్తి విగ్రహము, తక్కిన విగ్రహములు గంభీరభావగర్భిత శిల్పమును నేఁడును మన కన్నులముందు నిల్పుచున్నవి.

రెండవ చంద్రగుప్తుఁడే విక్రమాదిత్యుఁడు. కాళిదాసుని కాలములోనివాఁడని పరిశోధనలవలన గ్రహించుచున్నాము. విక్రమాదిత్యుఁడు బహుభంగుల వాగ్దేవి నారాధించెను. మగధలో విక్రమశిల విశ్వకళాపరిషత్తును స్థాపించినవాఁ డితఁడే. ఇతని యాస్థానమందే కాళిదాసు మహాకవి యయి యుండెను. రసభావమై యౌచిత్యసమన్వితమై వ్యంగ్యభూయిష్ఠమై యుదారాశయసంభరితమై సౌందర్యసంశోభితమైన కృతులను, ఆ మహాకవి రచించెను. గాథె మున్నగు పాశ్చాత్య మహాకవులు కాళిదాసును బహుభంగులఁ గీర్తించిరి.

గుప్తసామ్రాజ్యపతనము హూణాక్రమణమున నారంభమై ఘోరావలుంఠితమైనది. క్రీ. శ. 575 సంవత్సరమున హూణులు (Huns) తక్షశిల విశ్వకళాపరిషత్తును విధ్వంసము చేసిరి. స్కంధగుప్త, కుమారగుప్తులు దుర్నీతుల బాఁడి నశించిపోయిరి. తోరమాణుని కుమారుఁడై విజృంభించిన మిహిరకులుని యశోధర్మ కూలార్చెను. కాన్యకుబ్జలో సాహిత్యసమితిని [illegible] వెలసెను. భవభూతిప్రభృతులు వాగ్దేవికిఁ జక్కని కైసేఁతలను సమర్పించిరి.

భవభూతి యాంధ్రుఁడు. గోదావరీతీరమునఁ బుట్టెను. మన వాఙ్మయచరిత్ర నంతను ఈ వ్యాసమున వ్యక్తీకరించుట సాధ్యము కాదు. మహోత్కృష్టమైన సాహిత్యసృష్టి జగతిలో నెప్పుడెప్పుడు సృష్టి యగునో తెలిపి సత్యసందీపిత సాహిత్యసూత్రములకు సముచిత దృష్టాంతములను సంక్షేపముగఁ దెలుపుట నా ప్రస్తుతాశయము.

ఆర్యమతమువలెనే బౌద్ధ జైన మతములును బూర్వోక్తరీతిని ప్రజాజీవితమందును, పెక్కు తెలుఁగులశిల్పమందును వ్యక్తమాయెను. కథాగతమహావీరుల యద్భుతత్యాగము, నీతిసందీపితప్రబోధ మొకప్పుడు సభ్యజగతిదృష్టి నాకర్షించెను. పృథ్వీహృదయములో మహత్తర మైన సంచలన ముద్భవించెను. ఈ సంచలనమున గురుతర మైన భారతీయ సంస్కృతి తలసూపెను. అజంతాయెల్లోరాగుహలును, బాదామీగుహలును, భారతదేశమందే కాక, సుమిత్రా, జావా, బాలీ, కెంబోడియా, బర్మా, సింహళ, టిబెట్టు, జపాను, కొరియా మున్నగు గుహాలయములును, వివిధసారస్వత గ్రంథములు నా నాఁటి భారతీయ సాంస్కృతిక ప్రభావమును వ్యక్తీకరించుచున్నవి. అదే సమయములోఁ జైనాలో కన్ఫ్యూషియస్, లావోటిజో లను ప్రవక్తలును, గ్రీసులో నైథాగరసను మహనీయుఁడును బుట్టుటచేఁ బ్రాచీప్రతీచీఖండములం దద్భుతములైన సంచలన ముదయించెను. యుగపురుషు నమసరించి తలలెత్తు మహోద్యమ మెట్టిసైజ్ఞానిక సాంఘిక సాంస్కృతిక ప్రభావమును జగతిపై సృష్టింపలేదు? ప్రపంచసారస్వతచరిత్ర యీ వ్యాసములో నెట్లిముడును?

అశోక కనిష్క శ్రీహర్షులును, ఆంధ్రవసుంధరలో శాలివాహన చక్రవర్తులు మున్నగువారును బౌద్ధమతమునకు విశేషప్రోత్సాహమును బ్రసాదించిరి. ఆర్యావర్తమందును, కర్ణాటక, తమిళ, కేరళ సీమలందును తెలుఁగునేలలో హనుమకొండ ప్రాంతమందును బౌద్ధ జైన మతములు విజృంభించినవి. ఆ యా తావులందు బౌద్ధ జైనసారస్వతములు సృష్టియాయెను. నాగార్జునుఁడు మహాయాన బౌద్ధశాఖను స్థాపించి సంస్కృతమునందును, పాళీభాషలలోను బహుళగ్రంథములును రచించెను. కనిష్కుని యాస్థానమందలి యశ్వఘోషు 'సౌందరనంద' మను నొక మహాగ్రంథమును రచించెను.

జనసామాన్యమున భావసంచలనమును బుట్టించుట పూర్వోక్త మతములయుద్దేశము. కావునఁ బాళీప్రాకృతభాషలందు మేలిసాహితి

వృష్టైను. జైనమత మొక్క భాషలోఁ గాక వేఱువేఱు రాష్ట్రభాష లందు వ్యక్త మాయెను.

ఆంధ్రసీమలో బౌద్ధమత మైదునూఱులయేండ్లు వెలసెను. ఆర్ష సంస్కృతి విస్తరించినపుడు సంస్కృతశబ్దముల తెలుఁగుభాషలోఁ జేరినట్లు బౌద్ధసంస్కృతి విజృంభించినపుడు పాళీప్రాకృతపదములు మన వాఙ్మయమునఁ బ్రవేశించినవి.

బుద్ధజీవితమందలి ప్రేమసందేశమును శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారును, శ్రీ తిరుపతి వెంకటకవులును, శ్రీ పింగళి కాటూరి కవులును, శ్రీ ధూళిపాళి శ్రీరామమూర్తిగారును, పెద్దాపురమున నెలకొనిన బౌద్ధసాంస్కృతిక సమితిలోని మిత్రులును, ఆంధ్రవాఙ్మయమునఁ బ్రకటించుట ముదావహము.

పాళీవాఙ్మయమందలి 'యర్థకద'కుఁ దెలుఁగున వ్యాఖ్యానము వ్రాయఁబడె నని 'బుద్ధఘోష్' చెప్పినట్లు కలకత్తావిశ్వకళాపరిషత్తులో నాకుఁ బాళీప్రబోధకు లైయుండిన బౌద్ధభిక్షువులు తెలుపువారు. 'బుద్ధఘోష్' పఠాణశకమున నైదవశతాబ్దిలోనివాఁడు. 'అర్థకద'కుఁ దెలుఁగున వ్యాఖ్యాన మప్పటి కైదునూఱేండ్లమున్ను వ్రాయఁబడెనఁట. తెనుఁగుసాహిత్యమును గుఱించిన ముఖ్యాంశ మిది యనుట నిశ్శంసయము.

తెలుఁగు, తమిళము, కన్నడము, మళయాళము, దక్షిణాపథమందలి ప్రధానభాషలు. ఆంధ్రము ద్రావిడసంప్రదాయమునఁ బుట్టినదో లేక సంస్కృతసముద్భవమో సమీక్షించుట కిచట తావు లేదు. ప్రపంచమందలి ప్రధానభాషలనుండి శబ్దసామగ్రిని జేర్చికొని నిత్యసౌష్ఠవమునఁ బెంపారుట యాంగ్లభాష కెట్టిసహజశక్తి యైనదో తెలుఁగునకును నట్టిశక్తికలదు-సంస్కృతముపైఁ దెలుఁగు తనప్రీతి చూపించినది. మన యూహలును, మన జీవితమును మన యాచారములును, వేదకాలమున

మహాయానము లున్నవి. నర్మదాయుద్ధములో నాలువందలయిరువది సంవత్సరమున నీతఁడు శ్రీహర్షుని నోడించెను. ఆర్షబౌద్ధధర్మములను సమానదృష్టితో వీక్షించి రత్నావళి, ప్రియదర్శిక, నాగానంద నైషధ కృతులను రచించిన రాజర్షి శ్రీహర్షుఁడు. శ్రీహర్షునిసాహిత్యప్రీతి చాళుక్యులహృదయమును స్పృశించెను. కళ్యాణీ చాళుక్యులు బిల్హణకవిని బోషించిరి. ఈ కవి రచించిన 'విక్రమాంక' కృతి లోకప్రశస్తి నందినది. రెండవ పులకేశితమ్ముఁడు విష్ణుకుబ్జవర్ధనుఁడు తూర్పుతీరమున జయపతాకమును నిలిపెను. క్రీస్తుశకము 613 లో వేంగివిద్యాపీఠమును నెలకొలిపెను. భారవి వేకదిఙ్నాచార్యులీ పీఠమునఁ బ్రధానబోధకులు. సంస్కృతపాళీసాహిత్యము లిందు వృద్ధి నందెను. సుప్రసిద్ధ చైనాయాత్రికుఁడు 'యువాన్ చాంగ్' ఇచ్చటఁ గొంతకాలము మంతేవాసి యై యుండెను. వేంగీనుండి రాజమహేంద్రవరమునకుఁ దూర్పుచాళుక్యులు తరలినయనంతర మార్షసంస్కృతిని బహుభంగుల నుద్ధరించిరి. 14 12, 13 శతాబ్దములనడుమ తూర్పుతీరమున బహుళదేవమందిరములు నిర్మింపఁబడినవి. తోడ్తోడనే వాఙ్మయమందిరము సుస్థిర మైనది. రాజనరేంద్రభూపాలుని ప్రోత్సాహము ననుసరించి, నన్నయ్యమహాకవి భారతాంధ్రీకరణము నారంభించెను.

నన్నయ్య వెనుక వృద్ధియైన చారిత్రకప్రభావమును గుర్తించినపుడే ఆర్షధర్మసముద్ధరణకాంక్షను గ్రహించినపుడే నన్నయ్యకవితలోని మహిమను హృదయంగమ మొనరించుకొందుము. వ్యక్తిశక్తికి కాలవాతావరణమందలి నైతికవైజ్ఞానికప్రభావము తోడైనపుడే యుత్కృష్టకృతు లుదయించును.

కాకతీయచక్రవర్తులు, మనుమసిద్ధిప్రభువు, రెడ్డిభూధవులు, విజయనగర, తంజావూరు, మధుర, పుదుకోట పాలకులు, ఆంధ్రభారతిని

బహుళభంగుల సేవించిరి. తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథ, పెద్దన, సూరన రామ రాజభూషణ ప్రభృతు లుద్గ్రంథములను రచించిరి. ఏకశిలానగరపరిస రమునం బోతన, సోమనాథ, అష్టకవిప్రభృతులు తెలుఁగుతల్లికి మేలిసుమ ములను సమర్పించిరి. చేమకూర వేంకటకవి త్యాగరాజులు తంజావూ రులో సాహిత్యసంగీతసామ్రాజ్యములందు సమాశ్రితులై యుండిరి.

శైవ, వీరశైవ, వైష్ణవమతోద్యమములు విజృంభించినపుడు దక్షి ణాపథమందును, ఆర్యావర్తమందును, అద్భుతమైన సాహిత్యము సృష్టి యాయెను. కవిత్వకళతోఁ దక్కిన లలితకళలును వృద్ధియగుచుండె నను విషయములు మనము విస్మరింపరాదు. శ్రీరామానందవల్లభాచార్యనిం బాదిత్యులు దక్షిణాపథమునుండి పోయి యార్యావర్తమందును, ఘూర్జర సీమ రాజస్థానమందును వైష్ణవమతప్రబోధము చేసిరి. వీరిలో వల్లభ నింబాదిత్యు లాంధ్రులు. వీరి ననుసరించి మహాకవు లెందరో హిందీ భాషలోఁ బెక్కుగ్రంథములను రచించిరి. వీరిలోఁ గొంద ఱాంధ్రు లుం డిరి. సుప్రసిద్ధ రామభక్తుఁడు తులసీదాసు రామాయణమును రచించెను. వంగదేశములో గౌరాంగస్వామి భక్తితత్త్వమును, సంకీర్తనమహిమను బోధించెను. నూతనసాహిత్యము సృష్టి యాయెను. జయదేవుఁ డోఢ్రసీ మలోఁ, జంగదాసకృత్తివాసతీర్థులు బంగాళమున మహాకవులైరి. కృత్తి వాసులరామాయణము వంగదేశమునఁ బ్రసిద్ధి నందినది.

వీరశైవమహోద్యమము కర్ణాటకమునుండి తెలుఁగునేలలో వ్యాపించినది. బసవేశ్వరమహిమ విస్తరించినది. పాల్కురికి సోమనా థుఁడు బసవపురాణమును రచించెను. పండితారాధ్యచరిత్రము సుప్రసిద్ధ గ్రంథమే కదా !

ఆంధ్రవాఙ్మయసింహావలోకనమున గోచరించిన యుగము లివి. నన్నయకాలమునుండి తిక్కనాదులవఱకు వ్యాపించినది. ఆదియుగము. క్రీ.శ 1050నుండి 1450 వఱకు నిది నడచినది. ఆంధ్రమున భారతరామా

యణభాగవతాది మహాగ్రంథము లప్పుడు సృష్టి నైనవి. తిక్కన, సోమ నాథుఁడు, ఎఱ్ఱాప్రెగడ, నన్నిచోడుఁడు, మంత్రిభాస్కరుఁడు, నాచనసో మఁడు, శ్రీనాథుఁడు, పోతరాజు ప్రభృతులు లప్పటివారు. క్రీ.శ. 1500నుండి 1750వఱకు వ్యాపించినది మధ్యయుగము. కృష్ణదేవరాయలనాఁటినుండి అష్టకవివఱకు నిది విస్తరించినది. స్వతంత్ర రచన మపుడు సాగెను. పెద్దన, తిక్కన, సూరనాదు లప్పటి మహాకవులు. క్రీ.శ 1750తరువాత ఆంగ్లవిద్యవలన నాధునికయుగ మారంభ మైనది. ప్రాచీనసంప్రదాయ మును సంరక్షించువారును, నూతనరీతి రచనములను గావించువారును, భారతదేశమునవివిధరాష్ట్రములందు గోచరించిరి. బంకిమ్‌చంద్ర ద్విజేంద్ర శరచ్చంద్రప్రభృతులువంగదేశమునఁ బ్రసిద్ధకవులైరి. కందుకూరి వ్రాది చిలకమర్తి శ్రీపాద మహాకవులు పలువురకు మార్గదర్శులైరి. నవ్య కవు లభ్యుదయకవులు విశేషోత్సాహముతో సాహిత్యసేవ చేయు చున్నారు.

కవులదృష్టిలో నుండవలయు లక్ష్యము విశ్వశ్రేయస్సు. భౌతిక శాస్త్రసూత్రములను దుర్వినియోగ మొనరించును యుద్ధనాయకులు విశ్వవాతావరణమును విషాక్త మొనరించుచున్నారు. సత్యవ్రతమును, అహింసోపాసనమును, శాంతిస్థాపనమును, గురుతులగు మహాకవులు మనుష్యహృదయమున సముచితస్థానము గల్గించు గద్య పద్యకృతులను రచించి లోకోపకార మొనరింతురుగాక!

# పెద్దన కవితాశిల్పము

శ్రీ చిలుకూరి వీరభద్రశాస్త్రి

నాఁడు నేఁడు విజ్ఞులు మొదలు అజ్ఞులవఱకుఁ బండితుల మొదలు స్త్రీలవఱకుఁ దెలుఁగులు వ్యవహారమునసైతము "కూకటుల్ గొలిచి చేసిన" పెండ్లి "అన్నపూర్ణకునుద్దియౌ సతినిగృహిణి" "కుటుంబ జంబాల పటలమగ్న మాదృశగృహమేధి" "ఎవ్వతె వీవు" "ఇంతలుకన్నులుండ" "ఆనందో బ్రహ్మయటన్న" "సంమునుడిమాయలు మగవారికృత్యముల్" "క్షణక్షణముల్ జవరాండ్రచిత్తముల్" "కన్నులఁ గావె కూటముల్" మొదలగు మనుచరిత్ర పద్యముల నుదాహరింపకుండనుండ రనిన నతిశయోక్తి కానేరదు.

ఇరువదియవశతాబ్దిలోఁ గొంత క్రొత్తకవిత్వము మొలచూపి క్రొత్తభూమికలతోఁ దన ప్రాభవము చూపి, లోకమును గ్రొత్తదారుల త్రొక్కించినను బరభాషాయోషావ్యామోహమువలన మాతృసేవానైస్పృహ్యముచేఁ దెలుఁగులను దెలుఁగుఁదనము చాలవఱకు సన్నగిల్లినను, నవలాలోకము మెండై, పత్రికాప్రాభవమువలనఁ బద్యపరిమళాస్వాదపాటవము సర్వమంగళమైనను, సహృదయలోకమున వారికి వీరికి రసపిపాసువులకు నుపాస్యసాహితీలక్ష్మిలో మేటితనమును గోల్పోవనిది తెలుఁగుచరితలలో మనుచరిత్ర మొక్కటియే!

దీనివలన మిగిలిన తెలుఁగుబాసలో గ్రంథములకు విలువలేదని కాదు. ప్రాచీనసాహిత్యస్రష్టలలోఁ బ్రతికవి సాహిత్యాంబరమున ధ్రువతారమై వెలుఁగొందుచునేయున్నాఁడు. అట్టివారిగ్రంథములే నేఁటికిని జిక్కఁగనున్నవి. వెనుకటి కవులలో [illegible]న-ఎఱ్ఱాప్రెగడ-శ్రీనాథాదులను-భిన్నభిన్న భావోపాసకు[illegible]లొక్కొక్కరిని దమకవిగా నొనర్చుకొని వేర్వేఱుగ నుపాసింతురు. T. 197....

సర్వథా శృతికలిపి విశాలాంధ్రజనాహ్లాదముగా మధురసాహితీ గానము నొనర్చి తెలుఁగుల సర్వతోముఖాభిమానమును జూఱఁగొనినది మనుచరిత్ర మనుట తథ్యము. నవ్యకవితాయుగారంభమువఱకు మనుచరిత్రమునకుఁ బ్రతిబింబము లగు ప్రబంధములే పరశ్శతములుగా వెలువడినవి యనునది సాహిత్యోపాసకులకు విదితతరము. సాహితీలక్ష్మి నైపథ్యాంతర్వర్తినియై శ్రీనాథునియుగమున నొకకేలు ప్రాచీనపురాణప్రబంధలమీఁద నొకకేలు అంగీకృతశృంగారోద్గారయై ప్రౌఢప్రబంధలమీఁద వైచి యేపక్షావలంబినియై యుండవలయునో తెలియక బేలయై యున్న స్థితిలోఁ బెద్దన ప్రౌఢయై యాబాలను ప్రబంధ ప్రబంధముల వైపే మరఁగించి పురాణరుచిని మొఱఁగించి ప్రబంధ ప్రబంధల యధీనము కావింప నొనర్చిన భగీరథ ప్రయత్నముతో నాంధ్రకవితాపితామహుఁడై పోయెను.

సంస్కృతప్రాచుర్యమే—కథాసృష్టి రసదృష్టి అనదు; అని నన్నయ్యను, పాత్రచిత్రణమే—సంస్కృతిదృష్టి వాక్యసృష్టి. అంకు నిండు కొన్నది అని తిక్కయజ్వను, ప్రౌఢ సంస్కృతబంధుర పదబంధమే—ఉదాత్త భావ సమృద్ధి, శిల్పసౌకుమార్యము మృగ్యము, అని శ్రీనాథుని ఒక తరగతికిఁ జేర్చి యనువాదసాహితిలో సరసశిల్పనైపుణి యెటులు సృష్టమగు నను సాహసికులఁ బరికరబంధముతోను జిడిముడిపాటుతోను బెద్ద యెలుఁగున కా దనవలసి యుండును.

ఒక నాటకకళలో—గానము— సాహితి— అభినయము— వాద్యము— చిత్రకళ— మొదలగు కళ లన్నియు నిమిడి భావుకుల ముగ్ధుల నొనర్చును. పెద్దన యటులనే సర్వకవికవితాహృదయమధుర ధారలఁ దన మనుచరిత్రమునఁ జొనిపి సాహితిని జీవత్స్రవంతినిగాఁ జేసిన శిల్ప ప్రభువు.

"ప్రాఁతమెఱుంగులుఁ" "సంస్కృతంబు" అని కవితాలక్ష్మీ సంపదను ముద్దు లొలుకునటులుగా లక్షణసమన్వితగాఁ బలికి పలికినపలుకు సరసముగ నిలఁ బెట్టికొనిన కవితెల్లజుఁడు.

కావ్యనిర్మితికి మధురభావనాపాటవము, లోకానుభవము, రసజ గన్నిర్మగ్నత, ముఖ్యములు. కళలన్నిటఁ బరిణతి యావశ్యకము. కవితలో శబ్దము భావము సమప్రధానములై యుండుట సమగ్రసామగ్రి. ప్రపంచ పరిశీలన మత్యవసరము. శాస్త్రకావ్యనాటకాదిపరిశీలన ముండవలె ననుట పిష్టపేషణకల్పము. ఇన్ని సామగ్రు లొక-చోటఁగూడిన నాఁతఁడు కవిమాత్రుఁడే కాఁడు. ఋషికంటె నధికుఁడు. శిల్పిసమ్రాట్టు.

కవితాసృష్టి చిన్న ప్రపంచసృష్టి. అతని ప్రపంచము మధురాతిమధురము. అతని సృష్టిలో రసస్యంది గాని పదము భావమునకు స్థానము రాదు. నీరసముగ నేదియుండదు. అతఁడేమన్నను యుగయుగములవఱకు ననురణనధ్వను లీనుచు మారుమ్రోఁగుచుండును. రక్కసహృదయుఁ గల్పవృక్షమై చెలఁగును. సక్కసహృదనే వేనోళ్ల గానము సహృదయులు చేయుదురు. జడచేతనములు రెండు సమప్రాధాన్యము వహించి చరించును. సిద్ధహస్తునకుఁ దనకృతి కనుపాదేయము లేదు. మనుచరిత్రకారుఁడు పెద్ద శిల్పి. ఈతని కావ్యమున శబ్దము భావము—రెండు సహామహామికగాఁ బరుగులు వాఱినవి. అన్నిటికంటె నితని కావ్యమునఁ బ్రాథమ్యము శిల్పమున కెక్కువ.

శిల్పి కుంచెల,రంగుల సాధనముగ నొనర్చుకొని, మృద్దారులోహాదుల నవలంబముగాఁ గొని శిల్పచిత్రణమునకుఁ గడంగును. తాను సృష్టించు శిల్పములఁ బ్రకృతియొక్క బాహ్యాకారమును రూపొందం జేయును. అయ్యదియైన సమగ్రముగఁ జేయఁజాలఁడు. అంతరభావములను జిత్రించుట యే శిల్పివశము కాదు. ఒకచో భావము నొక దానిని జిత్రింపఁగలిగినను రేఖామాత్రముగఁ జిత్రించునుగాని యనంతభావము

లను జిత్రింపలేదు. వలనుపడదు. ఆ శిల్పమునన్నైనను లోపములే యుండును. కవిత యట్లుగాక చాలవఱకు నాంతరభావములను జిత్రింపఁగలదు. కవితల్లజుఁడు భావపరంపర నొక్క పద్యమున నొక్క వాక్యమునను జిత్రింపఁగలఁడు. ప్రకృతిని దన యిచ్చవచ్చినరీతిని జిత్రింపఁగలఁడు. బాహ్యాభ్యంతరములఁ జిత్రింపఁగలఁడు. కావున అందఱ శిల్పులోఁ గవి గొప్ప శిల్పి.

ఇతరశిల్పులు బాహ్యప్రకృతిని నున్నదియున్నటుల రూపొందించిన శిల్పి యగును. కవి యంతమాత్రమేగాక యాంతరభావముల నెంతో చక్కఁగ రూపొందింపఁగలఁడు. కావుననే యతఁడు శిల్ప ప్రభు వగును.

ఆ మం దిడి యతఁ డరిగిన
భూమీసురుఁ డరిగెఁ దుహినభూధరశృంగ
శ్యామలకోమలకానన
హేమాఢ్యదరీఝరీనిరీక్షాపేక్షన్,

అను పద్యమునఁ బెద్దన హిమభూధర మెటు లున్నదో రేఖారూపమునఁ జిత్రించినాఁడు. దిడి_తఁడ-రుఁడ, శ్యామల- కోమల; దరీ-ఝరీ, నిరీ ఈరీతి శబ్దములు తెలుఁగుఁదనమున కున్న ప్రాస. కన ప్రాస. బ్రాహ్మణుఁ డుదాత్తపురుషుఁడు. కావుననే భూమీసురుఁడు వెడలునది సురావాసము. అచ్చట భూసురునకు స్థాన ముండును. మున్ముందు ఘట్టమునకు సురాంగనాసందర్శనము ప్రాతిపదిక. కావున సురత్వము ప్రతిపాదితము. చేరునది యుదాత్తపురుషుఁ డుదాత్త పర్వతమును. అదియు సురత్వముకంటె భూసురత్వము శ్రేష్ఠ మయినటులు పైభాగముకంటె నడుగు భాగముననే వ్యాసము భరము కలది. పాఁతు కలది. పోవంబోవ ౘరువు-వ్యాసము-పోయి లఘువుగ నుండు ననునది భూ- ధ - ర - అను నక్షరములతోఁ బద మభివ్యక్తము చేయుచున్నది. తుహిన — మంచు కొండకుఁ బోవ దంతములంటికొనిపోవును. లోలో న - హ - పుట్టును.

గొంతుకపట్టును. హా కంఠస్థానము కలది. నాభినుండి వెడలి-దంత - మూర్ధ ములఁ బ్రాకునటులు పర్వత మున్నది. శృంగము శృంగాక్షరోచ్చార ణము తోఁపట్రముగాఁ బైకి తేలుచుండును. 'శ్యామల' తాలవ్యోచ్చారణ కలిగి వ్యాసము కలదై గుసగుసలాడు చీకటులు కలదిగ నుండును. కోమల-కాననము లెగుడుదిగుడు కలిగియున్నను మృదుమధురధ్వను లతో నలరియుండును. అచ్చటి దృశ్యములు 'దరీ - ఝరీ'-లు మొదట కొలఁది ప్రమాణ మున్నను, పోయినకొలఁది తూఱినకొలఁది - రీ - వలె దీర్ఘదీర్ఘమై యున్నవి. భావికథలో సెలయేటికాలువలవెంటఁ బూయు మల్లియ లల్లిబిల్లిగొనిన దరిలో నున్న గుహాలోఁ బ్రవరుఁడు వాసనా ప్రేరితుఁడై ప్రవేశించును. అదియే మనుచరిత్ర మను పునాది. వీని నన్నిటిని నెదలో నిడికొని వానిని సూచింప నిచ్ఛ పెద్దనకు. పద్యము నీ రీతి సులలితముగఁ రేఖారూపముగ - వ్యంగ్యగర్భముగఁ జెప్పి - ప్రథమాశ్వాసమును సమాప్తి చేసినాఁడు. కథ నంతను వ్యంగ్య రూపమునఁ జిత్రించినాఁడు సహృదయవేద్య మది హిమభూధరమునఁ జూడవలసిన దృశ్యములుకథానుబంధములఁ దెలిపినాఁడు. తుహినగిరి యెటు లున్నది చెప్పినాఁడు. ఎచ్చట నే యక్షర ముంచవలెనో యా యక్షరరమ్యత తెలిసి మెలఁగెను. ఈ పద్యమునకే భాష్యముగాఁ జేసి నాఁడు ద్వితీయాశ్వాసము మొదలిడి.

"వృ=వర్ణనే" అను ధాతువునుబట్టి వర్ణనమే కావ్యమునకు ముఖ్యము. కావ్యములు వర్ణనాత్మకముగనే యుండును. అయ్యది సహజ ప్రకృతిని పీడకిచో నయ్యది శిల్పమై వెలుఁగొందును.

చంచచ్చంద్రకరస్పర్శహర్షోన్మీలితతారకం
అహో రాగవతీ సంధ్యా జహాతి స్వయ మంబరం - (వాల్మీకి రామాయణము.) చంద్రుఁ డుదితుఁ డయ్యెను అతనికిరణములు తీఁగ సాఁగుచున్నవి. నక్షత్రములు మొలతెంచుచున్నవి. సాంధ్య రాగ

మాకసమునుండి తొలఁగి క్రిందిక్రిందికి జాఱిపోవుచున్నది ఇది ప్రకృతి ప్రకృతి.

కావ్యతాసిద్ధికి :— సాంధ్యస్త్రీ చంద్రుని (ఆహ్లాదకుని, రసికుని) కరస్పర్శ నొంది సంతోషముతో నల్లగుడ్డను గ్రిప్పికొనుచు మైక ముతో రాగిణియై తనంతటానే కట్టినబట్టను విడిచివైచుచున్నది. ఏమయా యిది! ప్రకృతికవిత యీ రీతి యేకమైనపుడు శిల్పికవి.

పెద్దనకూడఁ బ్రవరవరూధినుల ప్రప్రథమప్రవేశఘట్టమున నేమి, మ ఱేడ నేమి, జాగరూకుఁడై చిత్రించినాఁడు.

"విద్యుల్లతావిగ్రహక్-శతపత్రేక్షణ-చంచరీకచికురక్ - చంద్రాస్యఁ జక్రస్తనిక్-నతనాభిక్-నవలా నొక్కానొకమరున్నారీశిరోరత్నముక్"

ఈ రీతిగ వర్ణించి వర్ణనాశిల్పముల నొకచోఁ బ్రోగువేసెను. ఇది వరూ ధిని వైయక్తికశిల్పము. ప్రవరుని జూచిన వరూధిని భావబంధుర మైన శిల్పమున కడు గిడిన.

అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింపఁ, గాంతిపె
ల్లుబ్బి కనీనికల్ వికసితోత్పలపంక్తులఁ గ్రుమ్మరింపఁగా
గుబ్బమెఱుంగుఁజన్గవ గగుర్పొడువన్ మదిలోనఁ గోరికల్
గుబ్బటిలంగఁ జూచె నలకూబరసన్నిభు నద్ధరామరుక్
దూచి ఝుళంఝుళంత్కటకనూచితవేగపదారవింద యై
లేచి కుచంబులుం దుఱుము లేనడు మల్లలనాడ నయ్యెడక్
బూచిన యొక్క పోఁకనునుబోదియఁ జేరి విలోకనప్రభా
వీచికలం దదీయపదవీకలశాంబుధి వెల్లిగొల్పుచుక్.

అని దివ్యకవితాసృష్టి నొనర్చినాఁడు. అబ్బురపాటునఁ గాంతిపెల్లుబ్బునః వికసితోత్పలపంక్తులఁ గ్రుమ్మరించునయనాంబుజములఁ జిత్రించుట శిల్ప సాధ్యము కాదేమొ! పద్మములను గలువలను శిల్పమునిండ నింపి యిదియే యీపద్యభావశిల్ప మనవలసినదే. ఆమె మదిలోన గుబ్బటిలిన

కోరికలఁజిత్రించుట వలనుపడునది కాదు. ఝళంఝళత్కటకవత్పాదశిల్పమే శిల్పికి సంభవము! కవియే వరూధినీత్వము నంది వ్రాయవలసిన దేయీా ఘట్టము. పై పద్యములలో మధురిమ- వర్ణనావైదగ్ధ్యము-భావోజ్జ్వల్యము - పదవిన్యాసము - శిల్పచిత్రణము - అన్నియుఁ బరాంకోటింబ్రాప్తము లెటు లలవడెఁ బెద్దన కని ప్రశ్నించిన :—

బాలాకటాక్షసూత్రిత మసతీనేత్రత్రిభాగకృతభాష్యం
కవిమాణవకా దూతీ వ్యాఖ్యాతీ మధీయతే భావం॥ అనియు
ఆస్వాదితదయితాధరసుధారసస్యైవ సూక్తయో మధురాః
అకలితరసాలముకులో న కోకిలః కల ముదంచయతి॥

అనియు గోవర్ధనోక్తులుఁ

శృంగారీ చేత్కవిః కావ్యే సర్వం రసమయం జగత్
సఏవ వీతరాగ శ్చేన్నీరసం పరివర్తతే॥ అను ఆనందవర్ధనుని యుక్తియు సమాధాతృలు.

కవి శృంగారి కానిచో నింతసునిశితముగ భావింపలేఁడు. సౌందర్యోపాస్తి లేనినాఁడు చూపులచూపు, వానిమాధుర్యోద్గారము - వ్యక్తులకుఁ జుఱుకుఁదనము - హొయలు మనస్సున హత్తవు. హత్తినఁగాని యద్భుతసృష్టి వెలువడదు. వెలువడినను శ్రోతలకుఁ బఠితలకుఁ దాదాత్మ్యము రాదు. రసోత్పత్తి కాదు ప్రాథమికపరస్పర సందర్శనమునఁ బ్రవరవరూధినులపాత్రసృష్టి యద్భుతమై నిలిచినది. రసాభాసఘట్టము కావున వరూధినికిఁ బ్రాధాన్యము హెచ్చి భావపరంపరలు కురిసినవి. ప్రవరుఁడు తనవిడుమరకై యడ్డంబునిల్చిన యయ్యచ్చరతో

"ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ!" అని యనును.

"రసాభాస మిాపైది" అనునది "అడ్డంబునిల్చిన" అను పదముతో సూచించివైచెను. ఆయాభాస మెంత యుచ్చకోటికిఁ జేర్పవలయు నని యిటుపైని ప్రారంభించెను.

అని తనకథ నెఱింగించినఁ
దనకనుఁగవ మెఱుఁగు లుబ్బఁ దాటంకములున్
జనుఁగవయు నడుము వణఁకఁగ
వనిత సెలవివాఱ నవ్వె వానికి ననియెన్.

ఈపద్యము పెద్దనశిల్పమునకు నికషము. ఈవరూథినియవస్థ చిత్రశిల్పమునకు లొంగనియెత్తుది కనుగవ మెఱుఁగులయుబ్బు - తాటంక - స్తన - మధ్యము-లవణంకు నే శిల్పి చూపఁగలఁడు. సెలవివాఱనవ్వులనవ్వించిన వరూథినిని పెద్దన యెక్కడఁ జూచెనో! యెటుల భావించెనో!

ప్రవరుని "కథ" తెలిసికొనినదఁట వరూథిని. ఈకథావాస్తవమా? కల్పితమా? అనునది తరువాత మనకుఁ దెలియును. వరూథినికిఁ బ్రవరుఁడు చెప్పిన అప్పటికథ అవాస్తవ మనియే నాఁడు వరూథిని వీణాగానమాధురిలో మునిఁగి సోలి సౌందర్యాధిదేవతయై యుండి ఒంటిపాటున దివ్యసుందరవిగ్రహుఁడైన ప్రవరుని జూచినది. చూచినవెంటనే యెందును జూడనియతనిసౌందర్యమునకు ముగ్ధయై తనను మఱచి, సిగ్గువిడచి, యడ్డంబునిల్చిన దా లేమ. ఇంతటిసౌందర్యుని తుహినభూధరాగ్రమునకు వచ్చి యేకాంతములో నున్న యామె యొద్దకుఁ జేరి దారితెలియకయుంటి నని దెల్పి, దారిచూప మనిన నాతఁడు దారితెలియని భాందసుఁ డని యెటుల దమ్మును ఆ కథ ఆమె కెట్లును నతుకలేదు నమ్మలేదు పురుషు లీ రీతి స్త్రీలసంభాషణకు దింతురనియె యెంచి తనచేఁజిక్కినటులఁ బ్రవరుని నెంచి శృంగారరసాలంబరాగ నిర్భరయై యుప్పొంగు వరూథినియాంతరభావములఁ గ్రేణ్ఢరింపవలసినముహూర్త మయ్యది ఆ స్థితిని పెద్దన చిన్నికందములో దాణవశక్తి నిమిడ్చినటులఁ జిత్రించెను. నిలిపినను నిలువక యుద్రిక్తయయిన వరూథిని - తాటంక - స్తన - మధ్యము లల్లాడినవి. వణఁకుటలో వణఁకించుటలో నామెసౌందర్యపరభాగగ యని తెలియు

చున్నది. భవనమధ్యమున నిమిడ్చి గోడలు ద్వారములు కట్టవలసిన "నాగి"రైన ఏ వణంకు నుండదు. నడుమువణఁకు తీవఁబోణికిమాత్రమే యుండును. తాటంకచలనము లేఁదీఁగ గాలికి జవ్వాడురీతిని నొడలంతయుఁ దీఁగసాగినరీతిగ నున్నపుడే యుండును. సెలవివాఱ నవ్వుట రసోద్ధుర రసాధిదేవత యైనపుడే. లేనిచో కహకహాట్టానమే. ఈ రీతి శిల్పచిత్రిణము చేసి యామెయాంతరభావము రాగోద్రిక్తతను జక్కఁగఁ జిత్రించెను. దాని జిత్రించుశిల్పి యుండఁడు. వణఁకు నే శిల్పమునఁ జిత్రింపఁగలఁడు శిల్పి. శబ్దములదే సామ్రాజ్యము; కవిదే యా సొమ్ము. ఈ పద్యములో వరూధిని నాట్యముచేయుచున్నట్లు సూచించుచున్నవి పదములు "చనుఁగవయు - నడుము - వడఁకఁగ వనిత - సెలవి - వాఱనవ్వి వానికి ననియె" అని రసాభాసఘట్టమున కంకురార్పణ మీ పద్యమాది

వాడినమోముఁదమ్మి తెలివాలికకన్నులు విన్నఁబోవఁ బో
నాడక నెన్నొసల్ కరమునం దిడి తీరనిషణ్ణయై జలం
బాడఁగఁ బిల్చువారి నొక హస్తపుమ్రొక్కున నాడుఁడంచుఁ దాఁ
జూడకచూచుచూడ్కి నలజోటి దెసల్ పరికింప నొక్కచోఁ.

ఏ ఘట్టమునందైనను సిద్ధహస్తునిశిల్పము వంపు లేనిదై వెలువడును. ప్రవరునివలచినవరూధిని ద్రోపువడి లజ్జాపరవశ యై, చర్చచేసి నిరాశయై, ప్రవరుఁడు పోవ మఱిభవనము చేరికొనినది. ప్రవరుఁడు కేళీవనములోఁ గన్పట్టవచ్చు నని చెలికత్తె లాసగొల్పి వనమునకుఁ దీసికొని వచ్చిరి. తాము జలక్రీడ సేయుచు వరూధినినిగూడ రమ్మని పిలచిన సమయమున నిరాశాసుందర మయిన వరూధిని శిల్ప మిది.

వాడినమోముతో - వాలికసోగకన్నులతో - నొక చేతిఁ గైశికమును బూని - యొద్దున గూర్చుండి - ఒకహస్తపుమ్రొక్కుతో వారలకు సమాధాన మిచ్చి చూడనిమూఁగచూపులతో దిక్కులను బరికించుచున్నదఁట వరూధిని. ఈపద్యసృష్టి యామె యుత్సాహినిగా నున్న శిల్పములకంటెఁ గూడ నుజ్జ్వలమేమో !

ఇట్టిశిల్పమును సృష్టించుటలోఁ బెద్దనగారిపెద్దభావనానైశిత్యము సహృదయరంజకము. ఆ స్థితిలో వరూథిని యటులఁ గూర్చుండుటఁ జుట్టును జేతిలో నందుకొనుట, అద్భుతశిల్పముసరిక దా! ఒకచేతితో మ్రొక్కును జిత్రించినశిల్పి యసమానలోకానుభవమున నపరిమాన రసోపాసనకుఁ దానాదర్శమూర్తి. చూడనిచూపులచిత్రణ మెక్కడి దయ్యా యీ ఊహ! ఈ చూపుతీ రొకమాఱు పరికింతము:

ఆ కమలాక్షి యింపున దృగంచల మించుక మూసి హర్ష బా
ష్పాకులకోణశోణరుచు లగ్రమునం జనఁ జూచుచూపు తీ
రై కనుపట్టెఁ దమ్మరస మంటుకొనన్ వెడవింటివాఁడు క్రో
ధైకధురీణతం గఱచి యేసిన సింగిణికోలయో యనన్.

దిక్కులఁ బరికించు వరూథినికిఁ బ్రవరసందర్శన మబ్బినది. కాంచినంతనే వరూథిని ప్రవరునినిరాకృతి, తనకుఁ గలిగిన స్థితిం దలఁచినది. రాగ-నిరాశలు-రెండు పెనఁగొనినవి. కలక్వాణత్కనకకాంచికయై యెదు రేఁగినది. వయస్యల విడిచివైచి ప్రవరుని దరిఁ జేరినది. ఆతనిని జూచినది. ఆచూపు మన్మథుఁడు వేసిన బాణమువలె నున్నదఁట. పెద్దన పెద్దశ్శృంగారి. మఱచియైనను భోగముల మఱవఁడు. తములము నమలుకొనుచు మన్మథుఁడు యువజనహృదయముల గాఁడనేయుచు లొంగనిమనుజుల లొంగఁదీసికొనుటకు నోటఁగఱచి బాణమును గసితో వేసికొట్టును. ప్రవరుఁడు లొంగక పాఱిపోవునేమో! యందులకై వరూథినిచూపు మన్మథబాణము. ఈమాఱు చూపుతోనే లొంగదీయవలె నని చూచినది. కవి సిద్ధహస్తుఁడై చూపులమీఁద నెక్కువ శిల్పము చూపించినాఁడు.

పెద్దన యీరీతివర్ణనకుఁ దగినభావము, భావమునకుఁ బోషిక మగు నలంకారములను గళాసామగ్రిజోద్గారభావ్యము లగు శిల్పములను, అన్నిటికంటె మూర్ధన్య మైన వ్యంగ్యరీతిని నాశ్రయించి చెప్పఁగలిగిన శిల్పి. ఒక్కచూపులలో కొన్నిరీతుల ననుకొంటిమి. ఇట్టి శిల్పములు మొదటినుండితుదివఱకు—

వరణాద్వీపవతీ - తొండము ల్సాచి - కులిశధారాహతి - నికట మహీంధరాగ్రతట - తతనితంబాభోగ - ఉరుదరీకుహర - ఏ విహంగము గన్న - మొదలగు ప్రకృతిచిత్రములు, పసిడిత్రోరముత్రోడ - తతనితంబాభోగ - మొదలగు వైయక్తికశిల్పములు - మానుముక బుట్టెడు - పాటున కింతు లోర్తు రె- మొదలగు నవస్థాశిల్పములు - భావశిల్పములు - వ్యంగ్యశిల్పములు - మిలమిలలాడుచు నేయున్నవి.

1. చిలుకలకొల్కి కల్కి యొక చేడియ నాటకశాలమేడపై
నిలువున నాడుచుండి ధరణీపతిఁ జూడఁదలంచి యంచునన్
నిలిచి రహిం గనుంగొనుచు నెయ్యమునం దనువల్లి యుబ్బి కం
చెల తెగిపడ్డఁ గేతనము చీరచెఱంగున మూసెఁ జన్నులన్.

2. అలికులవేణి యొక్క తె రతాంతమునం దనయంగవల్లి కం
బులకలు చొక్కులేఁజెమరు పుట్టఁగ నేఁగి నరేంద్రుఁ జూడ నా
పులకలు చొక్కులేఁజెమరుఁ బోవక యట్టుల నుండె నట్టిదాఁ
జెలువగువానిఁ గన్గొనినఁ జెల్వకుఁ జూపులఁగావె కూటముల్

ఇట్టి యవస్థాశిల్పములు పదికిఁ బైబడియున్నవి. ఇవియన్నియుఁ జూపుల రూపులు——

మొత్తముమీఁదఁ బెద్దన మనుచరితమునంతను నొక మధురరసధునిగా నొనర్చినాఁడు. ఈపద్యములకుఁ గాళిదాసుని రఘువంశమునందలి యీ క్రింది శ్లోకములు మార్గదర్శకములు కాకపోవు.

శ్లో. జాలాంతరప్రేషితదృష్టి రన్యా ప్రస్థానభిన్నాం న బబంధ నీవీం
నాభిప్రవిష్టాభరణప్రభేణ హస్తేన తస్థా వవలంబ్య వాసః.
అర్థాచితా సత్వర ముత్థితాయాః పదేపదే దుర్నిమితే గలంతీ
కస్యాశ్చి దాసీ ద్రశనా తదానీ మంగుష్ఠమూలార్పితసూత్రశేషా॥

అయినను గవితా నవలంబించినరీతిలో నొక క్రొత్తఁదనము కల్పనాపాటవము - కళాచిత్రిణనైశితి యున్న నత్యున్నతస్థాయి నందుకొనును.

పెద్దనమనుచరిత్రము రసాభాసఘట్టముననే మెఱుఁగులు కలదియై చెలఁగిన దని యందఱు నొప్పికొనినదియే. ఈరసాభాసఘట్టమునకు బింబభూతములు తిక్కయజ్వ రంభారావణరసాభాసము - కీచకద్రౌపదీరసాభాసము - ప్రబంధపరమేశ్వరుని సైంధవద్రౌపదుల రసాభాసము కాక పోవు.

పెద్దనకృతికిఁ బ్రతిపదవిన్యాసమునకు రససిద్ధికిఁ బ్రబంధనిర్మాణమునకుఁ దత్రాపి రసాభాసమునకు మార్గోపదేశకము హృదయసంస్కారకమునైన శ్రీనాథకవిత, దానను హరవిలాసములోని యూర్వశ్యర్జునరసాభాసఘట్టము ప్రతిపదము పెద్దనకృతిలోఁ బద్యములై జాలువాఱినవి.

పై రసాభాసఘట్టము లున్నను బెద్దనకృతి కీ విలువ హెచ్చుటకుఁ గారణము వాచ్యముగా నెచ్చట భావములు వెలిపుచ్చవలెనో, వ్యంగ్యముగా నెచటఁ జిత్రింపవలెనో తెలిసి మెలఁగుటయే. వెనుకటి కవు లంతగా వ్యంగ్యమర్యాదను బాటింపలే దనియే యనిన సాహసము కాదేమో? కట్టి తోడి వ్రాసి కై సేసి కౌతుకమున, కొనలిగాసిలిపుట్టంబు మునుఁగువెట్టి, గాజువగఁద్రోసి చప్పుడుకాకయుండ వచ్చె నూర్వశి యర్జునావాసమునకు” అను నూర్వశిపాత్ర ప్రవేశించి తనయాంతర మెట్టిదో పతితలకైన నెఱఁగింపక యేక్రియాపరమైయరుగును. ఆమెభావము నెఱిఁగి యర్జునుఁడు

“పురూరవుండు... మా తాతగా రత్తోయాకరమేఖలాపతికి నిల్లాలై తిగాఁ గావునన్, ముత్తో నీ విది లెన్స మన్ననివయ్యె మోహంబు వాటింపఁగఁ”

అని మోహశబ్దమును వాత్సల్యపరముగాఁ జేసివైచి యామెపాదమునకు వందన మొనరించి రసమును భావముగా మార్చివైచెను.

పై తనమనస్సు నాఁపుకొనలేని యూర్వశి

"నిను నంగజసన్నిభుఁ జూచి పుష్పబాణాసను పుష్పబాణ
నివహమ్ములకుం గుఱియైతి నిట్టి నా యాన నిరాకరింపఁదగవా
మగవాఁడవు కావ యర్జునా!
వేసాలఁ బోక రమ్మా
పూసెజ్జకుఁ, బొద్దువోయెఁ బలియుట చాలుఁన్
వాసవనందన! కుసుమశ
రాసన కేళీకళావిహారంబులకున్"

అనియాఁగక......లేమొలకనవ్వులపాంగంబులం దొంగలింపఁ గంకణ ఝుణఝుణత్కారంబు తోరంబుగ కంకేళి కేళీకమలంబునఁబురందరనంద నునివ్రేసె"నర్జునుఁ డే పాకంబునకు రాక" అనియీ ఘట్టము ముగిసెను. ఈఘట్టమునుజూచినసహృదయునకునూర్వశీవరూధినులలోఁ బ్రౌఢయెవరో వ్యంగ్యమర్యాదకుఁ గట్టుబడి కొంతవఱకైన నిగ్రహము కలది యెవ తెయో తెలియును. ననరేఁగి యూర్వశి యర్ధరాత్రిమునఁ దానై ప్రవే శించి మూఁగయై పాదములొత్తి యతని గారవమును దెలిసియుపన్యాస మిచ్చి, స్పష్టముగఁ జెప్పి తనహృదయమును, ప్రాకృతప్రకాశికయైనది.

మనుచరితమున వరూధిని స్త్రీస్వభావ మగు వ్యంగ్యమర్యాదను గొంతగానైన నవలంబించి "ఇంతలు కన్నులుండ" అను నర్మగర్భముగా మాటాడి నృత్తరత్నాకర మైనది. లేఁతన వ్వానససీమ దోఁచునట్లు యాటాడినది. యుక్తిగ మాటాడినది. ఏడుపులోనైన సౌకుమార్యము తనప్రౌఢదనమును వీడలేదు. విడిచివైచిన స్థితిలోఁగూడ కఱకుఁదనము నవలంబింపలేదు.

వెనుకటిరసాభాసఘట్టము లెన్ని యున్నను గవి శిల్పి గావుననే కవితలోఁ బెద్దన పెద్ద యనిపించుకొనెను.

రసాభాసమునకైనను వ్యంగ్యఫణితియే మాధుర్యమును సమకూర్చును. కావుననే "రస - భావ - తదాభాస - తత్ప్రశాంత్యాదిరక్రమః" అని ధ్వనికారుఁడు అసంలక్ష్యక్రమవ్యంగ్యధ్వనిగా నంగీకరించెను.

అనువాదము,అనుకరణము లేక ఏ శిల్పము సాగదు. ఏ కళసాధతము కాదు. స్వప్రతిభ లేక యనుకరణమే ముఖ్య మయినదానికిఁ బ్రాధాన్యము రాదు. తనకుఁ బూర్వకవులందఱు అదనువాదకులైనను స్వప్రతిభమిక్కుటమగుటచేతనే భిన్నభిన్నమార్గములలోఁ బ్రసిద్ధిచెందిరి. శ్రీనాథుఁడు నైషధమును తు—చ—లు తప్పకుండ ననువదించినను బ్రతిభావంతుఁడు కావుననే నైషధము ననువదించినది మొదలు కవిసార్వభౌముఁడుగనే నెగడువడసెను.

శ్రీనాథునికవిత యంతయు ననువాదమే యనినఁ గాదనుటకు దారికానరాదు. క్రీడాభిరామముమాట యటుండనిండు అన్నిటికిమూలముండియే యున్నది. అయినను నాతనికవిసార్వభౌమతకుఁ గారణ మాతఁడు సృష్టించినకవితాసృష్టి, నూత్నశిల్పము, ఎంత తాను బూర్వకవిపదనుపమోపాసకుఁడై—"వచియింతు వేములవాడ" "భాషింతు నన్నయభట్టుమార్గంబున" "వాక్రుత్తుఁదిక్కయజ్వ" "పరిఢవింతుఁ బ్రబంధపరమేశ్వరునిఠేవ" అని ప్రతినవట్టినను భిన్నకవితాస్రోతస్వినియే వెలువడినది. అప్రస్తుతమైనను నొకపద్యము నుదహరించి ప్రస్తుతమును ముగించెదను.

ఆమిత్రావరుణాంశసంభవుని వింధ్యాటోపవిధ్వంసి లో
పాముద్రాసహితుం గనుంగొనిరి యుత్పన్నప్రమోదంబునన్
వ్యామగ్రాహ్యపయోధరల్ కుటిలనీలాగ్రాలకల్ తథ్యమి
థ్యామధ్యస్థితమధ్య లాటవికసేనాధీశసీమంతినుల్.

శ్రీనాథునికవితలో నిట్టి వ్యామగ్రాహ్యపయోధరనీరంధ్రమధురవాక్య[illegible] వెయాత్రముగ సాఁగుచునేయుండును.

పెద్దనకూడఁ గథాకథనమున కనువాద్యముగ మార్కండేయ పురాణము నాధారముగఁ జేసికొనెను. కథాకథనమునకు శైలికిఁ బాత్ర చిత్రణమునకు సూక్తివైచిత్రికి నన్నయతిక్కనప్రబంధపరమేశ్వరులను శ్రీనాథుని పదశః - వాక్యశః - భావశః - అలంబయష్టిగా నవలంబించినను, పాత్రచిత్రణములలో, భావభావనలో - ప్రకృతినిరూపణలో - పలికెడిపలుకులలో - నుడికారపుసొంపులలో - సంభోధనరామణీయకములలో - వ్యంగ్యార్థపరిపాటిని బాటించుటలో సర్వోత్తమై మెలఁగెను.

ఏ పద మెంతమెత్తగను - ఎంత నిశితముగ నుండవలెనో, ఏ వాక్య మెంత గభీరముగ సాఁగవలెనో, ఏ భావ మెంత యుదాత్తముగ రూపొందవలెనో, ఏ పాత్ర మెంతహాయిగ నుండవలెనో, యెఱిఁగి మెలఁగెను. కావుననే పెద్దన కవితాశిల్పప్రభు వయ్యెను. మధుని శిల్పముతో నాఁగుదము. మాయాప్రవరుఁడు వరూథినీసన్నిధిని స్వాత్మ్యమును స్థగిత మొనర్చి మాటాడుస్థితి—

కొనసాఁగి కామినీగోష్ఠిఁ బ్రౌఢము లైన
యుదుటుచూపుల ఱెప్పతుదల నాఁచి
సంతసంబున ముఖాబ్జమునఁ బొడముఁ జిఱునవ్వు
కందళింపక యుండ డిందుపఱచి
పొంగారుమైఁ దోఁచు శృంగారచేష్టలఁ
దమిఁ దెచ్చుకోలు మార్ధ్యమున దాఁచి
పొడమురసావేశమున వచ్చునర్మోక్తు
లొదవి నాలుకకు రాకుండఁ గ్రుక్కి
మస్తకము వాంచి, యుసురని మౌనముద్ర
నేల బొటవ్రేల వ్రాయుచు నిలిచి కొంత
సేపు వెడవెడ చింతించి శిర సొకింత
యెత్తి సన్నంపుటెలుఁగుతో నిట్టులనియె.

ఇయ్యది రసశిల్పము. రసికహృదయవినిర్గతరసధుని. ఈశిల్పము సంతోష పెట్టని హృదయమపశబ్దము. ఈ ఘట్టమున గోవర్ధనునిమాటయనుకొనిన సమాప్తి.

"అకలితశబ్దాలంకృతి రనుకూలాస్ఖలితపదనివేశాపి
అభిసారికేవ రమయతి సూక్తిః సోత్కర్షశృంగారా"
నీరసో హి నిబంధో యః సోఽపశబ్దంమహాకవేః
న తేనాకవిరేవ స్యాత్" అని ఆనందవర్ధనుఁడన్న రసభూయిష్ట శిల్పచిత్రణము పెద్దన దేసొమ్ము.

పెద్దనామాత్యకృతిః విజయతేతరామ్.

# నాగార్జునుఁడు - మాధ్యమికకారికలు

రచయిత:— శ్రీ కొల్లూరి సోమశేఖరశాస్త్రి

భారతవర్షమునఁ జిరకాలమునుండి యనేకులు రగు తత్త్వజిజ్ఞాసువు లుద్భవించి నేఁటివఱకు స్వస్వప్రతిభానుసారముగఁ దత్త్వమును బరీక్షింపుచుఁ దత్ఫలితముగ ననేకదర్శనముల నిర్మించి రనునది సర్వవిదితము. అందుఁ గొన్ని యాస్తికదర్శనములు. మఱికొన్ని నాస్తికదర్శనములు. వేదమును బ్రమాణ మనువా రాస్తికులు. వారలదర్శనము లాస్తికదర్శనములు. వేదము బ్రమాణముగా దనువారు నాస్తికులు. వారలదర్శనములు నాస్తికదర్శనములు. న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, పూర్వోత్తరమీమాంసాదర్శనము లాస్తికములు. చార్వాక, బౌద్ధార్హతదర్శనములు, నాస్తికదర్శనములు. ఈ దర్శనముల లన్నిటిని మఱియొక తీరునను విభజింపవచ్చును. ద్వైతదర్శనము లనియు నద్వైతదర్శనము లనియు దర్శనము లన్నియు రెండుదెఱఁగు లగుచున్నవి. ఆస్తికదర్శనములం దౌపనిషద (వేదాంత) దర్శన మద్వైతదర్శనము. ఈ విషయము వ్యాసతాత్పర్యనిర్ణయ మను గ్రంథమునఁ జక్కఁగ నిరూపింపఁబడినది. నాస్తికదర్శనములందు బౌద్ధదర్శన మద్వైతదర్శన మగుచున్నది. అమరకోశమున బుద్ధుని పేరులందు "అద్వయవాదీ" అని బుద్ధుని యద్వైతిగఁ జెప్పియున్నాఁడు. ఔపనిషదదర్శన మద్వైతదర్శన మను విషయము, బ్రహ్మసూత్ర శాంకరభాష్యములందు సుస్పష్ట మగుచున్నది. మఱియు నద్వైతవాదు లగు శాంకరిమతానుయాయులకుఁ బ్రచ్ఛన్నబౌద్ధు లను వ్యవహార మొండు గలదు. కాన శాంకరదర్శనమునకును, బౌద్ధదర్శనమునకును గల సామ్యభేదములఁ జర్చింపవలసియున్నది. బుద్ధభగవానుఁడు తన దర్శనమును శిష్యులకు సంగ్రహముగ నాలుగుసూత్రములందు నిరూపించెను. అందు శిష్యులతారతమ్యమునుబట్టి, హీనయానసిద్ధాంత మనియు, మహాయానసిద్ధాంత మనియు, రెండురకములసిద్ధాంతములు వెలువడినవి. హీనయానసిద్ధాంతమును, బాహ్య మనియు, ఆభ్యంతర మనియు

ద్వివిధ మగు పదార్థ మంగీకరింపఁబడినది. మహాయానసిద్ధాంతమున విజ్ఞానముకన్న వే ఱగు పదార్థము లేదు. అదియు నశించును. శూన్యమే పరమార్థ మని యంగీకరింతురు. ఇందు హీనయానముకన్న మహాయాన ముత్కృష్టము. అందును శూన్యవాదసిద్ధాంత ముత్కృష్టము. దీనినె మాధ్యమికసిద్ధాంత మందురు. ఈ మాధ్యమికసిద్ధాంతమును జాల ప్రచారమునకుఁ దెచ్చిన మహనీయుఁడు నాగార్జునాచార్యుఁడు. ఈ నాగార్జునుఁడు బౌద్ధభిక్షుఁ డనియు, ఆచార్యుఁ డనియు, బాణభట్టుఁడు దన హర్ష చరితమునఁ జెప్పియున్నాఁడు. ఈతఁ డాంధ్ర దేశమున బౌద్ధమతాచార్యుఁడై యుండెను. ఈతని పేరున నిప్పటికిని గుంటూరుమండలమున నాగార్జునకొండ యను పేర నొక పర్వతము గలదు. అం దిప్పటికిని శిథిలము లగు బౌద్ధవిహారములయొక్కయు, స్తూపములయొక్కయు చిహ్నములు గలవు. ఈ నాగార్జునాచార్యుఁ డాంధ్ర దేశమున బౌద్ధమతప్రచార మొనర్చుచు నాలుగువందలకుఁ బైఁగ నున్న కారికలచే నిరువదియేడు ప్రకరణములుగల 'మాధ్యమిక కారికలు' అను నొక గ్రంథరాజమును రచించెను. ఈ గ్రంథము వెలువడిన పిమ్మట ధర్మకీర్తి నిర్మితము లగు "లంకావతారసూత్రములు" వెనుకఁ బడినవి. ఈ మాధ్యమిక కారికలకు" అకుతోభయవృత్తి "అను పేరున నాగార్జునుఁడే యొక సంగ్రహ మగు టీకను రచించెను. కాని యా టీక యిపుడు దుర్లభము. చీనభాషయందుఁ గల దాని యనువాదమునుబట్టి యా టీక యొకప్పు డుండె నని తెలియుచున్నది. చంద్రకీర్తి మహాశయునిచే నీకారికలకు "ప్రసన్నపద" యను పేరుగల టీక వ్రాయఁబడినది. కాని యది లేఖకప్రమాదమువలనను, ముద్రణస్ఖాలిత్యమువలనను దప్పులకుప్పయై దుర్బోధ మగుచున్నది. ఇది శాంకరదర్శనమునకుఁ బ్రత్యాసన్న మగుటంజేసి దీనికి సుబోధిని యను పేర నొక చిన్నటీకను వ్రాయుచున్నాను.

విశిష్టాద్వైతు లద్వైతులను బ్రచ్ఛన్నబౌద్ధు లనుటకు మూల మేమి. ఇది యెంతవఱకు సత్య మనునది విచారింతము. శ్రీ శంకరాచార్యులపరమగురువు లగు గౌడపాదాచార్యులచే రచింపఁబడిన

మాండల్యాక్య కారికలకును, నాగార్జునాచార్యవిరచితము లగు మాధ్యమిక కారికలకును గల సామ్యమునుబట్టి యీ పరివాద మేర్పడినది. చూడుఁడు.

| గౌడపాద కారికలు. | మాధ్యమిక కారికలు. |
|---|---|
| 1. జ్ఞానేనాకాశకల్పేన - తంవందే ద్విపదాం వరమ్. 4-1 | 1. యఃప్రతీత్యసముత్పాదం- దేశయామాస సంబుద్ధఃతంవందేద్విపదాంవరమ్. 1-1 |
| 2. స్వతో వా పరతో వాపి న కించి ద్వస్తు జాయతే। సదసత్సదసద్వాపి న కించి ద్వస్తు జాయతే। 4-22 | 2. న స్వతో నాపి పరతః న ద్వాభ్యాం నాప్యహేతుకః, ఉత్పన్నా జాతు విద్యంతే భావాః క్వచన కేచన. 1-1 న స్వతో జాయతే భావః పరతో నైవజాయతే। న స్వతః పరతశ్చైవ జాయతే,జాయతే కుతః. 21-13 |
| 3. న నిరోధో న చోత్పత్తిఃన బద్ధో నచ సాధకః న ముముక్షుర్నవై ముక్తః ఇత్యేషా పరమార్థతా. 2-32 | 3. నోత్పద్యమానం నోత్పన్నం నానుత్పన్నం కథంచన। ఉత్పద్యతే యథా భావ స్తథాఖ్యాతం గతాగతైః. 7-14 యతశ్చ నాస్తి సంసారః నిర్వాణం చాప్యంసంభవి, ఏవం వస్తత్ర సంసారో నిర్వాణం కిం వికల్ప్యతే. 16-11 |
| 4. సర్వే ధర్మాః మృషా స్వప్నే కాయస్యాంతర్నిదర్శనాత్, సంవృతేస్మిఁ ప్రదేశ్వైభూతానాం దర్శనం కుతః॥ 4-33. | 4. సర్వే చ మోషధర్మాణః సంస్కారా స్తేన తేమృషా, సూత్రోక్తం తన్మృషా, మోషధర్మం యదపి సంస్కృతమ్॥ 12-1. |

5. నాత్మభావేన నానేదం న స్వేనాపి కథంచన । న పృథఙ్నాపృథక్కించి దితి తత్త్వవిదో విదుః॥ 2-34.

5. తస్యైవ నాన్యథా భావః నాప్యన్యస్య యుజ్యతే, యువా న జీర్యతే యస్మాద్యస్మాజ్జీర్ణో న జాయతే 13-5.

6. ఆదావంతే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తదా, వితథై స్సదృశా స్సంతోఽవితథా ఇవ లక్షితాః॥ 2-31

6. క్లేశాః కర్మాణి దేహాశ్చ కర్తారశ్చ ఫలానిచ, గంధర్వనగరాకారాః మరీచిస్వప్నసన్నిభాః॥ 17-33.

7. అస్తి నాస్త్యస్తి నాస్తీతి నాస్తి నాస్తీతి వా పునః, కోట్యశ్చతస్ర ఏతాస్తు గ్రహైర్యాసాం సమావృతః॥ 4-83-84.

7. న వక్తవ్యం శూన్యమిత్యశూన్యమితి వా భవేత్, ఉభయం నోభయం చేతి ప్రజ్ఞప్త్యర్థంతు కథ్యతే॥ 22-11.
శాశ్వతాఽశాశ్వతాద్యత్ర కుతః శాంతే చతుష్టయం, అనంతాదిషు చాప్యత్ర కుతః శాంతే చతుష్టయమ్॥ 22-13.

8. సతో హి మాయయా జన్మ యుజ్యతే న తు తత్త్వతః, అసతో మాయయా జన్మ తత్త్వతో నైవ యుజ్యతే॥ 2-87

8. సతశ్చ తావదుత్పత్తిరసతశ్చ న యుజ్యతే, అతో మాయామయా హ్యేతే గంధర్వనగరోపమాః॥ 7-20.

పైనఁ జూపిన ట్లీ మాధ్యమికులకు నద్వైతులకును సామ్యము గన్పట్టుచున్నది. మఱియు వీ రిద్దఱు నద్వైతవాదులు. అద్వైతులు దృష్టిసృష్టివాదము నంగీకరించిరి. దృష్టిసృష్టివాద మన జ్ఞానమే జ్ఞేయరూపమున భాసించుచున్నది. కాని జ్ఞానముకన్న వేఱగు వస్తువు లేదని వారియభిప్రాయము. బౌద్ధులును జ్ఞానముకన్న వేఱగు వస్తువు లేదందురు. కావుననే బౌద్ధులకు విజ్ఞానవాదు లని వ్యవహారము. అద్వైతులు మాయావాదమును, స్వప్నగంధర్వనగరమరీచ్యాదిక దృష్టాంతములచే నిరూపించిరి. బౌద్ధులు నీ దృష్టాంతములచేతనే జగచ్ఛూన్యతను నిరూపిం

చియున్నారు. మఱియు బౌద్ధు లీ ప్రపంచమును, చిత్తవికార మని నిరూపించియున్నారు. అద్వైతులును దృష్టిసమకాలముననే సృష్టి యని నిరూపించియున్నారు. ఈ సామ్యమునుబట్టి యద్వైతులకుఁ బ్రచ్ఛన్న బౌద్ధు లను నాక్షేపమును గొందఱు చేయుచున్నారు. ఇఁక నీ రెండు మతములకుఁ గల భేదమును విచారింతము.

| | |
|---|---|
| 1. అద్వైతులు వేదము ప్రమాణ మందురు. | 1. బౌద్ధులు వేదము ప్రమాణము గా దందురు. |
| 2. బ్రహ్మ సత్య మనియు, బ్రహ్మ కన్న నితరము మిథ్య యనియు వేదాంతు లనుచున్నారు. | 2. ప్రపంచ మంతయు శూన్య మని బౌద్ధమతము. |
| 3. విజ్ఞానము నిత్య మని యద్వైతమతము. | 3. సర్వము క్షణికము స్వలక్షణము నని బౌద్ధసిద్ధాంతము. |
| 4. అనిర్వచనీయ ఖ్యాతివాదులు వేదాంతులు. అనఁగా భ్రమలో ననిర్వచనీయ మగునది (వ్యావహారిక పారమార్థిక విలక్షణ మగునది) విషయ మనివేదాంతు లనుచున్నారు. | 4 ఆత్మఖ్యాతివాదులు బౌద్ధులు. అనఁగా నాత్మధర్మమై యాంతర మగునది బాహ్యమువలె భాసించుచున్నది. కాని బాహ్య మగునది లే దని బౌద్ధు లనుచున్నారు. |
| 5. ఆత్మసుఖరూపుఁడు నానందరూపుఁడునని వేదాంతులమతము. | 5. సర్వము దుఃఖమయము. సుఖరూప మగున దేదియు లే దని బౌద్ధమతము. |
| 6. ఆనందావాప్తి మోక్ష మనియు యద్వైతిమతము. | 6. ఆత్మయు దుఃఖరూపుఁ డగుటచే నాత్మనాశమె మోక్ష మని శూన్యవాదిమతము. |
| 7. వేదవిహితము లగు యజ్ఞాదికర్మ లవశ్యానుష్ఠేయము లనియు, వానివలనఁ జిత్తశుద్ధి | 7. వేద మప్రమాణ మగుటచేతను, యజ్ఞాదికర్మలు పశుహింసాసంబంధముకల వగుట |

దురితక్షయము, మున్నగు ఫలములు సిద్ధించుచున్న వని వేదాంతు లనుచున్నారు. | చేతను, వాని నాచరింపవల దనిబౌద్ధులవాదము.

ఇట్లిన్ని రకములభేదము లద్వైతులకును, బౌద్ధులకును గన్పట్టుచుండ, వేదమునందును, వేదవాదులచే నాచరింపఁబడు యజ్ఞాదికర్మలందు ననాదరము నూని, పౌరుషేయము లగు ప్రబంధముల నా వేదస్థానమున నిలిపి, దత్త్వమును మఱుఁగుపఱచిన, గొంద ఱద్వైతులను బ్రచ్ఛన్నబౌద్ధు లని యపహసించుట యెంతవఱకు సమంజసముగ నున్నదను విషయమును మధ్యస్థు లగు సత్పురుషులు నిర్ణయింపవలయును. బౌద్ధాగమ మద్వైతాగమమునకు సన్నిహితముగ నున్న దను మాట నంగీకరింపవచ్చును.

బౌద్ధులవిజ్ఞానవాదము, విజ్ఞానాత్మక మగు బ్రహ్మకన్న వేఱగు బరమార్థవస్తువు లే దను వేదాంతుల కనుకూలము. మఱియు సర్వము క్షణికము, దుఃఖము, అను బౌద్ధోపదేశము, అద్వైతుల కభిమత మగు సాధనములం దొకటి యగు నైహికాముష్మికఫలములందు దృఢవైరాగ్యమును గలిగించునుగాన నదియు నద్వైతుల కనుకూలము. స్వప్నగంధర్వనగరమరుమరీచికాదిదృష్టాంతములచేఁ బ్రపంచమును నిరాకరించెడి బౌద్ధులు ద్వైతము మాయామయ మను నద్వైతవాదమున కనుకూలు రగుచున్నారు. మఱియు గార్యకారణభావ ముపపన్నము గా దను బౌద్ధవాదము, అద్వైతులయనిర్వచనీయవాదమునకుఁ దోడ్పడుచున్నది. మఱియు నవిశుద్ధవిజ్ఞానసంతతిరూపుఁ డగు జీవుఁడు, నిర్వాణదశలయం దు విశుద్ధవిజ్ఞానరూపుఁడు (ఈశ్వరరూపుడు) అగుచున్నాఁ డను బౌద్ధవాదము, జీవేశ్వరుల కభేదము సంగీకరించిన యద్వైతుల కెంతేని దోడ్పడుచున్నది. అనఁగా సంసారదశయందు జీవరూప మగు విజ్ఞానసంతానము, గర్మసంస్కారరూపము లగు వాసనలచే నవిశుద్ధుఁ డగుచున్నాడు. ఈ విజ్ఞానము నిర్వాణదశయం దీ సంస్కారవాసనలు లేక స్వచ్ఛజ్ఞానసంతానరూపముగనుండు నని బౌద్ధమతము. అద్వైతమతమందును, నవిద్యావశమునఁ దనకు లేని సంసార

దుఃఖమును దనయం దిడికొని సుఖదుఃఖముల ననుభవించుచున్న జీవుఁడు మోక్షావస్థయం దజ్ఞానము నశించియందు సవిశుద్ధవిజ్ఞానరూపుఁడగు బ్రహ్మభావము నందు ననుచున్నారు. కావుననే వీరి నిరుపుర నద్వైతవాదు లనుచున్నారు. మఱియు నీ ప్రపంచ మంతయు భ్రాంతి కల్పిత మని బౌద్ధులు, వేదాంతులు ననుచున్నారు. కాని వారికిని వీరికిని నటిభేద మున్నది. బౌద్ధులు కేశోండ్రకభ్రమ నుదాహరణముగ గైకొని నిరధిష్ఠానము (నిరాశ్రమము) నగు ప్రపంచ భ్రమ నంగీకరించుదురు. అద్వైతులు బ్రహ్మ నాశ్రయముగ గొని సాధిష్ఠానభ్రమ నంగీకరించుచు నిరధిష్ఠానమగు భ్రమ లేదందురు. కేశోండ్రక మన దలవెండ్రుకల చిక్కు. ఒకప్పు డాకసమునందు దలవెండ్రుకల చిక్కువలె మన కగపడును. ఆ భ్రమకు శూన్యమగు నాకసమె యాశ్రయము. కాన నిరధిష్ఠానభ్రమయు నుండవచ్చునని వారందురు. ఆకసమున సౌరాలోకము (వెలుతురు) న్నప్పుడె యీభ్రమ కలుగుచున్నది. కాఁగా నిదియు సౌరాలోకము నాశ్రయించుటవలన నిరధిష్ఠానమగు భ్రమ లేదని యద్వైతుల వాదము. మఱియు వేదాంతులకు నందఱ దార్శనికులతోడను సామ్యము గలదు. చూడుఁడు. సాంఖ్యులు పరిణామవాదము నంగీకరింతురు. అది వివర్తవాదమునకు సాధనముగ నద్వైతులచే నంగీకరింపఁబడినది. సాంఖ్యమతమునం దాత్మ నిస్సంగము, చిద్రూపము. వేదాంతుల మతమునందు నట్లే ఇట్లే పరమాణుకారణవాది యగు కణాదుఁడు, నిరవయవము నిత్యము నగు పరమాణువులసంయోగమువలనఁ బ్రపంచ మేర్పడుచున్నదనుచున్నాఁడు. నిరవయవము, నిత్యమునగు పరమాణువులకు సంయోగము దుర్ఘటముగాన నీవాదము అనిర్వచనీయవాదమును బలపఱచుచున్నది. ఇట్లే స్ఫోటవాదము నద్వైతవాదము ననుకరించుచున్నది. స్ఫోట మన నిరవయవ మగు శబ్దము. వారి మతమున నిది నిత్యము. స్వప్రకాశము. జగత్కారణము. వేదాంతులు చెప్పిన బ్రహ్మలక్షణము లన్నియు నీ స్ఫోటమునకుఁ గలవు. కాన వారితోడను వీరికి సామ్యము గలదు. వీరు వారు ననయేల, అద్వైతవాదుల కందఱ దార్శనికులతోడను సామ్యమున్నది. ఎట్లన నద్వైతుల కందఱ దార్శనికులతోడ నైక్యముగలదు. వీరి కెవరితోడను భేదము లేదు. ఎవరితోడ భేద మున్నను అద్వైతము

నకు భంగము వాటిల్లునుగదా! కాఁగా నద్వైతుల కన్నివాదములతోడను సంప్రతిపత్తియె కాని విప్రతిపత్తి పనికిరాదు. ఈ విషయము గౌడకారికలందు స్పష్టము. వీరి మతము నద్వైతము మాయామాత్ర మనియు, నద్వైతమె పరమార్థ మనియు స్థిరపఱుపఁబడినది.

ఇట్లు సర్వదార్శనికసంప్రతిపన్ను లగు నద్వైతులను ప్రచ్ఛన్న బౌద్ధు లనుట సరికాదు. మఱియు దార్శనికులకు ముఖ్యవిషయములందు భేదమున్నను గొన్ని విషయములందు సామ్య ముండుట తప్పదు. ఏదార్శనికుఁడైనను ఘటమును ఘటము కా దనుట పొసఁగదుగదా. ఇఁక దాని తత్త్వ మే మనునెడ మతభేద ముండవచ్చును. కాన సామ్య వైషమ్యములు సర్వదర్శనసాధారణములు. ఇంతమాత్రమున నొకరినొకరు దూలనాడుట యుక్తము గాదు. మఱియు దర్శనము లన్నియుఁ దత్త్వమును నిరూపించుటకొఱ కారంభింపఁబడినవి. తత్త్వ మెప్పుఁడు నొకటిగనె యుండునుగాని మనబుద్ధులనుబట్టి మాఱునదికాదు. కాఁగా నీ దర్శనముల కన్నిటికిఁ దగురీతిని సమన్వయ మొనరించుట యుక్తము. అట్టి సమన్వయ మద్వైతదర్శనమున సుకరము. వీరి మతమున వ్యావహారిక మనియు, పారమార్థిక మనియు విభాగము గలదు. వ్యావహారమునం దీ ప్రపంచ మంతయుఁ గలదు. కాన సర్వ వ్యవహారములు సరిపడును. పరమార్థమును నిర్ణయించుటకు మనబుద్ధులు చాలవు. కానఁ బరమును నిరూపించుటకై యేర్పడిన వేదమునుబట్టియె పరమార్థమును నిరూపింపవలయును. వేదమునందు ద్వైతము మిథ్య యనియు, నద్వైతము పరమార్థ మనియు స్పష్టముగ నిరూపింపఁబడినది. అట్టి యద్వైతవాదమున కత్యంతసన్నిహిత మగు నీ మాధ్యమిక సిద్ధాంతమును నిరూపించెడి గ్రంథములలో నీ నాగార్జునప్రణీతము లగు "మాధ్యమికకారికలు" చాల ముఖ్య మయిన వనునది నిర్వివాదాంశము. ఇట్టి మహాగ్రంథమును సుబోధ మొనరించి లోకమున కందిచ్చుటకై యీనా ప్రయత్నము. ఇందు నేనెంతవఱకుఁ గృతార్థుఁడ నయినది సహృదయులు నిర్ణయింపవలసి యున్నది. కాన నిష్పక్షపాతదృష్టితో విమర్శించి నన్ను గృతార్థు నొనరింప వేడికొనుచుంటిని.

# కాశీఖండములో భీమమండలము

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

కాశీఖండ మను స్కాందపురాణ ఖండమును తెలుఁగు ప్రబంధముగా సంతరించి, యాంధ్రులచేతి కందిచ్చినవాఁడు శ్రీనాథకవిసార్వభౌముఁడు. ఆతఁడు ప్రౌఢనిర్భరవయఃపరిపాకమున భీమనాథుని మహిమఁ గొనియాడి, తద్భక్తి రసావేశపూరితుఁడై ప్రాయ మింతకు మిగులఁగై వ్రాలకుండఁ గాశికాఖండమును దెనుఁగుచేసి, రాజమహేంద్రవరము రాజధానిగా నాంధ్రావనీభాగమును బాలించిన వీరభద్రారెడ్డి కంకిత మొనర్చి, యాతని యాస్థానకవి యైనాఁడు. కాశీఖండమునఁ బ్రధానముగఁ గొనియాడవలసినది, గంగానదీతీరము, తద్వాసి వారణాశి, తదధిష్ఠాతలయిన విశ్వేశ్వరాది దేవతల మహత్త్వమును. అట్లయినను దా నానాఁటికి గోదావరీపుణ్యకూలంకషాజలస్ఫారిత శ్రీరుద్రపాదయు గలియగు రాజమహేంద్రవరమున వసించుచుండెను. మార్కండేయ శశిమౌళి తన యేలికయయిన వీరభద్రారెడ్డి కిలవేల్పయి, గౌతమీతీరముననే యుండెను. ఆ కవిరాజు దృష్టిలో గౌతమీగంగ వార్థు లేడింటికి వలపువనితయయిన మంగళోత్సంగ. కావున నెట్టులో ప్రసక్తిఁ గల్పించుకొని, గోదావరీనదీ పవిత్రతీరమును, దానికి డాపల నుండు భీమమండలమును, తదంతర్గతారామాది దివ్యక్షేత్రములను నీ కాశీఖండములో సైత మొక్క యొడుపున వర్ణించి వదలినాఁడు.

శ్రీనాథుఁ డాంధ్రదేశాభిమానము గల యాంధ్రకవి. తన కృతులలో నేపాటి యదను వచ్చినను వదలక, 'నే నాంధ్రుఁడ'నను నభిమానము వెల్లివిరియునట్లును, తననాఁటి యాంధ్రదేశ చరిత్రము సంస్కృతి నాగరికత మున్నగు విషయములు తరువాతివారు తెలిసికొనుటకు వలయు బీజముల నాఁటియే వదలినాఁడు. కావుననే పదునాల్గవ శతాబ్ది యుత్తరార్ధమునకు, పదునేనవ శతాబ్ది పూర్వార్ధమునకు సంబంధించిన యాం

ధ్రదేశచరిత్రమును జిత్రింపఁదలఁచిన చరిత్రపరిశోధకుల కెవ్వరికయి నను శ్రీనాథుని కృతుల స్మరింపకతీరదు. ఆ కవి వతంసుఁడు తాను రచించిన నైషధాది కృతులలో నంతటి చారిత్రక సామగ్రిని నిక్షేపించియున్నాఁడు. ఇదియే యా కవికిఁ గల యాంధ్ర దేశాభిమానమునకు నికషోపలమయిన విషయము.

భీమేశ్వరపురాణ రచనము ఆంధ్ర దేశమునకు హృదయప్రాయమైన భీమమండలి కొక భౌగోళిక రేఖాచిత్రణము. అందు కొఱవడిన విషయముల నీ కాశీఖండము పూరించినది. కావుననే సంస్కృత కాశీఖండము నందలి యొక్క శ్లోకార్ధము నుపశ్రుతిగఁ గైకొని యిరువది మూఁడు గద్యపద్యములలో భీమమండలి నంతయుఁ బనిఁబట్టి చిత్రించి వదలినాఁడు. అగస్త్యమహర్షి దేవతల రక్షించుటకై వింధ్యపర్వతాటోపమును వదలించుటకై కాశి వదలి దక్షిణాశనుబట్టి వచ్చి, యా పని ముగించి, గోదావరీతీరమునకుఁ జేరెను. అప్పటి యాతని స్థితిని సంస్కృత కాశీఖండమున వ్యాసుఁ డిట్లు వర్ణించినాఁడు.

శ్లో. గోదావరీ తటం రమ్యం విచరన్నపి వైమునిః
నతత్యాజచ తం తాపం కాశీవిరహజం ముహుః.

అగస్త్యమౌని మనోహరమయిన గోదావరీ తీరమునఁ జరించుచున్నను కాశీ విరహజనితమైన తాపమును వీడలేకపోయె నని యీ శ్లోకమున కర్థము. ఇందలి పూర్వార్థము నాధారముగఁ గొనియే శ్రీనాథుఁ డగస్త్యునిచే భీమమండలీయాత్రను జేయించినాఁడు.

"ఇవ్విధంబున భువనోపద్రవంబుం బ్రశాంతిం బొందించి, దక్షిణ కాశీ సందర్శనంబునంగాని కాశీ వియోగ వేదనాభారంబు డిందుపడదని, డెందంబున నిశ్చయించి, మంద మంద ప్రయాణంబులం గెందలిరాకు బోఁడిం గనుగందకుండ ముందఱఁ బిఱుంద నడిపించుచు నెడనెడఁ బుణ్యవాహినీ తీర్థంబులఁ గ్రుంకులువెట్టి యష్టమూర్తి నభ్యర్చించుచుం గొన్ని

వాసరంబులకుఁ గుంభసంభవుండు గోదావరి నొరసికొనుచు నాంధ్ర దేశంబున నరుగునప్పుడు"

అనియుపక్రమము గావించిపరమమాహేశ్వరుఁడైన యగస్త్యుని ప్రసన్నవణ శైలపాదమునకుఁ గొనివచ్చి, యచటి మందమారుతాహతిచే ముందునకు నడిపించినాఁడు.

ఇఁక నీ ప్రయాణమున భీమమండలము నందలి పట్టిసము మొదలుగ బ్రహ్మసంవేద్యము వఱకుఁ (బ్రహ్మసంవేద్య మనఁగా గౌతమీసాగరసంగమము) గల పవిత్రతీర్థములలో మునుకలు వెట్టించి, గోదావరీ శాఖాతీరము లందలి శశిశేఖరుల దర్శింపఁ జేయుచు నామునిదంపతులను ముందునకు సాగించినాఁడు. కాశీవియోగ వేదనాదూయమానహృదయులగు నామునిదంపతులకు దక్షిణకాశీదర్శనమునఁగాని శాంతి చేకుఱదని దక్షారామ భీమేశ్వరదర్శనము చేయించినాఁడు. ఆంధ్రభూమికిఁ గంఠమాల యయిన గౌతమీగంగను రాజనందయగు లోపాముద్రకగపఱచి, తన్మూలముగ పట్టిసక్షేత్ర ప్రశస్తిని పాఠకుల కందిచ్చుటకీ యుపక్రమము చేసినట్లులు గన్పట్టును. భీమేశ్వరపురాణములో శ్రీనాథుఁడు భీమమండలినంతయుఁ దనివితీఱ వర్ణించినను వీరభద్ర శిఖరిపై దృష్టి నంతగఁ బ్రసరింపఁ జేయలేదు. ఆకొఱఁత దీర్చుటకై యిచట నగస్త్యుని గోదావరీతీరయాత్రను పట్టిసమున శ్రీ వీరభద్రేశ్వర దర్శనముతో నారంభింపఁ జేసి, భీమమండలీ దర్శనానంతరమున మరలఁ బట్టిసతీర్థక్షేత్రదర్శనముతో ముగింపఁ జేసినాఁడు. ఆ యాత్రాక్రమ మిట్లున్నది.

. పట్టిస శ్రీవీరభద్రేశు సేవించి
తిలసోమనాథునంఘ్రులకు నెరఁగి
పురశాసను ననంతభోగేశ్వరస్వామి
హిమశైలకన్యకాధీశుఁ గొలిచి

పద్మాద్రిపై రుద్రపాదంబు లర్చించి
చేరి మార్కండేయ శివు భజించి
కోటిపల్లి తీర్థ కుండలాముఖముల
సర్థేందుధరు విరూపాక్షుఁ గొలిచి
పల్వాల స్థానమున భూతభర్త నిలిపి
కణఁకఁ గౌంతేయమున వృద్ధగంగఁ గ్రుంకి
దక్షవాటిక సప్తగోదావరమున
మునిఁగి భీమేశ్వరుని గాంచె మునివరుండు.

ఈ పద్యమునందగస్త్యునిచే పట్టిసమున వీరభద్రేశుని, తిలసోమనాథుని, అనంతభోగేశ్వరస్వామిని, పుష్కరగిరిమీఁది రుద్రపాదములను, సమీపమున మార్కండేయస్వామిని, కోటిపల్లి సోమేశ్వరుని, కుండలేశ్వరుని, పలివెలకొప్పు లింగేశ్వరస్వామిని దర్శింపఁజేసినాఁడు. కౌంతేయమున వృద్ధగౌతమిని, సప్తగోదావరమునఁ గ్రుంకులువెట్టించి, దక్షారామ భీమేశ్వరుని దర్శింపఁజేసినాఁడు. భీమేశ్వరపురాణమునందును అగస్త్యుఁడు భీమమండలిలోఁబ్రధానముగ దర్శనీయములని తెలిపిన తీర్థక్షేత్రములు కూడ నివియే. కనుఁడు :—

సీ. అదె పట్టిసస్థాన మందుండు వీరభ
ద్రేశ్వరస్వామి యర్థేందుమౌళి
యదె పుండరీకాద్రి యచట మార్కండేయు
నిలువేల్పు ముక్కంటి వెలసె తొల్లి
యదె కుమారారామ మాహాత్మ్య రేఖయు
చాళుక్యభీమేశు సదనవాటి
యదె కుక్కుటేశ్వరం బయ్యుపాంతము మీద
హుంకారిణీదేవి యోలగంబు

వాఁడె మాయింటివేల్పు పల్వాలపురమున
కొప్పులింగంబు ఫణిరాజకుండలుండు
సప్తమునిసింధుసంగమేశ్వరుఁడు వాఁడె
కుండలాముఖ మదెపూనికులవరేణ్య !

ఈ రెండుపద్యములందుఁ జేర్కొనిన ప్రదేశములు పరికింతము.

పట్టిసము:— పట్టిస మను శబ్దమునకు - ఆయుధవిశేషము, అడ్డకత్తి, యనియర్థము. దక్షారామమున జరిగిన దక్షాధ్వరమునుధ్వంసము చేయుటకై యవతరించిన వీరభద్రేశ్వరుఁడు, యజ్ఞమునఁ బాల్గొనిన దేవతల తలలు నఱుకుచు, పాఱిపోవువారిని వెంటాడి తరుముచు దక్షారామమునుండియు వీరవిహారముచేయుచు వచ్చి, ఈ పట్టిసక్షేత్రమున గోదావరీ మధ్యమునందుండిన పర్వతము వెన్నుఁదన్ని గౌతమీ ప్రవాహములో, దేవతలను తఱిగిన పట్టిసమును గడిగినాఁడు. కావున నిచటిప్రదేశమునకుఁ బట్టిసము అని పేరేర్పడినది. ఈ పర్వతముపై వీరభద్రేశ్వరుఁడు భద్రకాళితోఁగూడి వశించియుండుటచే నిచటి పర్వతమునకు వీరభద్రగిరి యను పేరేర్పడినది. ఈ విషయములను శ్రీనాథుఁడు కాశీఖండమునం దిట్టు చిత్రించియున్నాఁడు.

గీ. దక్షిణానంద విపిన మధ్యంబునందుఁ
గ్రతువిధిధ్వంస వేళ దేవతల నఱికి
వీరభద్రేశుఁ డీయద్రి వెన్నుఁదన్ని
గౌతమీవారిఁ దరవారిఁ గడిగినాఁడు.

తరవారి యనఁగా యుద్ధసాధన మైన కత్తి.

ఈ ప్రస్తావమునసే దక్షాధ్వరధ్వంసము నిట్లు వివరించినాఁడు.

సీ. ఎవ్వాఁడు డాచేతి క్రొవ్వాడి నఖమునఁ
జదిమె భాషాదేవి చిగురు ముక్కుఁ
గనకమేఖల గుచ్చికట్టె నెవ్వాఁడు లీలఁ
జెఱఁగుపైఁ బూషారుక్క మెఱుఁగుఁబండ్లు

కోదుక కెవ్వఁడు పదాంగుష్ఠభాగంబున
నుదురాజుపొట్ట గుజ్జులుక నూఁదెఁ
దటిగె నెవ్వఁడు ఖడ్గధారాంచలంబున
నగ్నినాలుక లేదు నంటఁబట్టి
మోదె నెవ్వాఁడు ముప్పదిమూఁడుకోట్ల
వేలుపులఁ బారఁ బార వెన్నంటఁ దగిలి
యట్టి శ్రీవీరభద్రుఁడీ యద్రిమీఁద
భద్రకాళియుఁ దానుండుఁ బద్మనయన.

పట్టిసము, వీరభద్రేశుఁడు నెలకొనిన యీ శిఖరియు, రాజమహేంద్ర వరమున కుత్తరముగ నాలుక్రోసులమేరలో గోదావరీతీరమధ్యము లందున్నవి. ఈ వీరభద్రశిఖరి కెదురుగా రెండుక్రోసులమేర నుత్తర ముగ నంది యాకారముగల పర్వతముపై మహానందీశ్వరుఁడు నెలకొని యున్నాఁడు. అచటనే యిపుడు Ramapadasagara project కట్టుటకు యత్నములు జరుగుచున్నవి. అచటికి పదిక్రోసులమేర యుత్తరమున ప్రస్రవణశైలము. పాపిడికొండ. ఈనాఁ డది పాపికొండగా వ్యవహరింపఁ బడుచున్నది. మహానందీశ్వరుఁడు వీరభద్రేశుఁడును గోదావరీమధ్యమున శిఖరులపై నెదురెదురుగ నిలిచియున్నారు. వీరిరువుర నచటివారు అన్న దమ్ములని వాకొందురు.

కాశీఖండమున 'పట్టిస శ్రీ వీరభద్రేశు సేవించి' యనిమాత్రమే యనినాఁడుగాని, భీమేశ్వరపురాణములో పట్టిసస్థానమున అర్ధేందు మౌళియయిన వీరభద్రేశ్వరస్వామిగలఁడని యనినాఁడు. శ్రీనాథుఁ డేదేనియొక విశేషణము ప్రయోగించిన నది సార్థక మగును. ఈ నడుమ నేను పట్టిసస్థానమున కేఁగి యచటి వీరభద్రేశ్వరుని దర్శించి తిని. వీరభద్రేశుఁడు చిన్నకొండమీఁది పెద్దదేవళములో వెలసి యున్నాఁడు. లింగము పీఠముమీఁద రెండడుగులయెత్తు, మూఁడడు

గుల చుట్టుకై వారము గలిగి యున్నది. లింగమున కడుగుఎత్తున జూలిపై నొక పొరవలె నున్నది. ఆ పొర నచటివా రగస్త్యుఁడు కౌఁగిలించుకొనఁగా నేర్పడిన గుర్తని యందురు. లలాటభాగమున ఇరుపార్శ్వములందు నొక్కులవలె నున్నవి. వానిని సూర్యచంద్ర నేత్రములందురు. శిరమున నొక జూలిబుగ్గ గలదు. అది జటాజూట మని పూజరి తెలిపియున్నాఁడు. అదియే శ్రీనాథుఁడు పేర్కొనిన యర్ధేందుమౌళి యగును. కాని యా జూలిబుగ్గమీఁద వెండికిరీటమొకటి యిపుడును నేర్పడియున్నది. నాగాభరణమునకు నడుమ నా రజతకిరీటము దాల్చిన యా యీశుఁడు నిజముగ నర్ధేందుమౌళిగనే గన్పట్టును.

శ్రీనాథుఁ డాయద్రిమీఁద భద్రకాళియు వీరభద్రేశుఁడును మాత్రమే నెలకొనినట్లులు వర్ణించినాఁడు. కాని పోయి పరికింపఁగా మఱి కొన్ని విగ్రహములు ప్రాకారములోపలఁ దిరుచుట్టుమాలెలోఁగానవచ్చినవి. భద్రకాళికి ప్రక్కను రుద్రకాళి విగ్రహమున్నది. వేఱొకవైపున మహిషాసురమర్దని దుర్గల విగ్రహములున్నవి. చుట్టును నందీశ్వరుఁడు, భాస్కరుఁడు, లక్ష్మీగణపతి, సప్తమాతృకలు, వీరభద్రుఁడు, కుమారస్వామి, శక్తి, విష్ణువు. చండీశ్వరుఁడు, కాలభైరవుఁడు, సుబ్రహ్మణ్యేశ్వరుఁడు, బాణాసురుఁడు, భృంగి, మహాకాలాది ప్రమథగణములు - అను నీ విగ్రహములు నెలకొని యున్నవి. ఈ ప్రాకారము, దాని నంటి యున్న విగ్రహములుకూడ నర్వాచీనములని తోఁచును. బెండపూడి అన్నామాత్యుఁడు రాజమహేంద్రదుర్గమున శ్రీ వీరభద్రునకుఁగావించిన ప్రాకారరేఖ యిదియే యేమొ?

వీరభద్రాలయము సింహద్వారమునందలి శిల్పము కడుమనోహరము. ద్వారమున కిరుపార్శ్వములందును క్రింద గజముఖ సింహములు గలవు. కుడివైపున పొట్టేలితల ధరించిన దక్షుఁడు. ఎడమవైపున దక్షపత్నియుఁ గలరు. ద్వారమునకు మీఁద గజలక్ష్మి యమరియున్నది

ఆలయములో గర్భమంటప స్తంభములందు శరభవిగ్రహము, తాండవ వీరభద్ర విగ్రహము, శక్తి విగ్రహమును చెక్కఁబడియున్నవి. ఇట్టు లచటి శిల్పమంతయుఁ గడుమనోహరముగ నున్నది. దక్షిణద్వారము నకు ముందు స్తంభములమీఁద శా. శ. ౧౧౭౫, ౧౧౭౬ నాఁటి శాస నములు గలవు. గుడిలో నీశ్వరలింగమునకు సమీపమునందలి గోడ మీఁదఁ గూడ నొక శాసనముగలదు. ఈ తీరుగ నిప్పటికి నా యాల యము ప్రాచీన చరిత్రము నెంతయో తెలుపఁజాలి యున్నది.

ఈ పర్వతముమీఁద క్షేత్రపాలకుఁడైన విష్ణువు భావనారాయణ స్వామి. ఈ స్వామి యాలయము వీరభద్రుని యాలయమునకు నైరృతి దిశయందున్నది. ఈ భావనారాయణుఁడు కూడ ప్రాచీనుఁడే. ఈ రెండాల యములకు నడుమ సీతారాములకు, ఆంజనేయస్వామికిని రెండు చిన్న దేవళము లమరింపఁబడినవి. ఈనడిమి యాలయములు అర్వాచీనముగా మన్నెము మహాలక్ష్మి జమీందారిణిచే నిర్మింపఁబడినట్లులు ఱాతిపై శాసనము వ్రాయఁబడినది. ఈ యాలయములు రెండు నిచట వెలయు టకుఁ గారణమేమని చూచినప్పుడే సంశయము గలిగి పర్యవేక్షింప మొదలుపెట్టఁగా గొంత కొంత యుపపత్తి గన్పట్టవచ్చినది. 'ధంసా' యను బిరుదనామముగల 'యిబ్రహీముఖాను' అను మహమ్మదీయుఁడు భద్రాచల రామాలయమును గొల్లఁగొట్టఁగా, ముందుగ నావార్త తెలిసి యచటివారు పూనికతో సీతారాముల విగ్రహములను బడవ మీఁదఁ బెట్టి పోలవరమునకుఁ గొని తెచ్చినట్టును, ఆ విగ్రహములు పోలవరములోఁ గొంతకాలము, వీరభద్రగిరిమీఁదఁ గొంతకాలము నుండినట్లును చల్లా పేరయ్య యను కవి రచించిన 'భద్రగిరి శతకము' అను నధిక్షేప కావ్యమునందుఁ గానవచ్చుచున్నది. ఆ పద్యము లివి:—

సీ॥ కలముపై నెక్కి మీవంటి ఘనులు తొలఁగి
పోవఁగా నౌనె వలసగాఁ బోలవరము.

భద్రగిరి. 15 ప.

సీ॥ పట్టిసపతికిఁ జెప్పఁ దలంచి పోతివో
వలసపేరిడికొని వసుధలోన భద్ర 9

సీ॥ గీ॥ భద్రాగిరినుండి శ్రీవీరభద్రగిరికి
వలసఁబోవుట యిదియేమి వాంఛయయ్య భద్ర 10

సీ॥ గీ॥ భద్రకడనుండి శ్రీవీరభద్రుకడకు
వలస వేంచేయువలసిన వార్త వినియు భద్ర 19

ఈ పద్యములం దుదాహరించిన తీరునుబట్టి భద్రాచలమునుండి శ్రీరాముఁడు సీతతోఁగూడి పోలవరమునకు వలసవచ్చె ననియుఁ, వీరభద్రగిరి మీఁదఁగూడఁ గొంతకాలముండినట్లును స్పష్టముగఁ దెలియుచున్నది. పోలవరమున కుత్తరముగ రెండు మైళ్లదూరములో మహానందీశ్వరము' దక్షిణముగ రెండు మైళ్లదూరములో పట్టిసమును గలవు. పోలవరమునందు మాత్రము నాఁటికి నేఁటి కీశ్వరాలయము లేనేలేదు. పోలవరమునం దీవిగ్రహము లెచట నుండినది యీక్రింది పద్యమునందు నిరూపింపఁబడినవి.

సీ॥ అరయంగ మీకు భద్రాచలం బయ్యెనే
పొలుపు మీఱఁగ రాజుపోలవరము
కోవెల ప్రాకార గోపురాలయ్యెనే
తలుపులు లేని కఱ్ఱ దడికయిండ్లు
కల్యాణమంటపాగారంబు లయ్యెనే
సంత మామిళ్లలోఁ జప్పరములు
భువి నెన్నఁగా రథోత్సవమయ్యెనే మీకు
స్నానర రహిత ప్రవర్తనంబు
గీ॥ మేలు రాజ్యంబు తురకల పాలుజేసి
హార వృషభ మధ్యమున నుండు టర్హమగునె? భద్ర 43

ఈ పద్యమున వర్ణించిన తీరును బట్టి పోలవరమునందలి సంతమామిళ్లలో

గుడారములు వైచి సీతారాముల విగ్రహముల నచట తడకదళ్ల మధ్య యందుంచినట్లు తెలియుచున్నది. పోలవర వాసులయిన పెద్దలుకూడ, భద్రాచలమునుండి వలసవచ్చిన సీతారాములు, సంతమామిళ్లలో నయిదుమాసము లుండినట్లు చెప్పుకొను పరిపాటి నేఁటికినికూడ గలదు. ఈ పద్యమునందే 'హరవృషభ మధ్యమున నుండుట' యనినాఁడు. హర వృషభ మనఁగా మహానందీశ్వరము కానోపును. తన్మధ్యమునఁగూడ నుండెనా? యను సంశయము. లేక మహానందీశ్వరమునకుఁ బట్టిసము నకుఁ నడుమ నుండిన పోలవరమునే హరవృషభ మధ్యమని పేర్కొని యుండనోపు.

భద్రాచలమునుండి సీతారాములు వలసవచ్చి పోలవరమునఁ దత్సమీపమున నుండినది అయిదు సంవత్సరము లనియు, ఆ వెనుక మరల నా విగ్రహములు భద్రాద్రికిఁ గొంపోఁబడినట్టులును నీ క్రింది పద్యములు తెలుపుచున్నవి.

సీ॥ సర్వధారను పేరి సంవత్సరంబున
ధంసాకు వెడలచి యిద్దరికి వచ్చి
పోలవరంబులోఁ బొలుపొంద నైదేండ్లు
వనవాస మొనరించి వరుసతోడ
శాక్తేయ మతయుతు సంహార మొనరించి
మంత్రాంగ శక్తి యిమ్మహిని నిలిపి
తగ పూసపాటి విజయరామరాజ సీ
తారామ రాజులతో రయమున
విజయ సంవత్సరంబున విజయముగను
భద్రగిరికేఁగి తౌనయ్యె భద్రముగను భద్ర 101

సీ॥ శబరివిందయ్యెనే సరభసంబున మీకు
భావింప రామలదేవు భక్తి
హనుమంతుఁ డయ్యెనే యతిసాహసుండగు
జోగి పంతుల యుక్తిచూడ మీకు

సుగ్రీవుఁ డయ్యెనే సారిది గోరుందొర
కష్టాను ఘనుఁడు మీా కార్యమునకు
ఘనఋశ్యమూక మయ్యెనె రాజమాహేంద్రి
వర మెన్న మీా మనోవాంఛ దీర
కాక యుండిన నిచ్చటి రాక కేమి
కారణం బెన్న మీావంటి ఘనున కరయ 40
సీ॥ జోగి పంతులకు మెచ్చులు గూర్చఁ బోతివో
యింగిరీజులప్రాపు నిచ్చగించి 41

ఈ పద్యములలోఁ జేర్కొనిన రామలదేవు, గోరుందొర పూసపాటి విజయరామరాజు సీతారామరాజులు బొబ్బిలి యుద్ధమునకు సంబంధించిన వారు గావున, వారి కాలనిర్ణయమును బట్టి, అప్పటి సర్వధారి విజయనామ సంవత్సరములు లెక్కించి, యీా భద్రగిరి శతకము 1770, 76 సంవత్సరములలో రచింపఁబడి యుండునని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 'చారిత్రక శతకములు - భద్రగిరి శతకము' అను వ్యాసమునఁ జర్చించియున్నారు[1]. శ్రీ శర్మగారా వ్యాసమున జోగిపంతులును గూర్చి చర్చింపలేదు. ఇంగ్లీషు వారి ప్రాపకము సంపాదించిన జోగిపంతులు - అనఁగా ఈస్టిండియా కంపెనీవారితోఁ బరిచయము నార్జించి, నిజామునుండి కోస్తాజిల్లాలను కౌలుగా కంపెనీవారికి నిప్పించిన కాండ్రేగుల జోగిపంతులుగారు. వీరు 1772 లో గతించినట్లులును శ్రీ రాళ్లబండి సుబ్బారావుగారు Compeny and the Kandregula family అను వ్యాసములోఁ దెలిపియున్నారు[2]. ఈ వ్యాసములలో కాండ్రేగుల జోగిపంతులుకు నైజామునకు ఈస్టిండియా కంపెనీవారికిజరిగిన యుత్తర ప్రత్యుత్తరములతోఁ గూడిన చరిత్రమంతయు స్పష్టముగ నిరూపింపఁబడియు

1. చూ. భారతి. సం. 29. సంచిక 10. పుట 370.

2. J. A. H. R. S. Vol 8. Page 213.

న్నది. కావున శ్రీ శర్మగారు నిర్ణయించిన కాలమున కించుమించు సమయమునందే, యీ ధంసా భద్రాచలాలయమును ధ్వంసముచేయుట, రాజమహేంద్రవర వాసియైన జోగిపంతులు సాయమున సీతారాముల విగ్రహములు పోలవరము సమీపమున రక్షితమైయుండుటయును సరిపడియే యున్నది. ఈ విగ్రహములు పోలవరమునం దయిదు మాసములుండిన తరువాత కొదువ సమయమున పట్టిస శ్రీ వీరభద్రగిరిపై నుండి, తరువాత భద్రాచలమునకుఁ గొనిపోఁబడఁగా, ఆ విగ్రహములకుఁ బ్రతినిధిగ సీతారాముల విగ్రహములు నెలకొల్పి యాలయము నిర్మించుట జరిగినది. తత్ప్రాంత వాసులైన పెద్ద లీ విషయమునకిట్టి యైతిహ్యము గలదని వాకొనుచున్నారు.

మఱియు శ్రీనాథుఁ డానాఁటి పట్టిసమునుగూర్చి యిట్లు వర్ణించినాఁడు.

సీ॥ అంతఃప్రవాహమై యావిర్భవించె నే
 ధరణీధరము పొంతఁ దల్లి బావి
పాఱె నేశైలంబు పాదమూలంబునఁ
 గల్లేటితో వృద్ధగంగ వారి
యుదయించె నేకొండ యుత్తరాశారసా
 తలకుక్షి సప్తగోదావరంబు
జనియించె నేశిలోచ్చయము దక్షిణమునఁ
 గణ్వవాహిని యుప్పుకడలికొమ్మ
పద్మగిరి తోడఁబుట్టువే పర్వతంబు
బలసి యుండు నే యద్రికిఁ బంచలింగి
యట్టి వీరభద్రాఖ్య మహాచలమున
కరుగుదెంచెను వింధ్యమదాపహారి.

వీరభద్రగిరికి దక్షిణోత్తరకోణములలో రెండు జలకుండములు గలవు. అందు దక్షిణకుండమును భద్రతీర్థ మనియు, ఉత్తరకుండమును చక్ర

తీర్థ మనియు నేఁడు వాకొందురు. ఈనాఁడు గోదావరి మేట వేసియుం డుటచే రెండును గానవచ్చుట లేదు. చక్రతీర్థమునకు మీఁద భావనారా యణస్వామి యాలయము. అప్రదేశమున కొండకొన పెద్దబావి యాకృతి గలిగియున్నది. శ్రీనాథుఁ డీ పద్యమునఁ దల్లి బావి యనిన దిదియే యేమొ? లేక భద్రకుండ మన భద్రకాళి యా కుండము నుండి యావిర్భవించెనని యచటి వారు వాకొనురీతియే యథార్థమైనచో నదియేని తల్లి బావి కానోపును. గోదావరీ ప్రవాహమున నా మేట కరగిన నాతీర్థములు రెండును వేర్పాటుగఁ గానవచ్చునని యచటి వారు చెప్పిరి.

ఈ పర్వతపాదము నొరసి కల్లేటితోఁగూడ వృద్ధగంగ వారి ప్రవ హించె ననినాఁడు. ఈపర్వతపాదముఃమీఁదికి ప్రవాహపువాలుగల ఏటి కాలువ యొకటి గలదు. ఆవాలు నీనాఁడు ఏటియొడ్డు అడ్డినది. దాని నిప్పుడు 'కడెమ్మకాలువ'యని యందురు. 'కల్లేరు' అనున దిదియే కానోపును. గోదావరి మహానందీశ్వరమునుండి కొంత విపులరూపమై యీ పర్వతముదగ్గరనుండియే గోదావరి సప్తశాఖా విజృంభణమున కనువైన వైశాల్యము నొందినది. ఈ కొండ కుత్తరదిక్కు నందలి పాతాళతలమునుండి సప్తగోదావర ముదయించినదనినాఁడు. భీమేశ్వర ప్రతిష్ఠాసమయమునకు గౌతమిని గొనిపోవచ్చిన సప్తర్షులు గౌతమీ ప్రవాహమును ముక్తకంఠముఃతోఁ గొనియాడి యంతఃప్రవాహ ముగాఁ గొనిపోయిన దీ పర్వతమున కుత్తరముగ నుండిన మహానందీశ్వ రముకడనుండియే యేమో? ఈ శిఖరికి దక్షిణముగ పండ్రెండుక్రోసుల మేరలో కపిలేశ్వరపురమునొద్ద కణ్వానది యుద్భవించి, అంగర ఱేకె గంగవరము మున్నగు గ్రామముల మీఁదుగాఁ బ్రవహించి, కోటిపల్లికి రెండుక్రోసులక్రింద ఆత్రేయినది పుట్టిన 'రామఘట్టము'లనుచోట మరల గౌతమిలోఁ గలసినది. ఈ వీరభద్రగిరిని పద్మగిరికిఁ రాజమహేంద్ర

వరమునందలి పుష్కరగిరికిఁ దోఁబుట్టువును జేసినాఁడు. గోదావరి రైల్వేస్టేషను క్రిందిచేవులోఁ నిలుచుండి చూచిన వీరభద్రగిరియు, వీర భద్ర గిరిమీఁద నిలుచుండిచూచిన పద్మగిరియుఁ గానవచ్చుచుండును. పద్మగిరిపై మార్కండేయస్వామి నిలిచియుండుటయును నీ రెండుపర్వత ములను తోడఁబుట్టువుగ నమర్చియుండును.

ఈ రెండు పర్వతశిఖరములను గలిపి శ్రీనాథుఁడొక మధుర దృశ్యమును జిత్రించి మనయెదుటఁ బెట్టినాఁడు.

గీ॥ పంకజాక్షుఁ డధరము వీరభద్రగిరియు
నంధ్రభూమికి వక్షోరుహద్వయంబు
భువనచక్షుఃకరంభ మంభోరుహాక్షి
గౌతమీగంగ ముత్యాల కంఠమాల.

పుష్కరగిరి, వీరభద్రశిఖరియు నాంధ్రభూమి యను వనితకుఁ జతఁగూడిన వక్షోరుహముల జంట. ఈ రెండుగిరుల నొరసికొనుచు ప్రవహించు గౌతమీప్రవాహ మాజంట కొదవిన ముత్యాల కంఠమాల.

శిఖరయుతమయిన వక్షోరుహద్వయము చూచెడివారి కన్నులకొక ఖాద్యము. అందును ముత్యాలమాలచే నలంకరింపఁబడిన యాజంట దధిసక్తు సమ్మేళనమువలె మధురతరఖాద్య మనుట.

వీరభద్రగిరిని జుట్టుకొని పంచలింగములు గలవనినాఁడు. పోయి చూడఁగాఁ, నాపర్వతముమీఁద వీరభద్రేశ్వరలింగము, ప్రాకారపుఁ దిరుచుట్టుమాలెలో విశ్వేశ్వరలింగమునుదక్క మఱేలింగములు గాన రాలేదు. ఒకప్పు డీ పంచలింగములు నీపర్వతమును జేరియుండె ననఁగా, మీఁదనుండిన మహానందీశ్వరుఁడు, అచటికి మూఁడుక్రోసుల మేరలో, వేణీశ్వరపురమునఁ గల తిలసోమనాథుఁడును, అచటికి రెండుక్రోసుల క్రింద అనంతభోగేశ్వరుఁడు (ఈనాఁడీతఁడు గౌతమీతీరమునువదలి కుమారదేవమను గ్రామమునకుఁ గొనిపోఁపబడినాఁడు)ను, రాజ

మహేంద్రవరమునందలి మార్కండేయస్వామి, పట్టిసమునకుఁ దూర్పుగ నావలియొడ్డునందున్న రామలింగేశ్వరుఁడును గలిసి పంచలింగములై యుండు నేమో?

రుద్రపాదములు :— బద్మాద్రిపై రుద్రపాదము లనుటచే పుష్కరగిరిపై రుద్రపాదము లుండవలయును. నేఁ డవి యెచ్చటను గానరావు. ఈ పద్మగిరి కెదురుగానుండిన కొవ్వూరును గోపాదక్షేత్ర మందురు. దీనికి రెండుక్రోసుల క్రిందనుండిన ధవళగిరిని రామపాదము లందురు. ఈ రుద్రపాదముల నర్చించినవెనుక నగస్త్యుఁడు చేరువనున్న మార్కండేయ శివుని భజించె ననుటచే,రుద్రపాదములు మార్కండేయ శివుఁడు నొండొరులు సమీపమందుండె ననుట స్పష్టము. భీమేశ్వర పురాణమున రాజమహేంద్రవరమును వర్ణించునపుడుగూడ శ్రీనాథుఁ డీ క్రిందిపద్యమున మార్కండేయస్వామి రుద్రపాదములు సమీపమున నుండినట్లు వర్ణించినాఁడు.

సీ॥ కమలాచలాగ్ర మార్కండేయ శివశిర
శ్శశిచంద్రికాధౌతసౌధవీధి
గోదావరీ పుణ్యకూలంకషాజల
స్ఫారితశ్రీరుద్రపాదయుగళి
సాంద్రవిభవంబు రాజమహేంద్రవరము.

కమలాచలము:— అనఁగా పుష్కరగిరికి పద్మాద్రి పుండరీకాద్రి-యనునవి పర్యాయపదములు. ఈ పర్వత మిపుడు గోదావరి రైల్వేష్టేషను పరిసరమునఁ గల మెట్ట. దీనికొక కొన నున్నాఁడు మార్కండేయస్వామి. ఈమార్కండేయస్వామి పూర్వ మిచట నుండెడి వాఁడుకాఁడు. ఇప్పుడున్న చోటికి నుత్తరముగ పుష్కరగిరి రేవునకుమీఁద నుండెడి ప్రదేశమున నుండెడివాఁడఁట. ఈ నడుమ ఆ ప్రదేశమున (Water works buildings) నీటినప్లై భవనములు నిర్మించుటకై

యచటి మెట్టను త్రవ్వఁగా ఆలయశిథిలములు గానవచ్చినవి. అవి ప్రస్తుతము మదరాసు పురాతన వస్తుపరిశోధనాలయము వారి యధీనమునందున్నవి. అదియునుగాక మార్కండేయ శివలింగముకూడ నిప్పుడుండెడి లింగముకంటె నెత్తుగ నుండవలెనేమో! యని యొక యూహ. కారణమేమన భీమేశ్వరుని మహాత్త్వమునుగూర్చి తెలుపుచు భీమేశ్వరపురాణములో శ్రీనాథుఁడే.

మ॥ సరిసామంతుఁడు శ్రీకుమారవనికాచాళుక్య భీమేశ్వరే
శ్వరదేవుం డుపకంఠబాంధవుఁడు శ్రీసంవేద్యరాడ్భైరవుం
డిరువుం బొర్వును బల్వలేశుఁడు మృకండేశుండుగా నేలెని
ద్ధరణీమండలి భీమనాథుఁడు నిరాతంకప్రతాపోన్నతిన్.

అని తెలిపియున్నాఁడు. ఈ పద్యములోఁ బేర్కొనిన చాళుక్య భీమేశ్వరుఁడు (సామర్లకోట భీమవరములోని భీమేశ్వరుఁడు) దక్షారామ భీమేశ్వర లింగమునకు సరియైన యెత్తుగలది. దక్షారామమున కుపకంఠమునందున్న భైరవేశ్వరలింగముకూడ సుమారు రెండున్నరఅడుగుల ఎత్తుగలది. ఇరుగుననున్న పల్వలేశ్వరలింగము (కొప్పులింగేశ్వరలింగము) భైరవేశ్వరునితో సమానమైన యెత్తుగలదిగ నున్నది. కావునఁ బొరుగుననున్న మార్కండేయస్వామి లింగముకూడ అంతయెత్తు గలిగి, పలివెల దేవాలయముతో సమానమయిన యాలయము గలిగి యీ పద్మగిరి శిఖరముమీఁద శ్రీనాథునినాఁటి కుండి, తరువాత భగ్నమై యుండ వచ్చును.

ఈ పద్మగిరి శిఖరముపై నానాఁడు మార్కండేయస్వామి యుండెననుట నిశ్చితము. ఈ పర్వతమం దుండెడి రుద్రుఁడు మార్కండేయస్వామియైనపుడు ఆతని పాదములు రుద్రపాదములు కావలయును. కాని యట్టి రుద్రుని పాదచిహ్నము లెచటను గానరావు. ఇది యెట్లా? యని చిరకాలమునుండి చింతించుచు, పాదశబ్దమునకు సంస్కృతమున

"పాదాః ప్రత్యంత పర్వతాః" అను అమరకోశమును బట్టి పర్వతపాద మర్థమగును గాన, రుద్రపాదము లనఁగా మార్కండేయ రుద్రుఁడు నెలకొనిన పద్మాద్రి పాదము లగునేమో! యను నొక యూహపొడమి నది. అదియునుగాక శ్రీనాథుని వర్ణనములో గోదావరీ నదియొక్క పవిత్రమైన ఒడ్డుల నొరసెడి జలముచేఁ బెంపొందింపఁబడిన రుద్రపాదముల జంట యనుటచే, గోదావరీ ప్రవాహవేగముచే రాపిడిగొను పాదముల జంట పర్వతపాదము లనుటలో సందియము గానరాలేదు. కాని ఒక పర్వతపాదము ప్రస్తుతము మునిసిపల్ హైస్కూలు ప్రాకారము క్రింద గోదావరిలోనికిఁ జొచ్చుకొని యున్న రాతిగుట్ట స్పష్టముగఁ గానవచ్చుచున్నది. రెండవ పాద మెక్కడ నుండునా? యనుకొని, దానికి 150 గజము లుత్తరముగనుండిన యెత్తయిన రాతిగుట్ట యగునేమో? యను నూహతోఁ బరికించితిని. ప్రస్తుత మారాతిగుట్టమీఁద ప్రభుత్వమువారి బాంకు (State Bank) కార్యాలయ మున్నది. ఆ గుట్టను వెనుక తట్టునకుఁబోయి చూడఁగా నదియు గౌతమిలోనికిఁ జొచ్చుకొని యున్న పర్వతపాదమే యని స్పష్టమయినది. కావున రుద్రపాదము లనఁగా నీ పర్వతపాదములే యని నిశ్చయించుకొంటిని. జంటగా నున్న రాతిగుట్టలీ రెండే కాని వేఱొకటి రాజమహేంద్రవరమునఁ గానరావు. అదియునుగాక, పుష్కరపుణ్య సమయములో గౌతమిలో స్నానము చేయఁ గోరువారు రుద్రపాదముల నడిమితీర్థము పవిత్రతరమని భావించి యచటనే స్నానముచేయు పరిపాటి చిరకాలముగ వచ్చుచుండుటయు నివియే రుద్రపాదము లనుటకుఁ దార్కాణము.

అగస్త్యుఁ డిటులు పద్మాద్రిమీఁది రుద్రపాదము లర్చించి, తత్సమీపమునందుండిన మార్కండేయ శివుని సేవచేసి, గౌతమీతీరమున ముందునకు సాఁగినాఁడు. రాజమహేంద్రవరమునకు పది క్రోసుల మేరలో కోటిపల్లితీర్థము. అచటికి మఱి యెనిమిది క్రోసులమేరలో కుండలాముఖ

తీర్థము. కోటిపల్లిలో గౌతమిని మాతృగమనాఘహారిణి యని యందురు. అచట గజపతుల పాలనములో నాలయప్రాకారాది నిర్మాణము జరిగినది. ఆలయమున సోమేశ్వరుఁడు కోటీశ్వరుఁడు ప్రధానదైవతములు. కుండలాముఖతీర్థము వృద్ధగౌతమీతీరమున. ఆతీరమున కుండలేశ్వరుఁడు. ఈశ్వరుని ముఖము కుండలాకారము గలిగియుండుటచే కుండలేశ్వరుఁడయినాఁడు. గౌతమీతీరమునందలి తీర్థములలో క్షేత్రములలో నీ రెండును పవిత్రములును దివ్యములును. పల్వలస్థానము - పలివెల. అచట నగస్త్యుఁడు భూతభర్తను (పరమేశ్వరుని) తన పేర నిలిపినాఁడు. అచటి యీశ్వరుఁడు అగస్త్య ప్రతిష్ఠితుఁడు. తొలుత అగస్త్యేశ్వరుఁడు. తరువాత పూజరి భక్తివిశేష ప్రదర్శనమున కొప్పు దాల్చి యీనాఁడు కొప్పు లింగేశ్వరుఁడైనాఁడు. శ్రీనాథుఁడు భీమేశ్వర పురాణమున—

వాఁడె మాయింటివేల్పు పల్వలపురమునఁ
గొప్పులింగంబు ఫణిరాజకుండలుండు.

అనినాఁడు. నాగాభరణము మూలకారణముగ అగస్త్యేశ్వరుఁడు కొప్పు లింగేశ్వరుఁడైనాఁడు. ఈ యితివృత్తము నేను రచించిన కుసుమకుంతలమను కావ్యమున వివరించియుంటిని. ఈ పలివెల సమీపమునఁ బ్రవహించునది 'కౌంతేయి' దీని నీనాఁడు 'కౌశికి' యని యందురు. వృద్ధగంగ యనఁగా వృద్ధగౌతమి. దీని ప్రారంభ మెచ్చటనో సరిగాఁ దెలియవచ్చుటలేదు. తొత్తరమూడి శానపల్లలంక రాఘేలంక క్రొత్తలంక కుండలేశ్వరము మీఁదుగా బ్రహ్మసంవేద్యమున (కొత్తపల్లి లైట్ హౌస్ దగ్గఱ) నీనది సముద్రగామి యగుచున్నది. ఈ రెండు నదులలోను స్నానముచేసి సప్తగోదావరమునకుఁ జేరినాఁడు. సప్తగోదావర మనఁగా దక్షారామమున భీమేశ్వరస్వామి యాలయమునకు తూర్పుగ నుండిన యీనాఁటి చెరువు.

వేటికడఁ గోళ్లఁ గూడి మున్నీటిఁ గవయు
మొగులు బడి వాహినుల కెల్లు మురియ వచ్చు
సప్తమునిరాట్పవిత్రాప సంప్రాప్తమైన
సప్తగోదావరంబుతో సాటిమహిమ.

అని శ్రీనాథుఁడు సగర్వముగ వర్ణించిన దివ్యతీర్థ మిది. భీమేశ్వరుని దక్షా రామమునఁ బ్రతిష్ఠ సేయునపుడు సప్తమహర్షులు గౌతమిని ప్రార్థించి యంతఃప్రవాహనుగాఁ గొని తెచ్చి నిలిపిన తీర్థ మిది.

అట్టి పరమపవిత్రమైన తీర్థము గావున శ్రీనాథుఁ డచట లోపాముద్రచే స్నానము చేయించి భీమేశ్వరుని దర్శింపఁ జేసినాఁడు.

ప్రాతఃకాలమునందుఁ దీవ్రభానుఁ డుదయింప స్సప్తగోదావర
స్రోతఃపూరమున న్మునింగి యభవుఁ సోమార్థచూడామణిన్
జ్యోతిర్లింగమయస్వరూపుఁ గొలిచెన్ శుద్ధాంతరంగంబునన్
బాతివ్రత్య మహాపవిత్రభావనిధి లోపాముద్ర భీమేశ్వరున్.

లోపాముద్ర పాతివ్రత్యము నుగ్గడించుటకీ పద్యము నుపక్రమించిన శ్రీనాథుఁడు భక్తి ప్రవాహములోఁ దాను మునిఁగి లోపాముద్రను సప్తగోదావర స్రోతఃపూరమున మునిఁగించినాఁడు. లేకున్న సరోవర రూపమయిన సప్తగోదావరమునకు స్రోతఃపూర మెక్కడిది ?

ఇఁక నచట శ్రీనాథునినాఁడు భీమేశ్వరునకు జరుగు శనివారోత్సవము, గంధర్వాప్సరో నృత్యములు వారికిఁ గాన్పింపఁ జేసినాఁడు.

మునిచూడామణి యెల్ల సత్కళలకున్ మూర్ధాభిషిక్తుండు గా
వునఁ జారీకరణాంగహారముల తావుల్ మెచ్చి కీర్తించుచున్
శనివారోత్సవవేళఁ గన్గొనియె నాస్థానంబునన్ రాజ నం
దనయుం దానును దేశి మార్గముల గంధర్వాప్సరో నృత్యముల్.

అగస్త్యుఁడు మునిశిఖామణి. కళా సార్వభౌముఁడు. కావున నాతఁడు భీమేశ్వరున కుత్సవసమయమున దక్షారామమున జరుగు గంధర్వాప్సరో

భామినీ దేశి మార్గ నృత్యముల తారతమ్యములు లెక్కించుచు మెచ్చి కీర్తించినాఁడు. తనవెంట వచ్చిన లోపాముద్రయు రాజనందన కావున కళాప్రియ. ఆమె కూడ నానృత్య సందర్శనమునఁ బ్రొద్దుఁగాని వినోదించినదఁట. ఈ ప్రదర్శనము శ్రీనాథునినాఁడు దక్షారామమున దేశిమార్గ నృత్యములు సాగుట, ప్రభువులు వానిని ప్రదర్శించి మెచ్చుకొనుటయు నిందు ధ్వనింపఁజేయుచున్నది.

దక్షారామ భీమేశ్వరాలయమున ప్రాకారములోపల శనివార మంటపము సోమవార మంటపము అని రెండు పెద్ద మంటపములు గలవు. ఆనాఁడచట స్వామికి నాయావాసరములం దుత్సవములు జరుపుట, వేశ్యలు నాట్యభంగిమలచే స్వామి నారాధించుట, పరమేశ్వర భక్తులా ప్రదర్శనములఁ బ్రొద్దుపుచ్చుటయు నిట వివరింపఁబడినది. మఱియు నానాఁటి రెడ్డి ప్రభువులు కళాపోషకులు. వారు పరమేశ్వరు నారాధించు సమయమున నాట్యోపయుక్తమయిన వాద్యములు మ్రోయుచుండ నాట్యకత్తెలు నాట్యములు చేయుచుండుట పరిపాటియైనట్లు లీ పద్యము తెలుపుచున్నది.

ఉ॥ వల్లకి చక్కి కాహళము వంశము డక్కవాయిదుక్క ఝర్ఝరుల్
ఝల్లకి యాదిగాఁగలుగు శబ్దపరంపర తాళశబ్దమై
యుల్లసిలం బ్రబంధముల నొప్పుగ నాడుదు రగ్రవేదిపైఁ
జల్లవపాణు లీశ్వరునిఁ బంటమహేశులు పూజసేయఁగన్.

కాశీ. ౧. ౫౬.

అట్టి యుత్సవవేళలలో నాఁటి ప్రభువులు నాట్యభంగిమలందలి న్యూనాధిక భావములను మెచ్చుకొనుచుండుటను మనకెఱిఁగించుటకై శ్రీనాథుఁడు మునిచూడామణి నెల్లసత్కళకు మూర్ధాభిషిక్తుని జేసి, రాజనందనను వెంటఁబెట్టుకొని యాస్థానమున నాతఁడు దేశిమార్గముల గంధర్వాప్సరో నృత్యముల దర్శించినట్టులు చిత్రించినాఁడు. ఈ పద్యమున కాశీఖండ

కృతిభర్తయై కళాప్రియుఁడు పోషకుఁడునైన వీరభద్రారెడ్డి, అతని దేవేరి కళాప్రియ కాటయ వేమారెడ్డి కూఁతురగు అనితల్లియు దక్షారామ భీమేశ్వరారాధకులై యాస్వామిని గొలిచిన తీరుకూడ ధ్వనించుచున్నది. ఇంతకును శ్రీనాథునకు దక్షారామభీమేశ్వరుఁ డనినను, గంధర్వాప్సరో నృత్యము లనినను మిక్కిలి మక్కువ. సహజముగఁ గళాప్రియుఁడు తన కుండెడి కళాప్రియత్వము మునిచూడామణికి నేర్పరించి, యచటి నాట్య భంగిమల నాతని గన్గొనఁ జేసినాఁడు. అంతలో శరద్వేళ యేతెంచినది. శరద్వేళ భీమమండలి నేవుగొన్న పంటలసౌరు నెంతయు హృద్యముగ వర్ణించి, దక్షారామభీమేశ్వరున కావేళ జరుగు నుత్సవములలో జ్వాలాతోరణ మహోత్సవమున నా దంపతులు పాల్గొనునట్టులు చేసినాఁడు.

కార్తికిక వేళ భీమశంకరుని నగర
వింధ్యసంస్తంభయితృ దూఱె విమల బుద్ధిఁ
దొయ్యలియుఁ దాను చిచ్చుల తోరణంబు
కలుష సంహతి సంహార కారణంబు

ఈ జ్వాలాతోరణమున దూఱుట పాపహార మను విషయమును భీమఖండమునం దిట్లు తెలిపినాఁ డగస్త్యుఁడే వ్యాసునకు—

కార్తికిక వేళ భీమశంకరుని నగరఁ
దూఱు నెవ్వాఁడు చిచ్చుల తోరణంబు
అతఁడు దూఱఁడు ప్రాణ నిర్యాణవేళ
ఘోరయమపట్టణద్వారతోరణంబు. భీమ. 3. ౨౫.

దక్షారామమున తరుణేందుశేఖరుఁ డయిన భీమనాథుని వీక్షించినది మొదలుగ మహర్షికి కాశీక్షేత్రమును జూచినట్లు లనిపించినది. అందులకుఁ గారణము దక్షారామము దక్షిణ కాశి యగుటయే. తీర్థక్షేత్ర పరిస్థితిలో దక్షారామము కాశికి సర్వథా సమమైనదని అగస్త్యుఁడే వ్యాసున కిట్లు తెలిపియున్నాఁడు.

సీ॥ భీమేశ్వరేశ్వర శ్రీ మహాదేవుండు
హిమధామ మౌళి విశ్వేశ్వరుండు
సప్తగోదావర సలిల ప్రవాహంబు
సాక్షాత్కరించిన జహ్నుకన్య
తిరుచుట్టు మాలెలోఁ దిరమైన గణపతి
యేకాంతదుంఠి విఘ్నేశ్వరుండు
దక్షిణంబున నున్న దండపాణికుఁ దూ
హింపంగ దండపాణీశ్వరుండు
భైరవస్వామి శ్రీ కాలభైరవుండు
నంది నందీశ్వరుం డేమి నందియంబు
దక్షవాటంబు కాశికాస్థలముగాదె
తీవ్రకర తేజ సత్యవతీతనూజ. భీమ. 3-38.

క॥ దక్షిణ వారాణసి యగు
దక్షారామంబు సొచ్చి తరుణేందుధరున్
వీక్షించిన గోలెను గా
శీక్షేత్రాలోక సుఖము చేకుఱె ఋషికిన్.

క॥ క్లేశంబును సౌఖ్యంబును
నాశువునను గుంభజన్ముఁ డభిమన్నించెన్
గాశీవిరహము దక్షిణ
కాశీసంగమము వరుసఁ గలిగిన కతనన్.

దక్షిణ కాశీ దర్శనమునఁ గొంత సుఖము కలిగినను, వెన్వెంటనే కాశీ వైభవము జ్ఞప్తికివచ్చి, తద్విరహ దుఃఖము మనమున నుబికినది. తన్మూలమున భావశబలత యేర్పడినది.

ఇవ్విధంబున భోగమోక్ష నివాసంబైన దక్షారామంబునఁ గొన్ని దినంబులుండి కొల్హాపురంబున శ్రీ మహాలక్ష్మి దర్శింపంబోఁ దలఁచిన యగస్త్యుని శ్రీనాథుఁడు పట్టిసము మీఁదుగాఁ బయనింపఁజేసి యచటి విశేషములను లోపాది కుగ్గడింపఁజేయుచు నిట్లనినాఁడుఁ

బ్రహ్మాసంవేద్య మాదిగాఁ బట్టి పాంత
మతివ గోదావరీ నదీహారమునకు
నడుమ నాయకరత్నమై నలువు మిగులుఁ
బంచలింగాశ్రయము వీరభద్రశిఖరి.

గౌతమీశాఖ సరాసరిగఁ బ్రవహించుచుఁ బోయి బ్రహ్మాసంవేద్య మను చోట సముద్రమునఁ గలియును. అది మొదలు పట్టినమువఱకు నుండిన గోదావరీ నది నొక హారముగఁ జేసి, ఆ హారమునకు నడుమ నాయక రత్నముగాఁ జేసినాఁడు గోదావరీ మధ్యమునందుండిన వీరభద్రగిరిని. కేవల మాం పర్వతమునుగాదు. పంచలింగాశ్రయమైన శిఖరిని. గోదా వరీ నది నాశికాత్ర్యంబకము మొదలుగఁ బట్టినమువఱకు నేకశాఖగాఁ బ్రవహించి, యీ పర్వత ప్రాంతమునుండియే రెండు పాయలుగ విడు టకుఁ దగిన విస్తృతి నందినది. రాజహేంద్రవరము దాఁటిన తరువాత గౌతమి వశిష్ఠ యను రెండు ప్రధానశాఖలుగఁ జీలినది. గౌతమి శాఖ బ్రహ్మాసంవేద్యము దగ్గఱను, వసిష్ఠ అంతర్వేదియొద్దను సముద్ర మునఁ జేరినవి. ఈ రెండు శాఖలును గోదావరీ నదీ హారమునకు రెండు పేటలవలెనే యొప్పారును. ఆ పేటలకు నడుమ, నీ వీరభద్ర శిఖరి బాగుగ భావనచేసిన నిశ్చయముగ నొక నాయకమణివలెనే యుండును. ఇది శ్రీనాథుని భావన, దీనిలో నాతని నిశితమైన పర్యవేక్షణతోఁ గూడిన శిల్పచాతురి మనకు గోచరించును.

లోపాముద్రకు వీరభద్రశిఖరి మాహాత్మ్యము నెఱిఁగించి యగస్త్యుఁ డితరా రామములందలి చంద్రశేఖరుల నారాధించి ముందు నకుఁ గదలెనఁట. దాని నిట్లు వాకొనినాఁడు.

వ. అని చెప్పి యచ్చోటు గదలి ప్రతిదివస ప్రయాణంబుల—

కII క్షీరారామంబునఁ బ్రా
చ్యారామంబున నాదిమారామమునం
దారాధిపచూడామణి
నారాధించెను మునీంద్రుఁ డతివయుఁ దానుꣳ. కాశీ 3-37

ఈ పద్యమునఁ బేర్కొనిన క్షీరారామ మనఁగా పాలకొలను. ఈనాఁటి

పాలకొల్లు. ప్రాచ్యారామము ఆదిమారామము అనఁగా నేమో విచారణీయములుగనే యున్నవి. ఆదిమారామము దాక్షారామ మనుకొనిన ప్రాచ్యారామము కుమారారామము (సామర్లకోట భీమవరము) కావలయును. కాన శ్రీనాథుఁడు భీమేశ్వర పురాణమునందు పంచారామముల యుద్భవమును గూర్చి తెలుపుటలో ఆదిమారామమును అమరారామమునుఁగాఁ దెలిపినాఁడు. దక్షారామమునుండి బయలుదేఱి పట్టిసమునకు వచ్చిన అగస్త్యుఁడు మరల వెనుకకుఁ బోయెనని చెప్పుట కంటె ముందునకు సాగెననుటయే సమంజసము. ఆకల్పమున ఆదిమారామము అనఁగా అమరావతి యనుకొనిన నచటనుండి కొల్హాపురము, ఆ వెనుక శ్రీశైలము పయనించెననుట క్రమబద్ధమగును. ఈకల్పమున క్షీరారామము తరువాత దర్శించిన యారామము సోమారామము (గునుపూఁడి భీమవరము) కావలయును. అది ప్రాచ్యారామము (తూర్పుదిక్కునందుండిన యారామము) మాత్రము కానేరదు. కావున ప్రాచ్యారామము అనుచోట 'దచ్యారామము' అను పాఠముండి యుండెనేమో? శాసనములలోఁ గొన్నిట సోమారామమునకు దచ్యారామము అను పేరున్నట్లు గానవచ్చుచున్నది.

సీ॥ భీమాపురము డాక్షారామ పాల్కొలను ద
చ్యారామపురి శ్రీమ దమరడాలు
యనను నంద్ర ధరణి పంచారామముల మహా
దేవరలకు............

శాసన పద్యమంజరి. ప్రథమ భాగము. పుట. ౨౯.

ఇందలి దచ్యారామపురి అనఁగా గునుపూఁడిభీమవర మని యీవఱకే నేను దెలిపియుంటిని.

ఈ తీరుగ శ్రీనాథుఁడు కాశీఖండమునందును భీమమండలి వైభవమును వర్ణింపఁదలఁచి, సంస్కృత మూలమునందు లేని విషయమునకు ప్రసక్తి కల్పించి, లోపాముద్రాగస్త్యులను భీమమండలి నంతటను ద్రిప్పి తనకుఁగల యాంధ్రదేశాభిమానమును వ్యక్తము చేసియున్నాఁడు.

# బిందువు

శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణ

అనుస్వారమునకు బిందు వని చింతామణి నామకరణ మొనరించెను. 'బిందు రనుస్వారః' అని చింతామణిసూత్రము. దీని చరితము నరయుట ప్రకృత కర్తవ్యము.

"అను స్వర్యతే, పశ్చాచ్ఛ స్వరవ దుచ్చార్యతే ఇత్యనుస్వారః" అని యజుర్భూషణమున ననుస్వారస్వరూపము నిరూపితము. వెనుకను స్వరమువలె నుచ్చరింపఁబడునది యనుస్వార మని దీనిభావము. ఉచ్చారణసాంప్రదాయమునుబట్టి స్వరానంతరమున స్వరమువలె నుచ్చరింపఁబడుచుండుటంజేసి యిట్లు వ్యుత్పత్త్యర్థము కల్పింపఁబడియుండనోపు. ఈ లక్షణ ముచ్చారణప్రధానముగఁ గల్పింపఁబడినది. పాణినివర్ణసమామ్నాయమున నీ యనుస్వార ముచ్చరింపఁబడకున్నను దత్పాణినికృత సూత్రములందుమాత్ర మీ నామ ముద్ఘాటింపఁబడినది. "మోనుస్వారః" అని పాణినిసూత్రము. "నాసికానుస్వారస్య" అని సిద్ధాంతకౌముదీ వాక్యము. వీనియందేగాక, ప్రాతిశాఖ్యయందును, శిక్షయందును ననుస్వారపదమే నిబద్ధము. సంస్కృతవ్యాకరణములం దెచ్చటను ననుస్వారమునకు బిందుపదము పర్యాయపదముగ వాడినట్లు కానరాదు

ఆంధ్రకర్ణాటకాదివ్యాకరణములందు బిందుపదము చూపట్టెడిని.

చింతామణి ప్రప్రథమమున నీ సంజ్ఞను నిపతించెను. కేతనకృతమగు నాంధ్రభాషాభూషణమందు "నిడుపులమీఁదిబిందు లరబిందు లగుర్" అనియు, "కుఱుచలపైఁ యరబిందులు నెఱయఁగ నూఁదినను జెల్లు" అనియును బిందుపదప్రశంస గలదు. కారికావళికర్త యగు నథర్వణాచార్యుఁడును "శ్లేషే సఖండనిర్బిందోః శ్లేషణం కుత్రచి న్మతం" అనియు, "తృతీయే ప్రథమే వర్ణే పరపవ హి దృశ్యతే, బిందు ర్వైకృత మధ్యే తు నాన్యవర్ణే పరే తు సః" అనియు బిందుపదము నుపయోగిం

చెను. తరువాతివ్యాకర్త లగు నప్పకవ్యాదులు బిందుపదమును విరివిగ నుపయోగించిరి.

కర్ణాటకభాషాభూషణమున బిందుపదప్రశంస గలదు. "నిస్తులోదాత్తముక్తాఫలానుకారీ బిందుః అనుస్వారసంజ్ఞో భవతి. కేవలస్యాస్య బిందోః ప్రయోగాభావాత్ అకార స్సన్నిధీయతే-అం ఇతి" అని కేశిరాజకృతశబ్దమణిదర్పణమున "కెలవు నిజబిందుగళ్, వికల్పార్థబిందుగళ్" అని బిందుపదమే యుపయోగింపఁబడెను.

కర్ణాటకభాషాభూషణమందలి బిందులక్షణమును బరిశీలించిన నయ్యది తద్రూపమాత్రప్రధాన మై యున్నది. సాటిలేని యాణిముత్తెమువంటిది బిందు వని యతనిభావము. అనఁగా గుండ్రముగ ముత్తెము వలె నుండునది. దీని నాధారముగఁ గొనియే గాఁబోలు ద్వితీయాచార్యుఁడును "పూర్ణేందు సదృశః పూర్ణః" అని పూర్ణచంద్రసామ్యమును బిందువునకుఁ బ్రసాదించినాఁడు.

దీనికి రంగ మని మఱియొక నామము గలదు. ఉచ్చరితస్వర స్వభావము ననుసరించి యీ నామ ముత్పన్న మయినట్లు రూపించును. పాణినీయశిక్షయందును, తైత్తిరీయప్రాతిశాఖ్యయందును నీ రంగస్వరూపమునుగూర్చి యీ క్రింది విధమున వ్రాయఁబడినది.

"రంగే ముఖే వ్యాఘ్రురుతోపమం స్యాత్
మాత్రాద్వయం వ్యాజ్జనితం త్వనాస్యం,
నాసిక్యరంధ్రద్వయనిస్సృతోఽంత్యే
స్యా దేకమాత్రః న తు కాకలీ స్యాత్,
సౌరాష్ట్రికాగోపవధూసుకంఠ
స్వరేణ తక్రాఇతి భాషతే యథా
తథా సముచ్చార్య వదేత్ స్వకాలాత్
రంగ శ్చకంపః ఖలు వర్ధతే సః,

యథేంద్రనీలప్రభయాభిభూతః
ముక్తామణి ర్యాతి హి నీలభావం,
తథైవ నాసిక్యగుణేన యుక్తః
స్వరోపి రంగత్వ ముపైతి కృత్స్నః." ఇతి.

వ్యాఙ్జనితమై యనాస్య మగు స్వరధ్వని నాసికారంధ్రద్వయనిర్గత మై కాకలీధ్వనిగా మాఱి సౌరాష్ట్రికగోపకాంతాముఖోచ్చారిత తక్రపద స్వరమువలె వినఁబడుటంజేసి రంగత్వమును బొందుచున్నది. ముక్తామణి యింద్రనీలమణి సంపర్కమున నైల్యమును గాంచునట్లు వ్యాఙ్జనితస్వరము నాసిక్యగుణముచే రక్త మయి రంగ మయినది. మాత్రాద్వయకాలిక మగు నా స్వర మేకమాత్రాకాలిక మాయినది. ముఖ మనెడి రంగస్థలమున నీ స్వరము భూమికాంతరమును వహించుటంజేసి దీనికి రంగ మను పేరు సార్థక మయినది.

ఇట్లుచ్చారణమునుబట్టి సంస్కృతవ్యాకర్త లనుస్వార మనియు రంగము ననియు పిలువఁ, బ్రాచీనాంధ్రవ్యాకర్తలును, కర్ణాటకవైయాకరణులును రూపమునుబట్టి బిందు వని పిలువఁదొడంగిరి. తరువాతివా రందఱు నుభయసాధారణముగఁ బదద్వయము నుపయోగించుకొనిరి.

దీనిస్వరూపస్వభావాదులను బరికింతము. అనుస్వారవిసర్గములు స్వరధర్మములా లేక వ్యంజనధర్మములా యనునది యొక సమస్య. ఋగ్వేదప్రాతిశాఖ్యయందు వానినిగూర్చిన ప్రశంస గలదు."అనుస్వారో వ్యంజనం వా స్వరోవా, స కాంశ్చి త్స్వరధర్మాన్ గృహ్ణాతి. కాంశ్చన వ్యంజనధర్మాన్.తద్యథా, హ్రస్వత్వం దీర్ఘత్వం ప్లుతత్వం, ఉదాత్తత్వం, అనుదాత్తత్వం, స్వరితత్వ మితి. తథా అర్ధమాత్రకాలతా స్వరవశేన ఉదాత్తానుదాత్త స్వరితత్వం సంయోగ శ్చేతి వ్యంజనధర్మాః, తత్రఉభయధర్మయోగాత్ ఉభయస్వభావ స్వరవ్యంజనయో రన్యద్వర్ణాంతరం ప్రకాశయతి. స్వరవ్యంజనాతిరిక్త మన్యద్వర్ణాంతర మేత దితి." పై

వ్యాఖ్యను దిలకించిన స్వరధర్మము లగు హ్రస్వదీర్ఘతాభేదములును, వ్యంజనధర్మము లగు సంయోగాదులును నీ యక్షరములం దుండుటంజేసి యియ్యది యుభయాక్షర మని సిద్ధాంతీకరింపఁబడినది.

చింతామణి యీ యనుస్వారమును రెండు మార్గముల విభజించెను. సిద్ధ మనియు సాధ్య మనియు నియ్యది ద్వివిధము. సహజ మయినది సిద్ధము. వ్యాకరణమున నుత్పన్న మయినది సాధ్యము. ఈ యుభయవిధమును మఱల పూర్ణార్ధభేదమున ద్వివిధ మయినది. ఇట్లు భిన్నంబగు నియ్యనుస్వారము చతుర్విధ మై యున్నది. సిద్ధపూర్ణము, సిద్ధార్ధ మనియు, సాధ్యపూర్ణము, సాధ్యార్ధము ననియు నాలుగు తెఱఁగుల నియ్యది భాషయందుఁ జూపట్టును. ఈ భేదములను దరువాతి వైయాకరణు లందఱు నంగీకరించిరి. కాని వీనిస్థానమును నిర్ణయించుటలో భిన్న మార్గములు గలవు.

చింతామణి హ్రస్వాక్షరముతరువాతఁ బూర్ణార్ధములు రెండును గల వనియు, దీర్ఘాక్షరముతరువాత నర్ధబిందువేగాని పూర్ణబిందు వుండ దనియుఁ జెప్పెను. "హ్రస్వా త్పూర్ణోఽపి భవే ద్దీర్ఘా చ్చే త్ఖండ ఏవ స జ్ఞేయః" అని అథర్వణుఁ డింతతోఁ దనివిసనక మఱికొంత ముందుకు సాఁగినాఁడు. తెలుఁగునఁ బరుషసరళములకుముందే బిందు వుండు ననియు, మొదటి హ్రస్వముమీఁద ఖండబిందు వుండ దనియు, హ్రస్వ మనఁగా స్వర మంతనుండుఁ గలహ ల్లని యర్థ మనియు, కావున నచ్చయిన నుండవచ్చు ననియు, నందుననే 'అఁట, ఇఁక,' ఇత్యాదులందుఁ దప్పులే దనియు వివరించెను.

తృతీయే ప్రథమే వర్ణే పరఏవ హి దృశ్యతే
బిందు ర్వైకృతమధ్యే తు నాస్యవర్ణే పరేతు సః,
న ఖండః ప్రథమాత్ హ్రస్వాత్ ·— అని.

ఈ యాచార్యద్వయము నాధారముగఁ జేసికొని చిన్నయ సూరియుఁ

దన బాలవ్యాకరణమున నీ యభిప్రాయముల కనుగుణముగ సూత్రములను గల్పించెను.

సర్వలక్షణసారసంగ్రహకర్త 'నిడుదలపై నెఱసున్నలు గద్యములం దుండు' నని మఱియొక విశేషమును జూపెను. మఱియుఁ బరుషసరములకు ముందే బిందు వుండు ననుమాటకు బదులుగ నర్ధబిందువు డకారముతోఁ గూడి యుండు నని చెప్పి, 'పడఁతుక, మడఁతుక' యిత్యాది రూపముల నుదాహరించెను.

అప్పకవి బిందువునకు హ్రస్వత్వదీర్ఘత్వ భేదమును నిరూపించెను.

ఇట్లు వివిధభేదములచే నుండు దీనిచరితమును గమనింతము. అనుస్వారాపరనామం బగు బిందువునుగూర్చి సంస్కృతవ్యాకరణమునఁ గొంచెము ప్రశంసయే గలదు. 'అం అః ఇత్యచః పరా వనుస్వారవిసర్గౌ' అనియు, 'నాసికానుస్వారస్య' అనియుఁ జెప్పి యచ్చట ననుస్వారస్థాన నిర్ణయము గావింపఁబడినది. ఒక యన్యాక్షరసాహచర్యమున నియ్యది యుచ్చరింపఁబడుచుండుటంజేసి యీ యనుస్వారము స్వతంత్రాక్షరము గాదు. పరాధీన మైనది. నిపుణముగ నిరీక్షించిన నియ్యది ప్రత్యేకాక్షరము కా దనియు,మకారనకారముల మాఱురూప మనియుఁ దోఁచును. ప్రత్యేకాక్షర మయినచోఁ బాణిని తన వర్ణసమామ్నాయ ప్రసంగమున నేల విడుచు ననియు, మకారనకారస్థానములందే యధికముగ నియ్యది చూపట్టుచుండుటం బట్టియు, నియ్యది ప్రత్యేకాక్షరము కా దని చెప్పవచ్చును.

ఉదాహరణములను బరికింతము.

| | | | |
|---|---|---|---|
| అంకము | వంచన | సంజ్ఞ | దంతము |
| శంఖము | లుంఛనము | మంటపము | పంథ |
| గంగ | కంజము | శుంఠ | కందము |
| సంఘము | ఝుంఝు | దండము | రంధ్రము |
| శంప, | గుంఫితము, | అంబరము | బంభరము |
| సంయమి, | సంరావము, | సంలపనము | సంవత్సరము |

మాంసము - సంహారము - అనురూపములు బిందుయుతము లయి సంస్కృతభాషలోఁ గలవు. మఱియు హారిం వందే, సంజ్ఞ మున్నగు సంధిస్థలములందును నీరూపములు గలవు—కాని 'అనుస్వారస్య' యయి 'పరసవర్ణ' అని పాణిని సూత్రమునుబట్టి వర్గాక్షరములు, అంతస్థములు పర మయినచోఁ బూర్వమందలి యనుస్వారము వర్గపంచమాక్షరముగ మాఱుచున్నది. పదాంత మయినచో వైకల్పికముగ నుభయరూపము నందుచున్నది. సంహారము, సంసారము మున్నగు పదములందుమాత్ర ముపసర్గ మాంత మగుటంజేసి "మోనుస్వార" అను సూత్రమును బట్టి బిందువు వచ్చియుండును. ఉపసర్గ లవ్యయకక్ష్యలోఁ జేరినందునఁ బద త్వసిద్ధికి బాధయుండదు. అట్టి పదసాహచర్యమున మాంసము, అంశము, హంస మున్నగు రూపములు సిద్ధించియుండును.

ఇట్లు వ్రాఁతలో వర్గపంచమాక్షరములతోఁ గూడిన యీ రూపములకు మూలములు మకారనకారము లై యున్నవి. 'మోనుస్వారః, న శ్చాపదాంతస్య ఝలి' అను సూత్రములవలన నా యక్షరద్వయము బిందురూపమును ధరించి కొన్నిచోట్ల వర్గపంచమాక్షరముగను, మఱి కొన్నిచోట్ల బిందురూపముననను గానవగుచున్నది. ఇట్లుండుటచే నయ్యది స్వరధర్మమా! వ్యంజనధర్మమా! యను సందేహమున కాస్పద మయినది.

ఇట్లు మకారనకారముల మాఱురూపమే బిందు వగుటంజేసి యీ బిందువు ద్వైవిధ్యము నందుచున్నది. మకారశ్రవణము గలది పూర్ణబిందురూపమునను, నకారశ్రవణము గలది యర్థబిందురూపము నను మాఱియుండవోపును.

ఈ యర్థబిందువుమాత్రము సంస్కృతమున నక్షరముపై భాగమున వ్రాయఁబడుచు నకారశ్రవణము గలదై యున్నది. 'త్వ కరోషి' 'సంవత్సరః' అను రూపములం దయ్యది స్పష్టము.

ఇట్లు సంస్కృతమున నిష్పన్న మయిన యీ బిందువు తెలుఁగునఁ బ్రవిష్ట మయినదా? లేక తెలుఁగున దీనికిఁ బ్రత్యేకత గలదా? యని యాలోచింపవలసి యున్నది.

నన్నయకుఁ బూర్వములు నతిప్రాచీనములు నగు శాసనములలో బిందువుతోడను, వర్గపంచమాక్షరములతోను రూపములు కానవచ్చు చున్నవి.

క్రీస్తు నకు వెనుక—

| | | |
|---|---|---|
| 641 | లో— | సంవత్సరంబుల్, రక్షిమ్పను. |
| 739 | ,, | విణుంబొది, నాణ్డుం, |
| 850 | ,, | పణ్డరంగులు. |
| 900 | ,, | పట్టంబు గట్టికి |

అనురూపములు గలవు.

నన్నయ తరువాతి శాసనములలో—

| | | |
|---|---|---|
| 1065 | — | కూంతునరియపోల్పంగాంతలెందు. |
| 1066 | — | మానెణ్డు, బోయణ్డు |
| 1080 | — | నరింపంగలవారు - బోయుంగలవణ్టు |
| 1097 | — | పోయంగ్గలవాండు |
| 1187 | — | అనంతవమ్మర్ - సంక్రాంత్తియర్ |
| 1215 | — | గంగగొండ్డ చోడవలనాఁటి |
| 1243 | — | సంక్రాంత్తి, నాంఱు- పఁడ్రెంఁడూ |
| 1230 | — | పూంటకు |
| 1416 | — | కలింగ్గమణ్డల - పుణ్యకాలమండ్డు |

నిట్టి రూపములు గలవు. ఇవి క్రమపరిణతి నంది బిందుయుతము లయినవి. అనగాఁ బ్రథమమున సంస్కృతభాషయందువలె వర్గపంచమాక్షరంబులతోఁ గలిసి యుచ్చరింపఁబడుచు, క్రమక్రమముగ బింద్వగాన

మును ధరించినవి. ఇఁక, అర్థబిందురూపముమాత్రము శాసనములందు లేదు. కాలక్రమమునఁ బూర్ణబిందు వుచ్చారణసమయమునఁ దన సంపూర్ణతను విడిచి సగముగ వినఁబడి యుండవచ్చును. ప్రాచీనులు దాని నర్థానుస్వార మని తలంచి యిట్లు క్రమక్రమముగ దాని స్వరూపమును నియమించి యుందురు. లేదా సంస్కృతమందు 'సఁస్కర్తా' ఇత్యాదులం దానునాసికస్వరము గలదు. దాని ననుసరించి తెలుఁగునను నిట్టి యూనికతోఁ గొన్ని పదము లుచ్చరించియుందురు. వాని సాజాత్యమున నకార జకారములుండు రూపములం దీ యర్థానుస్వారము నిలిచియుండును. లేదా వైదికవాఙ్మయమున నీ యనుస్వారమునకుఁ బలుకుఁబడి విచిత్రముగ నుండును. అందుఁ బ్రాచీనమయిన ఋగ్వేదమునం దయ్యది యధికము. 'ఇదం స్వరము' అనుచోట 'ఇదంగ్ స్వరం' అని యర్థగకారస్వరము వెలువడున ట్లుచ్చరింతురు. లేఖనమున నా స్వరనివృత్తికై 'గ్' అను పొల్లుగకారమును జూపుదురు. ఆ యుచ్చారణము ననునాసికస్వరము వినఁబడును. దాని నాధారముగఁ గొనియైన నీ రూప ముత్పన్నమయి యుండనోపును. లౌకికవాఙ్మయమందువలె నక్షరము పై భాగమునఁ గాక, వైదికవాఙ్మయమందువలె నక్షరము తర్వాతనే యీ బిందువు కానవగుచున్నది. పొల్లుగకారము నడ్డముగ వ్రాసిన యర్థబిందు స్వరూపమును దాల్చుచున్నది కదా !

ఇట్లు పూర్ణార్థరూపములు సిద్ధించియుండ నాంధ్రవైయాకరణులు మఱి రెండు భేదములను గల్పించిరి. సిద్ధము - సాధ్యము అని. సహజముగ పదమం దున్నది సిద్ధము. వ్యాకరణనియమమును బట్టి పదవర్ణాంతరసంయోగమున నేర్పడునది సాధ్యము - తెలుఁగున బిందువు పరుషసరళమునకు ముందే కానంబడును. దానిచే సంస్కృతమందువలెఁ దెలుఁగు పదములందును బరుషసరళములకు ముందు నకారశ్రుతియో, మకారశ్రుతియో యుండనోపును. తదాధారముగ నకారస్థలములం దీ

యనుస్వారము సాధింపఁబడుచున్నది. జకార మిత్సంజ్ఞగాఁ గల ప్రత్యయములు పర మయినప్పుడుకూడ నీ యనుస్వారము పూర్వమందు విధింపఁబడుచున్నది. జకార మనునాసికము గానఁ దత్స్వరశ్రవణము పూర్వము ననే విధింపఁబడి యుండనోపును. ఈ నియమము జిత్తులందు గలదు. కాని జిత్తులందు లేదు. దానికిఁ గారణ మనునాసికాక్షరముమీఁద మఱల స్వరము వినఁబడుచుండుటయే.

ఇది యిట్లుండ నప్పకవి హ్రస్వత్వ దీర్ఘత్వ భేదమున బిందువు ద్వివిధ మని వక్కాణించెను. అర్ధబిందువునకు హ్రస్వత్వసంజ్ఞయు, పూర్ణబిందువునకు దీర్ఘత్వసంజ్ఞయుఁ గలదని చెప్పెను. ఈ భేదమును ప్రాచీనార్వాచీనాంధ్రవైయాకరణు లెవ్వరును జేర్కొనియుండలేదు. ఇట్లప్పకవి విభజించుట కాధారముల నరయుదము. లఘుమాధ్యందినీ శిక్షయందు ననుస్వారమునకు గురుత్వ లఘుత్వ భేదము నిర్ణయింపఁబడెను. అందు హ్రస్వాక్షరముపై నున్న పూర్ణబిందువు గురు వనియు, దీర్ఘాక్షరముపై నున్న పూర్ణబిందువు లఘు వనియుఁ గలదు. హ్రస్వాత్పూర్ణో భవే దీర్ఘో హంస ఇతి నిదర్శనం. దీర్ఘాత్పరో భవేద్ధ్రస్వో మాంసేభ్య ఇతి దర్శనం" అని హ్రస్వముపై నున్న బిందువు గురు వగుటకుఁ గారణము బిందూచ్చారణకాల మధిక మగుటయే. దీర్ఘముపై నున్నచో దీర్ఘమునకే యధికకాల ముచ్చారణసమయమునఁ బోవుమగాన నయ్యది లఘువగును. అందుచేతనే దీర్ఘముమీఁద సాధారణముగ సాధ్యపూర్ణములు లేవు. ఉన్న వన్నియు నర్ధములే 'పూంచు, కాంచు' మున్నగు పదము సుమారు నలువదిమాత్రము భాషయందుఁ బూర్ణబిందుయుతములై చూపట్టుచున్నవి. ప్రాచీనకాలమునుండి నయ్యది యట్లే యుచ్చరింపఁబడుచు భాషలోఁ జేరియుండును.

ఈపై శిక్షాశాస్త్రమును బట్టి యత్యల్పకాలోచ్చారణము గల బిందువులు లఘువు లనియు, నధికకాలోచ్చారణము గలవి గురువు లనియు

స్పష్టమయినది. కాలముయొక్క యల్పత్వాధికత్వములను నిర్ణయించుట బిందుపూర్వస్వరముపై నాధారపడినది. తత్పూర్వస్వరము హ్రస్వమయిన బిందువు గురు వగును. దీర్ఘమయిన లఘు వగును. అప్పకవి స్వరధర్మము లయిన యీ హ్రస్వతాదీర్ఘతలను బిందువులపై నారోపించి యా సంజ్ఞలను వానికిఁగూడ నియమించెను. ఇదియే బిందువు చరితము.

ఓం తత్సత్

# ద్రావిడ భాషలలో బహువచన ప్రత్యయములు

శ్రీ కె. వెం. న్ర. అప్పారావు, ఎం. ఏ.,

"తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును" అని మన ప్రాచీనుల నమ్మకము. ప్రపంచమునందలి భాషలవిషయ మెట్లున్నను భారతీయ భాష లన్నియు సంస్కృతమునుండియే యుద్భవించినవని వారు తలంచిరి. కావుననే తెలుఁగుభాషకు వికృతి యని పేరు పెట్టఁబడినది. కాని పాశ్చాత్య మత ప్రచారకులు తమ మతప్రచారమునకై మన భాషలు నేర్చుకొని వానిలోఁ బరిశోధనలు సాగించుటతో ననేకము లగు క్రొత్త విషయములు పైకి వచ్చినవి. అన్నిటికంటె నాశ్చర్యకర మగు విషయమే మన సంస్కృతమునకును, దజ్జన్యభాష లగు నుత్తర భారతీయ భాషలకును, ఆఱువేలమైళ్లు దూరమున నున్న యూరోపీయ భాషలతో సంబంధము నిరూపింపఁబడుట. వింధ్యపర్వతమాత్ర వ్యవహితమైన యుత్తర దక్షిణ భారతభాషల కెట్టి సంబంధములే దను వాదము బయలుదేఱుట. భాషలకుఁగల యాంతరంగిక సాదృశ్యమునుబట్టి యేర్పఱుపఁబడిన భాషా కుటుంబములలో ద్రావిడభాషాకుటుంబ మొకటి. దీనిపై విశేష పరిశ్రమచేసినవాఁడు బిషప్ కాల్డువెల్లు. ఈయన ఇండో - యూరోపియన్ భాషాకుటుంబమునఁ జేరిన సంస్కృతాది భాషలకును, ద్రావిడ భాషా కుటుంబమునకుఁ జెందిన తెలుఁగు మున్నగు భాషలకును జన్యజనకభావ సంబంధముగాని, సోదరసంబంధముగాని లే దని తన తులనాత్మక ద్రవిడ భాషావ్యాకరణమునసిద్ధాంతీకరించినారు. దీనికి వారుచూపినయాధారము లలోఁ బ్రధాన మైనది భాషకు మూలభూతము లని చెప్పఁదగిన పదములలో ఇండో-యూరోపియన్ భాషలకును, ద్రావిడ భాషలకును సాదృశ్యము కన్పింపకుండుటయే. మూలభూతములగు పదము లనఁగా భాషలో మొదటినుండియు వ్యవహారములో నున్నవి అనఁగా "తల్లి" "తండ్రి"

మున్నగు బంధుత్వవాచకములు, కోడి, కుక్క మున్నగు గృహజంతు వాచకములు, సంఖ్యావాచకములు, సర్వనామములు, ముఖ్యము లగు విభక్తి ప్రత్యయములు, బహువచన ప్రత్యయములు మున్నగునవి. ఇందు బహువచన ప్రత్యయములను గూర్చి యాలోచింపవలసియున్నది. బహుత్వబోధక శబ్దములు భాష ప్రారంభమునుండియు నావశ్యకములే గదా!

ద్రావిడ భాషలలో నీక్రింది బహువచన ప్రత్యయములు గలవని యాంధ్రభాషా చరిత్రము చెప్పుచున్నది.

తమిళము (మాండలికములతో) - మహద్వాచకములు:-అర్, ఆర్, ఓర్, అవర్, అ, అరు, ఆళ్, ఆ, మ్, మార్, మారు.

అమహద్వాచకములు:-గళ్, గ, ఆంగ్, గా, గళు, వు.

కన్నడము (మాండలికములతో) అమహద్వాచకములు:-గళు,కళు, గోళ్, గోడ్, ల్, గోట్, గాండ్లు.

మహద్వాచకములు:-అర్, ఆర్, ఇర్, ఈర్, మ్.

గోండీ:-అమహద్వాచకములు:-క, జ్గ, స్క. మ:-రు.

కూఇ:-గా, ంగా, స్కా——మహద్వాచకము:-రు.

తెలుఁగు:-కొలు, లు, = రు, అు.

బ్రాహుఇ:-ఆక్, ఇక్

మళయాళము:-గళ్, క్కళ్, అవర్గళ్, ఆర్గళ్——అర్,ఆర్,మార్, అన్మార్, అవర్.

కురుఖ:-గుఠీ——ఆర్, ఈర్, ఓర్.

ముణ్డా (మాండలికములతో):- కుల్, కోల్, కుళ్, కోర్——ఏర్, ఉర్, ర్, కోర్.

వీనిని బరిశీలించినచోఁ బ్రధానముగా మహదర్థకమున అర్, అనునదియు, అమహదర్థకమున 'కళ్' లేదా 'కుళ్' అనునదియు బహువచన ప్రత్యయముఁగా నీ ద్రావిడభాషలలో నున్న ట్లూహింపవచ్చు ననియు,

వీని వికృతులే తక్కిన ప్రత్యయము లనియు భాషాశాస్త్రజ్ఞుల యభిప్రాయము.

ఉదా:—అల్+అర్=అవర్=వార్=అనుచిత విభాగముచే;

వా+ర్.

వా+అర్. రలయో రభేదః=అళ్

ఎలి+కళ్=ఎలికళ్. అనుచితభాగముచే, ఎలిక+ళ్.

ఎలికలు=ఎలుకలు.

కోలన్+కుళ్=కోలంకుళ్—కోలంకు+లు.

ఇట్లే ఈఁగలు, ఏనుంగులు మున్నగువానిలో గళు, గులు ప్రత్యయములు కానవచ్చుచున్నవి. కొన్ని భాషలలోఁ జివరి యక్షరము లోపించి క,గ, యనివమాత్రమే నిల్చినవి. తెలుఁగు మున్నగుభాషలలో మొదటి యక్షరములు లోపించి 'లు' అనునదిమాత్రమే నిల్చినది.

మొదట మహదమహద్వాచకములకు విభిన్నప్రత్యయములే వాడఁబడుచున్నను, రాఁగా రాఁగా, అమహద్వాచకప్రత్యయ మైన 'కళ్' అనునది మహద్వాచకములపైనఁగూడ వాడఁబడుచు వచ్చినది.

ఉదా:—అవర్గళ్. ఇది పూజార్థకమున "ఆచార్యులుగారు' అన్నట్లు రెండు బహువచన ప్రత్యయములఁ జేర్చుకొన్నది.

ఈ విధముగా నేర్పడిన వీనికి ఆర్యభాషలయందలి ప్రత్యయములకు సంబంధము లే దనుటకు క్రిందికారణములు చూపఁబడుచున్నవి.

1. ఆర్యభాషలలోని 'అస్', అ, అన్త్ అను బహువచన ప్రత్యయములకు వీనికిఁ బోలిక లేదు.
2. సంస్కృతభాష మున్నగు కొన్నిభాషలలో మూఁడువచనములు గలవు. ఇందు రెండే గలవు.
3. సంస్కృతభాషలో విభక్తినివచనమునుగూడ నొకేప్రత్యయము బోధించును. ఉదా:—రామాః (ప్రథమ బహువచనము. రామాన్ (ద్వితీయా బహువచనము)

కాని శ్రీస్వామినాధయ్యర్, చిలుకూరి నారాయణరావుగారు మున్నగువారు కొందఱు ద్రావిడభాషలుకూడ సంస్కృతజన్యములే యని నిరూపించుటకుఁ గొంత కృషిచేసిరి. వారీ ద్రావిడబహువచన ప్రత్యయములకు సంస్కృత ప్రత్యయములతో సంబంధము నీ క్రింది విధముగఁ బ్రదర్శించిరి. సమూహార్థకమైన గణశబ్దమునుండి గళ్ శబ్దము పుట్టియుండవచ్చును. అట్లే కులశబ్దములనుండి కుళ్, కుల్, అనునవియు, లోకశబ్దమునుండి ప్రాకృతము ద్వారమున 'లో అ' —లు అనియు నేర్పడియుండునని శ్రీ నారాయణరావుగారు తమయాంధ్రభాషాచరిత్రమున వ్రాసిరి. కాని యీ యూహలకుఁ దగినంత చారిత్రికాధారములు లభింపనందున నింకను నివి భాషాశాస్త్రపండితులయనుమోదము నందలేదు. ఆంధ్రదేశములోఁ బ్రకృతము భాషాశాస్త్ర పండితులలో నగ్రగణ్యులైన శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, శ్రీ గంటి జోగిసోమయాజిగారు ద్రావిడ భాషల కార్యభాషలతో సంబంధములేదను సిద్ధాంతమునే నమ్ముచున్నారు.

అయినను నీ విషయమున నింకను నెంతేని కృషి జరుగవలసియున్నది. భూగర్భమునుండి ప్రాచీన నగరములను ద్రవ్వియెత్తినకొలఁది ప్రాచీనదేశ చరిత్ర మెట్లు మాఱిపోవుచున్నదో, యట్లే భాషల విషయమునఁగూడ నేటి సిద్ధాంతము మాఱుట కవకాశము లేకపోలేదు. ప్రాకృతభాషలపైఁ దగినంత పరిశోధన జరుగలేదనియు, జరిగినచో ద్రావిడ భాషలు తజ్జన్యము లని నిరూపింపఁదగిన సామగ్రి లభించియుండెడిదనియు నిప్పటికిని గొన్ని యుత్తరదేశీయ భాషలలో ద్రావిడ పదములతోఁ బోలికలుగల పదములు వ్యవహారములో నున్నవనియు శ్రీ నారాయణరావుగారి వాదము. ద్వివచన రాహిత్యము, విభక్తికి, వచనమునకు వేఱు వేఱు ప్రత్యయములు గలుగుట యనులక్షణములు ప్రాకృతములందును, హిందీ మున్నగు నార్యభాషలలోఁగూడ వీరు తమ వాదమునకుఁ బ్రమాణముగాఁ జూపుచున్నారు.

భాషలయొక్క విభిన్నతను బ్రదర్శించుటకు ద్వివచన సహితత్వ రహితత్వములు మనకుం బెద్దగా నుపకరింపవు. ఏలయన సంస్కృత భాషయందుంగూడ నీ ద్వివచనము మొదట లే దనియుంబిమ్మట జంట పదములకొఱకుమాత్రమే పుట్టి తరువాత నన్నిటికిని వ్యాపించిన దని విమర్శకులయభిప్రాయము. దీని కాధారములు ఋగ్వేదమునందలి యీ క్రింది ప్రయోగములు. (Macdonek Vedic Grammar)

సమంజంతు విశ్వే దేవాః సమాపోహృదయాని నౌ" ఇచ్చట హృదయాని అను పదము ద్వివచనములో నుండుటకు బదులు బహువచనములోం బ్రయోగింపంబడినది.

"న యత్పురా చకృమా కద్ధ నూనం ఋతా వదంతో అనృతం రపేమ గంధర్వో అప్స్వప్యా చ యోషా సా నో నాభిః,పరమం జామి తన్నౌ" ఇచటను ద్వివచనములకుబదులు బహువచనములే ప్రయోగింపంబడినవి. "ఉదితేపూర్వేఫల్గున్యౌ" "ఉదితాఃపూర్వాఫల్గున్యః అను రెండు విధములైన ప్రయోగములుకూడం బై విషయమునే నిరూపించును.

ఇంక రెండవభేదము సంస్కృతమున విభక్తివచనముల కొకే ప్రత్యయము కల దనునది. సంస్కృత మతిప్రాచీనభాష యగుటచేం బ్రత్యయాత్మకపదరూపభాష యైనది. ప్రత్యయములుకూడ మొదటం బదములే యనియు, వాడుకలో గుర్తింపరానంతంగా నఱిగిపోవుటచేం బ్రత్యయములుగా భావింపంబడిన వనియు భాషాశాస్త్రజ్ఞుల సిద్ధాంతము. వీనికి సర్వనామశబ్దరూపములు కొన్ని దృష్టాంతీకరింపవచ్చును. ఉదా:—పూర్వస్మై పూర్వాయ; పూర్వస్మాత్ - పూర్వాత్; పూర్వస్మిన్ - పూర్వే ఈ జంటలలో మొదటిరూపములు రెండేసి పదములుకూడ నేర్పడునట్లు స్పష్టము (పూర్వ+అస్మై). వేదమున జనాః అనుటకు జనాసః అను నింకొకపదముకూడం గలదు. మొదటి పదమునందుకంటె రెండవపదములో శబ్దస్వరూపము స్పష్టతరముగదా! కావున నా ప్రత్యయములచరిత్రలోనికి వెళ్ళినచో నిట్టిభేదములు నమసిపోవచ్చును. ఉదాహరణమునకుం గ్రియాపదములనుబట్టి సంస్కృత భాషకును, ద్రావిడభాషలకును విభిన్నత స్థాపింపంబడుటకు గ్రహింప

వచ్చును. సంస్కృతమున మూఁడులింగములకును క్రియారూప మొకవిధముగ నుండునుగాని మాఱదు. రామో గచ్ఛతి, సీతా గచ్ఛతి, పత్త్రం గచ్ఛతి. కాని ద్రావిడభాషలలో వెళ్లుచున్నది, వెళ్లుచున్నాఁడు వంటి భేదము కన్పించుచున్నది. ఇది యాపాతరమణీయముగనే యున్నది. కాని పరిశీలించినచో 'వెళ్లుచున్నది' 'వెళ్లుచున్నాఁడు' అనునవి క్రియలు కావు. ఇవి ధాతుజవిశేషణములు క్రియలుగా వాడఁబడినవి. వ్యాకరణములు క్రియారూపములుగా సాధించినవి. సంస్కృతమునఁ గృదంతములందును నిట్టి భేదము కన్పించుచునేయున్నది. రామో గతః, సీతా గతా; పత్త్రంగతం. అట్లే మూలపదముల స్వభావమును బరిశీలించినచో నార్యభాషలకును, ద్రావిడభాషలకును సంబంధము నీ క్రిందివిధముగాఁ గూడ బహువచన ప్రత్యయములఁబట్టి స్థాపింపవచ్చు నని తోఁచెడిని.

సంస్కృతమున 'ఆలి'అను నొకపదము సమూహార్థకమైనది కలదు. అది తెలుఁగులో జనాళి వనాళి యని యుచ్చరింపఁబడుచున్నది. దీనినుండి 'ఆళ్ 'అను శబ్ద ముద్భవించెననుటలోఁ బ్రత్తిపత్తి కాన్పింపదు. బ్రాహ్మణులు అను నర్థమునఁ దమిళమునందు 'పిరామిణాళ్ 'అను పదముగలదు. దీనిని పిరామిణర్గళ్ అనుదాని రూపాంతరముగాఁ జెప్పుచున్నారు. కాని యిందలి మధ్య గకారము లోపించుటకుఁ గారణము గన్పింపదు. పదాంతవర్ణము లోపించుట సహజము. పైఁగా 'గళ్ 'అను ప్రత్యయము మహద్వాచకములపై నీనడుమనే చేరుట ప్రారంభించినది. A. అను నాంగ్లశబ్దమునకును, దీనికిని గూడ సంబంధ మున్నదేమో పరిశీలింపవలెను. ఏలయన సకలార్థక శబ్దములుకూడ బహువచన బోధకములుగా వాడఁబడుట యుత్తరభారతదేశములలోఁగలదు. ఉదా:— వంగభాషలో కుక్కుర్=కుక్క; కుక్కుర్ సకల్=కుక్కలు. ఇంతేకాక 'అళి' పదమునకు స్త్రీ, చెలికత్తె, అను నర్థములుకూడఁ గలవు. ఆ

యర్థమునఁగూడ నిది ద్రావిడభాషలలో వ్యవహరింపఁబడుచున్నది. అంబాళ్, అవళ్, చెలియలు, మఱదలు, కోడలు ఆలు, ఇందలి తుది వర్ణము లోపించిన 'ఆ' అనునదికూడ బహువచన ప్రత్యయము కావచ్చును. ఇతులసానాం దంతాః అను సూత్రముప్రకారము ఏకస్థానికము లగుటచే లకారమునకు సకారమువచ్చి 'దేవాస్' అయి యుండవచ్చును. ద్రావిడభాషలలోఁగూడ గోండీ,కోఇ భాషలలో నీ సకారము కన్పించుచున్నది. కేవలము 'అ' కారముగూడ ఇరుక్కన్దన, వందన మున్నగు వానియందు బహువచనార్థములోఁ గన్పించుచునే యున్నది. ఆర్య భాషలందుఁగూడ Phenomena, memoranda మున్నగు పదములందది కానవచ్చుచున్నది.

పై 'ఆల్' యందలి లకారమునకే 'రలయోరభేదః' అను సూత్రము ప్రకారము రేఫము వచ్చినచో 'ఆర్—అర్—ర్' వచ్చిన వనియైనను జెప్పవచ్చును. లేదా సంస్కృతమున ఋకారాంత శబ్దములపై నీ 'అస్' ప్రత్యయము చేరుటచే నేర్పడిన 'పితరః' వంటి పదములయనుచిత విభాగముచేనైన నేర్పడియుండవచ్చును. ఋకారాంత శబ్దములు చాలవఱకు మహన్మహతీవాచకములే యగుటయు నీయూహకుఁ బోద్బలకము.

ఇఁకఁ 'కళ్, గళ్' అను ప్రత్యయములుకూడ 'గణ' శబ్దములు నుండి వచ్చిన మాటకంటె సంస్కృతమునందలి 'కల' ధాతువునుండి వచ్చుట యెక్కువ సంభావ్యముగాఁ గన్పట్టును. 'కల' = శబ్ద సంఖ్యానయోః అని ధాత్వర్థము. ఇది లెక్కించుట యనునర్థము గలది. ప్రాచీన కాలమున, అంకపరిగణన మేర్పడుటకుఁ బూర్వ మీ క్రియ గులకరాలతో జరిగెడిది. 'కల్' అనఁగా ఱాయి యను నర్థము ద్రావిడ భాషలయందే గాక ఆర్యభాషలలోఁగూడఁ గాన్పించుచున్నది (Ref:-Chambers Twentieth Century Dictionary) Calcutta. అనఁగానెక్కిం

చుట యను పదమునందలి Cal అను పదమునందలి ఱాయి యనియే యర్థము. బహుత్వము లేనిదే లెక్కించుట యుండదు గావునఁ గ్రమముగా నిది బహుత్వార్థ బోధకమై దీనినుండియే 'కల' ధాతువుకూడ నుత్పన్నమై యుండవచ్చును. 'కళత్రం' అను పదమునకు 'కులమును గాపాడున'దను నర్థముకూడఁ గుదురుచునే యున్నది గదా!' కల శబ్దమునకు ఱాయి యను నర్థము ప్రాచీనకాలమున సంస్కృతమునఁగూడ నుండెననుటకుఁ గలశ శబ్దమొకటి యాధారముగాఁ జూపవచ్చును. దీనికి వ్యుత్పత్తి "కేన లసతీతి కలశః"అని చెప్పుదురు. ఉదకముచేఁ బ్రకాశించునది యని. ఆ పక్షమున సకారమునకు శవర్ణము రావలసిన యావశ్యకత లేదు. అంతకంటె కలేషు శేతే ఇతి కలశ" (మూఁడు)ఱాలపై గుదురుగాఁ బెట్టఁబడునది యను నర్థము సహజమని తోఁచుచున్నది.

తెలుఁగులోని 'లు'ప్రత్యయము ఈ'కల్' ప్రత్యయమువొక్క యనుచిత విభాగముచే నేర్పడియుండు నని యూహించిరి. కాని యీయూహకొక యాపత్తి కన్పించుచున్నది. అట్లే యయినచో—ఎలుక, చిలుక మున్నగు పదములవలెనే తక్కిన మూలపదము లన్నియు "కకారాంతములుగనో, గకారాంతమునగనో తెలుఁగులో నుండవలసియుండును. కనీసము వాని రూపాంతరములైన నుండవలసి యుండును. అట్లుండక పోవుటయే గాక పీట, చేట, ఊరు పేరు మొదలగు నెన్నో దేశ్యప్రాథమిక పదములు కకార గకారాంతములు గాక కన్పించుటచే నీ 'లు' ప్రత్యయము 'కళ్' ప్రత్యయమునుండి కాక పైఁ జెప్పిన 'అల్' ప్రత్యయమునుండి కలిగిన దని యూహించుట యెక్కువ సమంజసమని తోఁచుచున్నది. లేదా మహద్వాచక 'రు' వర్ణమే 'లు'గా మాఱి యుండవచ్చును.

ఇంతకును నీ వ్యాసముయొక్క యుద్దేశ్యము ద్రావిడభాషలలోని బహువచన ప్రత్యయములనుగూర్చి యొకసిద్ధాంతమును బ్రతిపాదిం

చుటగాక దానినిగుఱించి యింకను బరిశోధన జరుగవలసియున్న దను నావశ్యకతను నిరూపించుటయే. గతవార్షికసభలలో సమర్పించిన "ద్రుతచరిత్రము" అను వ్యాసమున నాంధ్రభాషయందలి ద్రుతమునకు సంస్కృతభాషతో సంబంధ ముండుటకు సూచించితిని. ఇందు ద్రావిడ భాషలలోని బహువచన ప్రత్యయములకు సంస్కృతభాషలోని బహు వచన ప్రత్యయములతోఁ గన్పించు సంబంధమును నిరూపించితిని. వీనిపై నింకను బరిశోధనలు సాఁగి యార్య ద్రావిడ భాషలు భిన్నకుటుంబము లకు సంబంధించినవి కావని నిరూపింపఁబడినచో నా సిద్ధాంతము దక్షిణ దేశమున సంస్కృతభాషావ్యాప్తికి నెక్కువ దోహదముచేయఁగలదు. పుస్తోభాష సంస్కృతజన్యమగుటచేతనేగదా కాబూల్ యూనివర్సిటిలో సంస్కృత మనివార్యపఠనీయ మగుట. అట్లని యేదోవిధముగా సంస్కృ తమునకును ద్రావిడభాషలకును ముడివెట్టఁజూచుట భాషాశాస్త్రమున కపచారము చేయుటయే కాఁగలదు. పండితు లెప్పుడును దాము తటస్థ భావముతో నుండి సత్యాన్వేషణ మొనర్చుటయే కర్తవ్యము. ఆంధ్ర సాహిత్య పరిషత్తు, ఆంధ్రవిశ్వవిద్యాలయమువంటి సంస్థ లిట్టి పరిశో ధన కార్యక్రమమునకు నిశోధికముగాఁ బూనుకొనినచోఁ గేవల పాశ్చాత్యపండితులు మన సంస్కృతి సంప్రదాయముల నెఱుంగక కావించిన పరిశోధనలను గతానుగతికముగా ననుకరించుటగాక మన పండితులు సమన్వయాత్మకమైన పరిశోధనలను గావించి వాస్తవికతత్త్వ మును బైటఁబెట్టఁగలరు. అది నేఁటి సహజీవనసిద్ధాంతయుగమున నెంతేని నావశ్యక మని విజ్ఞులకు వేఱుగా విన్నవింప నక్కఱలేదు.

(8 పుట శేషము)

లోనిశత్రులు జృంభించి లోనెయుండ
దైవ మేరీతి దయజూడఁ దలఁపఁగలఁడు ?
మనసులో మంచి, మాటలో మంచి, మఱియు
నడవడిని మంచికల్మి జన్మకుఫలంబు
సత్యమార్గంబె తప్పక శరణ మిచ్చు
నందులోననె నను దైవ మాదుకొనును.

♦ ♦ ♦

అస్వతంత్రపు జీవిత మగుటజేసి
తప్పు లొకకొన్ని చేయక తప్పకునికి
హృదయతాపంబు నన్ను దహించుచుండె
మదికి, మహదాశయంబులు ముద మొసంగు
ఫలము చేకురు సుదినంబు వచ్చెనేని
జన్మ సార్థక మని నేను సంతసింతు.

# సాహితీ భిక్ష

శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ

ఆనందవర్ధనుఁడు "ద్విత్రాః పంచషా వా మహాకవయః" అనినాఁడు. స్వస్పందమధుర మయిన హృదయసంవాదమున రసాస్మ్రశ్రీవహించు సహృదయులు "ద్విత్రాః పంచషా వా" అని నే నందురా! లోక మటుగ లేదు. సాహితీభిక్ష నెందఱో సిద్ధము చేసిరి. సాహిత్యవీధిలో భిక్షాకులు లేరు. సాహిత్యపువీథియె లేదు. ఇట్లు భిక్ష యున్నది. అక్కఱ లేనివా రందుకొనసట్లు నటింతురు. ఈ నటనము సాహితీతాతలకుఁ బ్రమాతలకు ఘృణామిశ్రమధువు. కతిపయభిక్షాకుల సన్న్యాల భిక్షించి విశ్వము నన్నమందురా! అదిగో! భిక్ష! ఇదిగో! భిక్ష!" అని యనఁ గలుగుదుమా?

ఒకప్పుడు సాహితీపూజగా, మా శర్మ యిట్లనినాఁడు. శ్రీ నన్నయభట్టారకాదులు స్వస్వగ్రంథములందుఁ బ్రతిబింబించినరీతిని స్పష్టముగా నవగాహము చేసికొందుమేని భిన్నభిన్నము లయిన సాహిత్యలక్షణవేదనములు వారల కున్నట్లుగోచరము చేసికొనఁగలము. ధ్వన్యర్థసంచార మున్నను లేకపోయినను దత్పదవీసంచారుల కభ్యస్త మయిన విధానము నన్నయాదులం దవభాసింపకపోదు. ప్రసన్న గంభీర మగు విన్యాసమునఁ దిక్కన సూచించినది యొరవడిగాఁ దమ తమ పాదులు తదనుయాయులు సరిదిద్దుకొనిరి. శ్రీనాథ విద్యాధికారి ప్రస్థానము ప్రసమీక్షించినచో నుక్తియుక్తులు భణితిభంగీచిత్రితలు హృదయగ్రాహులై పొడఁగట్టును. ప్రాచీను లయిన యాంధ్రాలంకారికులకు ధ్వనితత్త్వ మెంత తెలియునదియు వారి లక్షణగ్రంథముల వలన నతిరోహితము కాదు. శ్రీమదభినవగుప్తవిలోచనముతో

ధ్వన్యాలోకమును వారు చూచియుందురా? ఇది ప్రశ్నగా నిలఁబడును. సంస్కృతపండితులకుఁ దెలుఁగు కవితావనితలతో సంబంధ మెంతయున్నదో? నవకాలమునఁ గవితాదీప్తు లిచ్చిన ప్రబంధ లున్నారు. ఈ కాలమున ధ్వనివేత్తృతకు సౌకర్య మున్నది. ధ్వని విననివారును "కవులు" అయినారు. ఇది పిండితార్థము. ఆంధ్రకవుల శక్తికిఁ దోడు సలోచనధ్వన్యాలోకవిజ్ఞాన మున్నట్లయిన ఇంక నుత్తమ మయిన సాహిత్యసృష్టి వచ్చెడిది. అని నేఁడు మన మలక్షణులము కాము. విలక్షణులమును గాము. లక్ష్య మనుసరించి లక్షణ మన్వేషింపవలసిన గతి యీ నాఁడు లేదు. లక్షణవిజ్ఞాన మది కవిసహృదయులకు వలసిన వ్యుత్పత్తి. అదిలేక తచ్చేష్ట కీయవలయు విలువ తెలియదు. సరస్వత్యాస్తత్త్వం కవిసహృదయాఖ్యం విజయతే" అని మీ రనుఁడు!

# భారతదేశ భాషలు — తెలుఁగు

శ్రీ కొమాండూరి శఠకోపాచార్యులు.

భారత దేశము యావత్ప్రపంచసంపుటివలె నున్నది. ప్రపంచము లోని భౌతికపరిస్థితులు, ముఖ్యజాతులు, ముఖ్యమతములు, ముఖ్యభాషా కుటుంబములు మన దేశములో సంగ్రహరూపముగఁ బ్రతిబింబితము లై యున్నవి. ఇక్కడ భాషావిషయము మన చర్చనీయాంశము.

ఉత్తరమున హిమాలయప్రాంతములలో టిబెటు, చీనా, బర్మా లకు సంబంధించిన యేకాక్షరపదములగు మంగోలియన్ భాషలు కలవు. దేశమధ్యమున మన్యప్రాంత మనఁబడు గిరిగహ్వరప్రదేశములలో, ఆదివాసజనుల ఖాండ్, గాండ్, కోయ, సవర, మున్నగు ముండా ఆస్ట్రిక్ భాషాకుటుంబముల విచిత్రభాష లున్నవి. కాని యీ యాటవిక భాషలలో వాఙ్మయము లేదు. ఇవి యనాగరికములు. దేశమంతలో సాహిత్యము గల ముఖ్యభాషలు పదునాలుగుమాత్రమే. అవి మనరా జ్యాంగశాసనసూచి (షెడ్యూలు)లో నుల్లేఖింపఁబడినవి. వీనిలోసంస్కృత మిప్పటిజనులవాడుకభాష కాదు. కాని, నేఁటివఱకు మన సంస్కృతి కంతకు నదియే మూలాధారము. హిందూధర్మమునకు, సంస్కృతికి మూలకందములగు గ్రంథము లన్నియు సంస్కృతములోనే యున్నవి. మఱియు కాశ్మీర్, పంజాబీ, హిందీ, గుజరాతీ, మరాఠీ, ఉడియా, బెంగాలీ, అసామీ అను నుత్తరమధ్యప్రాంతములోని యార్యభాషలు సంస్కృతమునుండి కాలక్రమమునఁ బరిణతిఁ జెంది రూపెత్తినవే. కనుక సంస్కృతము మాతృస్థానమునందున్నది. ఉర్దూ, యొక ప్రత్యేక భాషగాఁ బేర్కొనఁబడినను హిందీకది యుపశాఖయే గాని వేఱు భాష కాదు. ఇఁక మిగిలినవి తెలుఁగు, తమిళ, కన్నడ, మళయాళ మను నాలుగు ద్రావిడభాషలు. ఈ దక్షిణభాష లన్నిటఁ దెలుఁగు తన కుత్తరదిశ నున్న యార్యభాషలతో సన్నిహితసంపర్కము కల్గి

యున్నది. అధునాతనార్యభాష లన్నిటిలో హిందీ యధికసంఖ్యాకుల భాష యై దేశమునకు హృదయస్థలమందలి నాయకమణివలె నున్నది. కాన నది దేశమున కంతకు సామాన్యభాషగ గుర్తింపఁబడి సర్వ రాజ్యాంగమున, కేంద్రప్రభుత్వాధికారభాషగఁగూడ నిర్ణయింపఁబడినది. పైనఁ బేర్కొనిన యుత్తరమధ్యప్రాంత భాష లన్నియు నార్యభాషా కుటుంబమునకుఁ జెందిన వని శ్రీ జేమ్సు మున్నగు మహనీయులు స్థిర పఱచిరి. ఇట్లే దక్షిణమునఁ దెలుఁగు, తమిళ, కన్నడ, మళయాళ ములు ద్రావిడభాషకుటుంబములోనివని డాక్టరు కాల్డ్వెలు మున్నగు విద్వాంసులు సహేతుకముగ నిశ్చయించినారు. ఈ ద్రావిడభాషలలోఁ దమిళమున నత్యంతప్రాచీన మగు స్వతంత్రవాఙ్మయము కలదు. ఆంధ్ర ములో 10 వ శతాబ్దిపిమ్మటనే గొప్ప వాఙ్మయము కానవచ్చును. మఱియు ముఖ్యు లగు ప్రాచీనవైయాకరణులు తెలుఁగునకు, సంస్కృత మాద్యప్రకృతి, ప్రాకృతము ద్వితీయప్రకృతి యని వక్కాణించిరి. ఈ సాంప్రదాయికభావమును నేఁటిభాషాశాస్త్రజ్ఞు లంగీకరింపలేరు. అందు లకు బలీయము లగు కారణములు తెల్పనుచేసిరి. కాని యాధునికు లలో డాక్టరు చిలుకూరి నారాయణరావుగారుమాత్ర మీ సిద్ధాంత మును సమర్థించు రెండుసంపుటముల విపులగ్రంథమును రచించిరి. ఈ మహాగ్రంథ మాంధ్రవిశ్వవిద్యాలయమునకుఁ బ్రామాణికప్రచురణము నయినది, కావున దీనిని జాల శ్రద్ధతో భాషాశాస్త్రజ్ఞు లగు విద్వాం సులు పరిశీలింపవలసి యున్నది.

ఆంధ్రమహాభారతము మున్నగు ప్రాచీనాంధ్రగ్రంథములు సంస్కృతపదభూయిష్ఠము లను మాట నిజమే. కాఁగాఁ జాల తెలుఁగు పదములు ప్రాకృతభవము లను విషయమును నంగీకరింపఁదగును. దీనినిబట్టియే ముఖ్యముగ శ్రీ నారాయణరావుగారు తమ సిద్ధాంతమును సమర్థింపఁజూచిరి. కాని, విద్వాంసులు వాడు సాహిత్యపదజాలముల

పోలికనుబట్టికాక పామరజనములు తమ దైనికజీవితములో నుపయోగించు సహజభాషలోని పదములనుబట్టి భాషాశాస్త్రరీత్యా యిట్టి విషయములను నిర్ణయింపఁదగును. అట్టి పరీక్షద్వారా, తల, కాలు, ముక్కు, చెవి, పిల్ల, నేయి, పాలు, ఉప్పు, నీరు, చేయు, నడువు మున్నగు నిత్యకృత్యపదములు, అంకెలు, సర్వనామములు, అవ్యయములు, తెలుఁగు తమిళ కన్నడ మళయాళములలోఁ జాలవఱకొకేరీతిగ నున్నవి. కనుక నాంధ్రమును ద్రావిడకుటుంబములోనిదే యనియు డాక్టరు నారాయణరావుగారును నంగీకరింపక తప్పలేదు. కాని, ద్రావిడభాషాకుటుంబమంతయు నార్యభాషాకుటుంబములోనిదే కనుక నాంధ్రముకూడ నార్యపరివారములోనిదే యని యాయన విచిత్రసిద్ధాంతము లేవఁదీసిరి. తమిళములోని ముఖ్యవ్యావహారికపదములకు సంస్కృతప్రాకృతములతోఁ జెప్పఁదగిన సంబంధము కనఁబడదనుట - కొంతవఱకీ విషయము కన్నడమళయాళములకును వర్తించు ననుట - నిర్వివాదములు. కాని దూరముందున్న తమిళపదములకంటెఁ బ్రక్కనున్న యాంధ్రపదములనే ముఖ్యముగఁ బరిశీలనకుఁ దీసికొని వానిని బ్రాకృతశాఖ యగు పైశాచిలోని కొన్ని పదములతో సామ్యము చూపిరి. దీనిఁబట్టి తెలుఁగుభాష పైశాచీభవమై యుండవలె ననియుఁ, గాన నాంధ్రము ప్రాకృతజన్యమే యనియుఁ, దద్రీత్యా ద్రావిడభాష లన్నియు నార్యభాషాకుటుంబములోనివే యనియు, నిర్ణయించిరి. ఇట్టి పద్ధతి పై కెంత యాశ్చర్యముగఁ దోఁచినను భాషాశాస్త్రనియమములఁబట్టి యుక్తముగఁ దోఁచదు. ద్రావిడపరివారభాష లన్నియు నార్యభాషాభవములైనచో వానిలో నతిప్రాచీన మగు తమిళపదములను, అప్పటిప్రాకృత రచనలలోనిపదములతోఁ బోల్చి సామ్యము చూపవలెను. ఒకభాషాకుటుంబశాఖలు చాల శతాబ్దులతరువాతకంటెఁ బ్రారంభస్థితిలోనే యెక్కువ పోలియుండవలెను. మఱియు రెండు పది ముప్పది నూరు

మున్నగు సంకెలు, క్రియలు, ప్రత్యయములు, నిత్యజీవితములోనిపదజాలములు, ద్రావిడభాషలలోఁబరస్పరముసామ్యముకలిగియున్నట్లే ప్రాకృత సంస్కృతశబ్దములతోఁగూడఁ గొంతయయినను నట్లు పోలిక కల్గియుండవలెను. వేదసంస్కృతశబ్దములకు సమీపమందున్న పారసీకముతో నేగాక యతిదూరస్థ మగు నింగ్లీషు ఫ్రెంచి జర్మను ఇత్యాదులలోని పదములతోను జాలపోలిక కల్గియున్నందుననే యవియన్నియు, ఆర్యకుటుంబమునకుఁ జెందిన వని భాషాశాస్త్రజ్ఞు లేకగ్రీవముగ స్థిరబఱచిరి. కాని ద్రావిడభాషాపదములకును, సంస్కృతపదములకును నట్టి పోలిక యేమియు లేదు. ఆంధ్రము ద్రావిడభాష లన్నిటిలోను నుత్తరమున నుండి మహారాష్ట్రి, పైశాచి, శౌరసేని, మాగధి మున్నగు ప్రాకృత శాఖలకుఁ బొరుగున నున్నది. అంతేకాక, ఆంధ్రరాజ్యమునకు - ఈ పొరుగురాజ్యములకు మైత్రీమూలముననో - యుద్ధానుమూలముననో సామ్రాజ్యసంపర్కము లేర్పడినట్లు చాల చారిత్రకప్రమాణములు కలవు. అశోకచక్రవర్తి కాలముమొదలు చాళుక్యులకాలమువఱకు నధమము వేయేండ్లిట్లు సమ్మేళన మేర్పడెను. ఆంధ్రదేశమునఁ బూర్వము శతాబ్దులకొలఁది బౌద్ధసంస్కృతియుఁ బ్రాకృతభాషలును సారస్వతముగ రూపెత్తి వ్యాపించినవి. మఱియుఁ బూర్వకాలమునుండి యాంధ్ర ప్రాంతమున సంస్కృతపఠనము సంప్రదాయకముగ జరుగుచుండెను. శాతవాహనులకాలమున నాంధ్రప్రాంతములోఁ బ్రాకృతమే రాజభాషయై దానిలోనే సాహిత్యనిర్మాణము జరుగుచు వచ్చెను. ఇందు బృహత్కథ జగద్విఖ్యాతము. రాజభాషలోని పదము లనేకము లచటి సామాన్యజనులవాడుకభాషలోఁ జేరిపోవుట యనుభవసిద్ధమే. పిమ్మట గోల్కొండనవాబులదర్బారుభాష యగు హిందుస్థానీలోనుండి వందలకొలఁదిపదము లాంధ్రభాషలోఁ గలసిమెలసి యట్టె నిలిచిపోయినవి. అటనే - ఆంగ్లపాలనము వదలిపోయినను - ననేకములైన యింగ్లీషు

మాటలుఁ దెల్గులో నెలకొని యున్నవి. అట్లే పూర్వకాలమున సంస్కృతప్రాకృతశబ్దము లాంధ్రములోఁ జేరి దేశ్యములలోఁ గలసిపోవుట సహజమే. పైశాచి, ప్రాకృతశాఖలలోనిదే యైనను నది పరిశుద్ధము కాదు. హీనసంస్కృతి గల జనులవాడుకభాష యై యాదిమ ద్రావిడభాషలతో మిళిత మై మిశ్రమభాష యయినట్లు చాలమంది విద్వాంసులు చెప్పియున్నారు. ద్రావిడ దేశ్యశబ్దము లెన్నియో పైశాచిలోఁ జేరినవి. కొలఁదిద్రావిడపదములు సంస్కృతములోను జొచ్చి సంస్కృతపదములతో నభేద మొందిన వనియుఁ గొంతమంది విజ్ఞుల యభిప్రాయము. మఱియు, శబ్దములపైపై పోలికనుబట్టియే భాషాసంబంధము నిర్ణయింపఁగూడదు. ప్రసిద్ధము లైన శబ్దశాస్త్రసూత్రములపరికార మే పరిణామము లున్నవియా యవియుఁ బరిశీలింపవలెను. పైశాచితో నాంధ్రపదములకుఁ బోలిక యుండుటకుఁ జారిత్రిక మగు వేఱు కారణము లున్న వని తేలుచున్నది. ఆంధ్రములోని మొదటిమహాగ్రంథములన్నియు దాదాపుసంస్కృతగ్రంథములయనువాదములే. మఱియువాని రచయితలు గొప్పసంస్కృతవిద్వాంసులు. కానఁ దమ రచనలో సంస్కృత ప్రాకృతశబ్దములను బాగుగ వాడుట సాహిత్యకలక్షణముగ భావించిరి. ఇట్లే మిల్టన్ మహాకవి తన యాంగ్ల కావ్యములో విశేషముగ లాటిను పదములను నుపయోగించెను. అయినను వింగ్లీషు లాటినునుండి పుట్టినది కాదు. 16 వ శతాబ్దమునుండి మూఁడు శతాబ్దులు బాహ్మనీ గోల్కొండ నిజాంవంశపు ముస్లిములపాలన మాంధ్రప్రాంతమున జరిగెను. అప్పుడు వారలహిందూస్థానీ రాజభాష యయినది. ఉర్దూ యనఁబడునట్టి యీహిందూస్థానీ హిందీశాఖయే. అంతట నందలి వెన్నియో పదములాంధ్రమునఁ జేరి తత్పదములుగనే నేఁటికిని వాడుకలో నున్నవి. ఇట్లు దాదాపు రెండువేలయేండ్ల నుండి యార్యభాషలతో మన యాంధ్రభాషకు సన్నిహితసంబంధ ముండుటచే వేలకొలఁది ప్రాకృత

పదము లాంధ్రపదములుగనే వ్యవహారములో నున్నవి. ఆంధ్రము ద్రావిడభాషకుటుంబముననే పుట్టినను, ఇట్లు దానిబాల్యమునుండి పొరుగున నున్న ప్రాకృతభాషలతో మిళిత మగుట సంభవించెను. ఆర్య సంస్కృతి, హిందూధర్మము నాంధ్రప్రాంతమునను వ్యాపించినందున సహజముగ సంస్కృతతత్సమపదము లాంధ్రశబ్దము లయినవి కనుక నాంధ్రము బాల్యమందే సంస్కృతప్రాకృతకుటుంబములోఁ బెరిఁగి యా కుటుంబమునకు దత్తపుత్రిక యయిన దని చెప్పఁదగును. ఇట్టి పరిణామములు లేని తమిళమునకుఁ దెలుఁగునకుఁ జాల వ్యత్యాసము పెరిఁగినది. కాని ప్రాచీన మైన యచ్చతెలుఁగులోని శబ్దములు సాధారణముగఁ దమిళములోను గానవచ్చును.

ఒక్కొక్క భాషవా రొక్కొక్క ప్రత్యేకజాతి యనుకొనుట కలదు. ఆర్యభాషను మాట్లాడువా రార్యజాతివా రనియు, ద్రావిడ భాష మాట్లాడువారు ద్రావిడజాతివా రనియు నొకప్పుడు కొందఱు భావించిరి. కాని యార్యద్రావిడజాతులు చిరకాలముక్రిందనే మిళితములై మిశ్రితము లైన వని జాతిశాస్త్రజ్ఞు లంగీకరించుచున్నారు. భౌగోళికముగ నుత్తరమధ్యదేశములకును, దక్షిణదేశమునకును మధ్య నున్న యాంధ్రులలో నీ యుభయజాతులమిశ్రణము హెచ్చుగ నుండుటయు సహజము,

భారతదేశ మంతటను, యూరపుఖండమునను నిట్లే విశేషముగ జాతిమిశ్రణము జరిగెనుగదా ! మఱియు నొక భాషాకుటుంబమువా రొక ప్రత్యేకజాతి యను సామాన్యసూత్రమున కపవాదము లున్న వని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఉదాహరణమునకు బెంగాలీ ప్రాకృతభవ మగు నార్యభాషయే. కాని, యిప్పటిబెంగాళీలు ద్రావిడుల మిశ్రజాతి యని జాతిశాస్త్రజ్ఞులభావన. లోకమంతటిలోవలె

మన దేశములోను జాతిమిశ్రిణము శతాబ్దులకొలఁది జరుగుచువచ్చినది. అందుకు మన యితిహాసగాథలలోను నిదర్శనము కలదు.

ప్రాతిపదిక ప్రత్యయములకూర్పునుబట్టియు, భాషాకుటుంబముల నిర్ణయింతురు. సంస్కృతమును బ్రాకృతశాఖలును దజ్జనితము లగు హిందీమున్నగునవియు ప్రత్యయాంత (inflexional) భాషలు. వానివి భక్తులు కేవలప్రత్యయములుగనుండును. ఆంధ్రము, తమిళము–ఇత్యాదులు agglutinative భాషలు. అనఁగా వీనిలోఁ బ్రత్యేకశబ్దములను బ్రాతిపదికలకుఁగూర్చి ప్రత్యయములుగ నెంచుదురు. కనుక నాంధ్రములోని పదజాలములకు సంస్కృతప్రాకృతపదములతోఁ జాల పోలిక లుండుట సత్యమే అయినను దానిఁబట్టి ద్రావిడభాషాకుటుంబ మంతయు నార్యకుటుంబములోని దనుభావము చింత్యము.

మొదటఁ బ్రపంచమునం దంతట నొకేభాష యుండె ననియు, భాషాకుటుంబము లన్నియు నాదిమ మగు నట్టి యొకేభాషనుండి కాలక్రమమున వేర్వేఱు పరిణామముల నొంది విడివడిన వనియుఁ గొందఱు భాషాశాస్త్రజ్ఞులు సూచించినారు. ఇది యింకను నూహారంగములోనే యున్నది. ఇది విచిత్రమే. కాని యట్టి నిర్ణయమునకు వచ్చుటకుఁ దగిన యాధారము లింకను లే వని చాలమంది భాషాతత్త్వజ్ఞులు భావించుచున్నారు. తమిళభాషలో హల్లులకంటె నచ్చులకే ప్రాముఖ్యము. ఉత్తరార్యభాషలలో నచ్చులకంటె హల్లులకే యధికప్రాముఖ్యము. ఆంధ్రములో నీ రెండింటికి సమానస్థాయి కలిగి మాధుర్యము మిళిత మైనది.

దేశవిభజనమునకుఁ బిమ్మట 1951 సంవత్సరము జనాభాలెక్కలనుబట్టి మన దేశీయులజనసంఖ్య 36 కోటులు. వీరల మొత్తము వాడుక భాషలు 782. ఇందు సరియైన సాహిత్యభాషలు 12 గఁ దేలవచ్చును. వానిలో నుమారు 36 కోట్లజనులస్వభాషయగు హిందీది యగ్రస్థానము.

మూఁడుకోట్ల పై చిలుకుజనులమాతృభాష యగు మనయాంధ్రము సంఖ్యలో రెండవస్థానము నొందినది. సాహిత్యసంపన్న మగుటయేగాక ముఖ్య మగు నార్యద్రావిడ భాషల రెండుకుటుంబములకు సమన్వయకర మగుటవలన నీ రెండింటివిశేషములును నాంధ్రములోఁ గలవు. ఇఁక మహారాష్ట్రము హిందీ, ఉడియా, తమిళ, కన్నడభాషలకుఁ బొరుగు కనుక నీ భాషలనుండియు బలము చేకూర్చుకొన్నది. కనుక నాంధ్ర భాష యింకను బాగుగ వృద్ధిపొందుట కవకాశములు గలవు.

హరిహర దేవాయ నమః

# రత్నావళీ నాటికా సమీక్ష

శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి.

శ్రీహర్ష నరేంద్రకవిచంద్రునిచే గీర్వాణభాషలో విరచిత మగు రత్నావళీనాటిక నితఃపూర్వము పలువు రాంధ్రీకరించియున్నారు. రాజమహేంద్రవరప్రభుత్వ కళాశాలాచార్యవర్యు లగు "విద్వాన్ గ. శ్రీ. న. ఆచార్య, యం ఏ. బి. ఇడి గారును శ్రీ మానాప్రగడ శేషశాయి బి. యే గారును గలిసి యొక యాంధ్రానువాద మొనరించియున్నారు. తమ దృశ్యకావ్యకుసుమముచేఁ దమ తమ పితృదేవతలపదపంకజముల నర్చించి కృతార్థులైనారు. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికమున నిందలి విశేషముల స్థాలీపులాకన్యాయముగ నించుక పరిశీలింపవలసియున్నది. ఈకవివరులయనువాదపద్ధతి యాంధ్రముకంటె నాదరభాషనే యమితముగ నాశ్రయించినది. గ్రంథ మాద్యంత మోజోగుణవిరాజితమై మనోజ్ఞమగు శయ్యలో సాగినది. అచటచటఁ జక్కఁగ "ఒడలెఱుంగక, నాయన్నవారు లేరు, దినదినగండము" మున్నగు లోకోక్తులు ప్రయోగింపఁబడినవి.

"జలజలరాలు పుష్పగత సౌరభవాసి వధూముఖోద్గర
జ్జలబకుళంబులున్, మధువశ ప్రియదాముఖచంపకంబులున్
విలసదశోకపాదహతి విద్ధరణత్కలనూపురస్వనం
బుల ఝుళిపించుఝుంకృతులఁబొల్చు షట్ప్రియతాపరమ్యలై"
"ద్వారములన్ గమించి యనుధావితసాంద్రమహాఫలమ్మై, గ్రీస
చ్చారు విలాసినీగతిభిదంబయి, వలునిలాగ్రసూక్ష్మ ఘుం
టారమమాణచాలనమునై, పరిశిష్టహవ్యనిశ్శ్రేణిలా
హార వికర్షకల్పవగ మాపరిభు మంగరమున్ విశించెడిన్"

ఈ పద్యము లోజోగుణదర్శనమునకై యుదాహృతములు. నాంది యందలి తొలిపద్యము మూలశ్లోకమును మిగుల ననుసరించినది కాని

"స్తనభరేణానీతయా నమ్రితా" మను దానిని "కుచస్థాల్యమ్మునక వంగి"యని యనువదించుటలో సొగసు కానరాదు. కుచభర మనుటయే లెస్స. యతికొఱకట్లు ప్రయోగింపక తప్పినదికాదు కాఁబోలును. మఱియు నాందియందలి నాలవపద్దియమున "చపలగణహృతోష్ణీష పట్టాః యనువాక్యమునకు "ఋత్విగ్వార ముష్ణిముల్ పోవక" అని మాత్రమే తెనిఁగింపఁబడినది.

"దక్షస్త్రాతి-అస్యపత్నీ విలపతి కరుణం-విస్మితంచాపి దేవైః-శంసన్ని త్యాత్తహాసః మఖమథనవిధౌ పాతు దేవ్యై శివో వః" అను మూలమునకు "దక్షుఁడు గొల్చె తత్సతియు వాపోవక చనక దేవతల్ దేవి యంచు మఖస్థితిం దెలుపు నా దేవుండు మిమ్మోమ్ముతక" అని యాంధ్రీకరింపఁబడినది. ఇందు "వాపోవక" అనునది యేకాలము? "దేవతల్ చని" రనియుండనగును గాని "చనక"అని యనవచ్చునా? మఱియు మూలమందలి 'ఆత్తహాస'శబ్దముఁ బరిహరించి భవుఁడు భవానిని బరిహసించు విషయము బ్రస్తావింపకుండుటచేఁ బ్రధానభావమునకే భంగము వాటిల్లినది.

మఱియు నాందిలోని 8వ పద్యమున 'సాక్షాత్కుసుమచాప ఇవ'అను దానికి 'అపరపుష్పేషుఁడనగ'యనునది సరియగు ననువాద మని తోఁపదు. ఏమన 'మన్మథుఁడే'యను నిశ్చితవాక్యమునకును 'మఱియొక మన్మథుఁ'డనుటకును విభేదము లేదా?

"ఉద్భ్రామద్ప్రమదాకపోలనిపతత్సిందూరరాగారుణైః (అం1ప11) యను మూలమునకు 'సత్తనావివశవరాప్రమదాజన గండపాళి' యని భాషాంతరీకరణము గావింపఁబడినది. ఇందు సత్తనావివశమైనది ప్రమదా జనమా? గండపాళియా? అట్లుల్లేఖించుట సంస్కృతసంప్రదాయము గావచ్చునుగాని యాంధ్రమున సట్లపరాదు. మూలవిరుద్ధముకూడ.

పుట 18లో "అఃదాస్యాఃపుత్రి !"యను విదూషకకృతనిందా భాషణమునకు 'ఓసీ! దాసీపుత్రీ'యని యనువదించిరి. దాస్యాఃపుత్రి

యను నలుక్సమాసమున కర్థము "లంజకూతు"రనియే కాని పరిచారికా తనయ యను నర్థము కానేరదు.

సఖీద్వితీయయై మహారాజ్ఞి కామపూజానిబద్ధబుద్ధియై యున్న తఱి హఠాద్గతి వత్సరాజు సమీపించి పలుకరించినాఁడు. అట్టి యాకస్మిక దర్శనానపరమున "కథ మార్యపుత్రః (ఆర్యపుత్రులా!) అని హర్ష సంభ్రమ సూచక వాక్యరత్నము పతిగతానురాగిణి యగు రాణి నోటినుండి యప్రయత్నముగ జాఱించినాఁడు హర్షకవిశేఖరుఁడు. మా కవియుగళ మద్దాని నుపేక్షించుట రసౌచితీభంగహేతువేమో!

23 పుటలోని 20 పద్యము మూలార్థప్రతిపాదిని యని యనజాలము. 25 పుటలో "స్వస్తివాయనము"నకు "స్వస్తివాచన"మని రెండుతావుల నుడువఁబడినది. వాయన మనఁగా వ్రతోద్యాపనసమయమున నుపాయనముగ నొసంగఁబడు మోదకాదికము. వాచన మన నేమియో! - దానిని గ్రహించుటయేమో తెలియకున్నది.

"ప్రాక్సతీముఖపాండిమాంబడిగో! ఉదయనా (20పు24పద్యము) యను తేటగీతియందును, "ఇరువురు మాటలాడినను స్వీయకథే యని బాధసందేశి" (55 పు 50 పద్య) అను చంపకమాలికాద్వితీయ చరణమునను గన్పట్టు విశ్రమభంగము ప్రామాదికము కావచ్చును. కాని "స్వీయకథేయని"యను సత్వసంధి యప్రశస్తము.

"ప్లవగమాప్రభుమందిరమున్ విశించెడిన్" (పు 31 పద్య 27) అను తావున "విశఉపవేశనే"యను ధాతువునకు "విశించు"అనురూపము యత్నసాధ్యము.

(పుట 43 పద్య 39) "వక్షునిక్షిప్తపద్మినీపత్ర"మని లిఖింపఁబడి యున్నది. వక్షశ్శబ్దము నకారాంతముగఁ బ్రయోగించి యుండుట మృగ్యము. "వత్సనిక్షిప్త"మను మాటకు మాఱుగ నీ రీతి ముద్రాపక ప్రమాదముచే నచ్చుపడెనేమో తెలియదు.

"అంతర్మన్మథోత్థా మవస్థాం" అనుదానిని "గుండెలో మంట" యని తెనిఁగించుట యనుచితము - విరసము.

పూర్వార్థమునఁ జెప్పబడినది. సంపర్కము గల సరోజములకాంతి పాదములచే నపహృతమైనది. ఇక చేయునదిలేక చక్రములు చంక్రమః పాదసేవకుఁ బాల్పడినవి"అని సమర్థించుకొనినఁ గొంతదిగ సమంజసముగ నుండునేమో విచారింపవలసి యున్నది.

ప్రతిరచయితకును గ్రంథాలలో నెలుసులు గల్గుట సహజము. ఏది యెట్లుండినను నిందలి ధారాశుద్ధి ప్రశంసనీయము - మూల రచయితకు - నందు ప్రధానముగ గ్రంథకావ్యరచయితకుఁ గల స్వేచ్ఛ, యతిప్రాసవిశేష్యవిశేషణ క్రమాది నియమ నిర్బంధము లగు నాంధ్ర పద్యములలోని కనువదించువారికి గలుగదు. ఒక భాషలోని యొక్కొక శబ్దమునకు దులయగునది వేఱొక భాషలో నుండకపోవచ్చును. అంతమాత్రమున నది కవి యశక్తతకు నిదర్శనము గాఁజాలదు.

భాషాపట్టభద్రులును, ప్రధానాచార్యులును నగు నీ కవి మహోదయులచే రచింపఁబడిన నాటిక నింత సూక్ష్మముగ సమీక్షించి నందులకు నన్ను వారు సరసహృదయులు గావున మన్నింపకపోరు. నాచే సూచింపఁబడిన విషయములలో యుక్తముల స్వీకరించి తదన్యములఁ బరిహరింపఁ బ్రార్థితులు.

మా కవిమిత్రు లితోధికముగ మనోజ్ఞకావ్యరచనల సంతరించుచు యశోధనముల నార్జించుకొను శక్తిని మా హరిహరదేవుఁడు ప్రసాదించుగాక.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# ఆంధ్ర 'రత్నావళీ' నాటిక సమీక్ష

శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి.

ఒక శ్రవ్యకావ్యము గాని దృశ్యకావ్యముగాని యేదేని యొక భాషలో నాగియుండు రచించుటలోఁ గల స్వేచ్ఛ, సౌలభ్యము, శయ్యాపాకాదికమును, భాషాంతరీకరణమున నలవడుట దుస్సాధ్యము. ఒకభాషలోని యొక్కొక శబ్దమునకు సమాన మగునది మఱియొక భాషలో లభింపకపోవచ్చును. కవితాపరిణతిఁ గాంచిన మూలానువాద రచయితలనాటకములే సకలజనహృదయాకర్షణచణములై గణుతిఁ గాంచును.

మహారాజ శ్రీహర్ష విరచిత మైన రత్నావళీనాటికను సంస్కృతమునుండి యాంధ్రీకరించిన పలువురుసత్కవులలో శ్రీ సామవేదం జానకరామశర్మగారొక్కరు. శ్రీ శర్మగారి తెనుఁగు నుడికారము మనోజ్ఞ మైనది "శ్రీహర్షోనిపుణః"అను శ్లోకమున "నాట్యే చ దక్షావయమ్"అను వాక్యమునకు "నాట్యమ్ము మాపాలమ్ము"అని స్వేచ్ఛానువాదమొనరించి తమ తెనుఁగుదనమును ప్రౌఢగతి గమకమింపఁజేసినారు శర్మగారు. మఱియు "ద్వీపాంతరాదపి"యను శ్లోకము ననువదించుచు "అభిమత" శబ్దమునకు "అభిమత మైనదాసి"యని పలికి యిష్టురాలగు రత్నావళిని, నిష్టవస్తువును నను నర్థద్వయము ధ్వనింపఁజేసి తమ రచనాపాటవమును బాహాటించినారు. "ఏవ మేతత్, కస్సందేహః" అని మూలమున నున్నను యౌగంధరాయణునిచేఁ దదనంతరాత్మగత భావముల ననుసరించి "అవును; అది యదార్థమే యగును. సందేహము లేదు"అని చక్కఁగ, సస్వభావముగ స్వాతంత్ర్యము గైకొని తెనుఁగొనరించి మూలాధికౌచితి సంతరించియున్నారు.

"ఉద్యద్విద్రుమకాంతిభిః" అనుదాని యనువాద పద్యము "[illegible]ములట్లు క్రొంజివురుభాసిల నెట్టుఁగ"అనునది సరస శయ్యాంచితమై సమగ్ర భావబంధుర మై సహృదయాహ్లాదజననమునకుఁ గారణ మగుచున్నది.

యతిప్రాసాన్వయక్రమాదినియమనిబద్ధము లగు నాంధ్రపద్యములలోనికి మూలశ్లోకములఁ బరివర్తన మొనరించుటలోఁగల యసౌలభ్యము కాదాచిత్కముగ శ్రీ శర్మగారి యాంధ్రానువాదమున నచటచట బొడచూపకపోలేదు. ఉదాహరణమునకుఁ బ్రథమాంకమున నాంది పద్యమున "హ్రీమత్యా"యను నతిప్రధానపద ముపేక్షింపఁబడినది. మఱియు రెండవ పద్దియమున "నవే సంగమే" యను పదములు ప్రధానములయ్యును బర్యుదాసింపబడినవి.

"ధారాయంత్రవిముక్త"యను ౧౧ శ్లోకమున "ఉద్దామప్రమదాకపోలనిపతత్సిందూరరాగారుణైః" అని యుండఁగ "పైన వాలు ప్రమదాళి కపోలపు సిందురమ్ముచే"యని మాత్రమే లిఖింపఁబడి వాక్యమునకుఁ బ్రాణపదమగు 'నుద్దామ'శబ్దమునిష్కాసింపఁబడినది. 'ఉద్దామ' శబ్దమునకు అప్రతిబద్ధానాం యథేచ్ఛం క్రీడంతీనాం' అను విశేషణము ప్రమదాశబ్దమునకు సంఘటించి సిందూరపతనకారణము నిరూపింపఁబడినది.

"ఏతదపి సువిదగ్ధజనజలభరితశృంగకజలప్రహారముక్తసీత్కారమనోహరం వారవిలాసినీజనవిలసిత మాలోకయతు ప్రియవయస్యః"అను తావున ("సీత్కార మనోహర మైనది వారవిలాసినీజనవిలసన")మని మూలమున విస్పష్టముగనుండ"సీత్కారరవసౌందర్యమును, వా[illegible]ల సుందరక్రీడలను దిలకింపు"మని వ్రాయుట సువిచార్యము.

"కిమేతేన ఖండేన మోదకాః క్రియంతే"అను విదూషకప్రసంగమున మోదకమునకు 'లడ్డు'అనియాంధ్రీకరింపఁబడినది. లఁడ్లనఁగా మోదకములు (జిల్లేడుకాయ లను భక్ష్యవిశేషము) గాక మిఠాయియేమో.

మఱియు విదూ:—"ఆః దాస్యాఃపుత్రి"యనుదానికి "ఆఁ దాసీపుత్రికలారా!" యని తెనుఁగొనరింపఁబడినది. దాస్యాఃపుత్రి! యని యలుక్సమాస మొనరింప "లంజకూతు"రను తిట్టగును. దాసీపుత్రి యన వ్యభిచారిణి గాదు.

శ్లో॥ ఇహ ప్రథమం మధుమాసో, జనస్య హృదయాని కరోతి మృదులాని
పశ్చాద్విధ్యతి కామో, లబ్ధప్రసరైః కుసుమబాణైః.

అను శ్లోకమునకు "తొలుత వసంతుఁడు విరహజనుల మానసములను మెత్తపఱచినాఁడు. పిదప "మదనుఁడు కుసుమబాణములచే వేధించు చున్నాఁడు" అనుదాని కనువాదముగ శ్రీ శర్మగారు—

"ఎల్లెడఁ బూచిన యీ వసంతాన, నల్లమ్మ్మ లొక్కట బల్లవింపంగ
గుసుమాస్త్రుఁడాపైన గోల్కొలఁ బెంచి, పసడించి తరుణుల బాధించునదిగో."
అని రచించి మూలమున కించుక దవ్వునకుఁ దొలంగినారు.

"దయపుసు డాఁగె చెల్ల చెదరైరి కిరాతులు పేరుకుం దగన్"
అను చంపకమాలావృత్తమున నఖండయతిశర్మగారికి సమ్మతిముగానోపు

"పేగుకు" "తంతువుకు" మొదలగు ప్రయోగములు కవిత్రయ సమ్మతములు గాకున్నను బోతనాది ప్రయుక్తము లగుటచే నైచ్ఛికము లనవచ్చును. మఱియు "చేతురు, కోతురు" ఇత్యాదు లసాధువులుగఁ బేర్కొనఁబడినను నిందు కొన్నితావులఁ బ్రయోగింపఁబడినవి ఒక శ్రేణికిఁ జెందిన యాధునికకవుల సంతుష్టి నాకాంక్షించి కాఁబోలును శ్రీశర్మగారు "విధాలు, ఎక్కాన, కంఠాన, రాగాన" మొదలగు పద ప్రయోగములు గావించి యున్నారు.

ఏమైనను సుశిక్షితులగు కవులకైనను నెఱసులు గల్గుట సహజము. వాని నట్లుండనిందు (1) "మృదులమగు పాణిపల్లవము" (2) విరహాపాం డురముఖముచే, (3) "ప్రియురాలా! దయఁ జూడు మంటకు" మొదలగు ననేక పద్యములు హృద్యములై సరసశయ్యావిస్పష్టభావప్రకటన పటీయములై యీ గ్రంథమున నలరారుచున్నవి. మొత్తముమీఁద శ్రీ జానకిరామశర్మగారి యాంధ్రీకరణము సరసముగ, సర్వజనతాస్వాద నీయముగ నున్న దనుటయే నా సంగృహీతాభిప్రాయము.

శ్రీ శర్మగా రిత్తోధికముగ ననేకకృతులు రచించి యాంధ్ర భారతి నర్చించుచుఁ గృతు లయ్యెదరుగాక.

అనువదింపఁబడిన యీరత్నావళీ నాటికను గృతిగొన్న శ్రీ గోపా లకృష్ణమహారాజులు కవిభాషానిరంతరాదరణచతురతకు శుభమగుగాక.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

## ప్రతిష్ఠాపకులు

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యరావు బహద్దరువారు సి. బి ఇ. డి. లిట్., పిఠాపురము మహారాజులుంగారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు.
(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు)

## అధ్యక్షులు

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసమ్రాడిత్యాది, బిరుదాంకితు లగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

## కార్యదర్శులు

సాహిత్యశిరోమణి, ఉభయభాషాప్రవీణ, చతుర్వేదుల సత్యనారాయణగారు, ఎం. ఏ., బి. ఒ. యల్.

శ్రీ ప్రతివాదిభయంకర పార్థసారథిగారు, బి. ఏ., యల్. యల్. బి.

## కోశాధ్యక్షులు

శ్రీ ప్రతివాదిభయంకర పార్థసారథిగారు, బి. ఏ., యల్. యల్. బి.

## కార్యనిర్వాహకసభాసభ్యులు

శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు.

శ్రీ రా. సా. మాదిరెడ్డి సీతారామయ్యగారు, బి. ఏ. బి. ఎల్.

శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి. ఇ.

శ్రీ వార్తకవి నారాయణరావుగారు, ఎం. ఏ., ఎల్. టి.

శ్రీ వ్యాకరణ విద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.

కవికంఠీరవ, కవిమూర్ధన్య శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు.

శ్రీ బండారు తమ్మయ్యగారు

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు

శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు

---

రిపబ్లిక్ పవర్ ప్రింటింగు వర్క్సు, కాకినాడ.